# వచన బసవ పురాణము

రచన :

కళాప్రపూర్ణ
నిడుదవోలు వేంకటరావు

ప్రచురణ :
శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున దేవస్థానము
శ్రీశైలం
1981

# విషయానుక్రమణిక

# విజ్ఞప్తి

ఆంధ్రవాఙ్మయమున అందులోనూ శైవవాఙ్మయమున పేరెన్నిక గాంచిన గ్రంథము లెన్నియో గలవు. వానిలో శ్రీ పాల్కురికి సోమనాథునిచే రచింపబడిన ద్విపదకావ్యములు 1. బసవపురాణము 2. పండితారాధ్య చరిత్ర ముఖ్యమైనవని చెప్పవచ్చును. ఈ రెండును ఒకప్పుడు జనసామాన్య మున ఆంధ్ర కర్ణాటక దేశములలో బహుళ ప్రచారము గలిగియుండుట పాఠకులకు, పండితులకు సంవిదితమే కాని యీ రెండు కావ్యములు యీనాడు ప్రజా సామాన్యమునకు అందుబాటులో లేకపోవుట శోచనీయము.

ఈనాడు పద్యకావ్యముల కెక్కుడు ప్రచారము గాన్పించుట లేదు. పైగా యీ బసవపురాణము, పండితారాధ్యచరిత్ర యీ శ్రీశైలమహాక్షేత్రముతో ముడి వడియున్నవి. అందువలన వీరశైవవాఙ్మయమునకు పునాదియైన యీ బసవ పురాణమును సులభశైలిలో తెలుగు వచనమున ప్రకటించి భక్తుల కందించ వలయునని యెంతకాలము నుండియో ప్రయత్నించు చున్నాము. తుదకు కళాప్రపూర్ణ శ్రీనిడుదవోలు వెంకట్రావుగారు బసవపురాణమును తెలుగువచనము వ్రాసి, మా దేవస్థానపు మాజీ ధర్మకర్తల మండలి అధ్యక్షులైన శ్రీ ఎస్. బి పి. బి. కె. సత్యనారాయణరావు గారి కృషివలన మాకు సర్వస్వామ్యములతో నప్పగించి మాకోర్కెను ఫలింప జేసిరి.

సమసమాజ స్థాపన కేనాడో పునాదు వేసిన శ్రీ బసవేశ్వరుని పురాణ మును శ్రీశైలదేవస్థానము వారు ప్రకటించుట ఎంతయు సముచితము. జాతి మత, కుల, వయో, లింగభేదములు లేక శ్రీమల్లికార్జునస్వామి దర్శన స్పర్శన భాగ్యము లెల్లరును అనుభవించుచున్నారు. అట్టి యీ మహాక్షేత్ర పాలకవర్గము శ్రీ బసవపురాణమును ప్రకటించి శైవభక్తులకే గాక ప్రజాసామాన్యమున కెంతయో యుపకార మొనర్చిరనుట అతిశయోక్తి గాదని నా నమ్మకము.

ఈ బసవపురాణమునకు అనుబంధముగా మల్లికార్జున పండితారాధ్య చరిత్ర లోని, పర్వత ప్రకరణమును కూడ ప్రకటించుట ముదావహమైన విషయమే. బసవపురాణముతోబాటు శ్రీశైలచరిత్రము కూడ భక్తుల కందజేయుచున్నాము ఈ పర్వతప్రకరణమును సహితము మలిముద్రణలో వచనరూపమున ప్రకటించవలెనని ఆశించుచున్నాము. తెలుగులో శ్రీశైల వర్ణన కిది మూలగ్రంథము.

భక్తుల కిది యెంతయు నుపయోగ పడగలదని భావించుచున్నాను.

శ్రీశైలం

12-5-81

భవదీయుడు

యన్. చిట్టిబాబు

కార్యనిర్వహణాధికారి

# ఆముఖము

భారతదేశమున సనాతన మగు వర్ణ కుల మత, వర్గ విభేదములను రూపు మాపి, మానవతావిశిష్టతను ప్రతిపాదించినది బుద్ధుడు. కాని అతడు నాస్తికుడు. మానవతావాదియై నాస్తికతను నాశనమును జేసి ఆస్తికతను చిరస్థాయిగా జేసిన మతోద్ధారకుడు బసవేశ్వరుడు.

## వీరశైవ మత విశిష్టత

కుల, మత జాతి, వర్గ విభేదములను కూలంకషముగా నిర్మూలము చేసినది వీరశైవము. జీవించియున్న మానవుడే దేవుడని ప్రకటించినది వీరశైవము. స్త్రీ పురుషులకు సమానత్వ మిచ్చినది వీరశైవము, హరిజనులను హరజనులనుగా మార్చినది వీరశైవము. భారతీయ మతచరిత్రలో విశేష ప్రఖ్యాతి గాంచినది వీరశైవము.

## బసవేశ్వరుడు - మహాత్మగాంధి

మహాత్మాగాంధి కన్నడదేశమున బెల్గాములో జరిగిన దేశీయ మహాజన సభకు వచ్చినపుడు కన్నడదేశ ప్రజ లాతనిని సందేశమునిమ్మనికోరిరి. అప్పుడు గాంధీ మహాత్ముడు "నేను కార్యకర్తలైన మీకు కర్ణాటక ప్రాంతానికి ఏమి సందేశ మీయగలను? ఇప్పటికి 800 సంవత్సరాల క్రితము మహాత్ముడైన బసవేశ్వరుడు ఈపవిత్రభూమిలో జన్మించి అహింస, సాంఘిక సమానత్వము శ్రామిక గౌరవము (కాయకమే కైలాసము) ప్రబోధించి వెళ్లినాడు. ఆయన ప్రారంభించిన కర్మయోగము- ఆయన ప్రాంతానికే జెందిన మీరు పరిపూర్తి చేయుటకు కంటె కావలసిన దేమున్నది." అని చెప్పినారు.

## బసవమార్గము, గాంధీమార్గము,

జాతి కుల మత విభేదములు లేని ఏకైక భారతీయ మహాజనములను ఒకే ప్రజ, ఒకే భాష, ఒకే ధర్మము రాజకీయముగా ప్రతిష్ఠించినది గాంధిమార్గము.

అట్టిది సాంఘికముగ ప్రతిష్ఠించినది బసవమార్గము. భారతీయ జనతా శ్రేయము రెండు మార్గముల లక్ష్యము. ఇది విశ్వవ్యాప్త సౌగాత!

ఈ గ్రంథరచనకు ఎంతేని ప్రోత్సాహమిచ్చిన శ్రీశైల దేవస్థాన కార్య నిర్వాహక సంఘాధ్యక్షులు శ్రీ ఎన్. బి పి బి కె. సత్యనారాయణరావు గారికి నామనః పూర్వక, కృతజ్ఞతా సూచక వందన సహస్రములు. ఈ గ్రంథ రచనమున నాకు చేదోడు వాదోడుగా నున్న చిరంజీవి శివసుందరేశ్వరరావునకు నా లు.

కళాప్రపూర్ణ
నిడుదవోలు వేంకటరావు

# అనుబంధము

## పండితారాధ్య చరిత్ర

బసవేశ్వరుడును తెలుగుదేశమున జన్మించిన మల్లికార్జునపండితుడును సమకాలికులు. బసవపురాణము రచించిన పాల్కురికి సోమనాధుడే పండితారాధ్యచరిత్రను ద్విపదగా రచించినాడు. అది బసవేశ్వరున కంకితము. అందు బసవేశ్వరుని చరిత్ర గలదు. అందు కొన్ని విశేషము లింతవఱకు నాంగ్లాంధ్ర కన్నడ గ్రంథములలో కానరావు. కాబట్టి వానిని వివరించుచున్నాను.

## వీరశైవమతవ్యాప్తి

బసవేశ్వరుడు-1లక్ష 96 వేలమంది వీరశైవులకు విందుపెట్టెనని అల్లమ ప్రభువు తానొక్కడే దాని నారగించెనని ముందు తెలిసికొంటిమి. బసవేశ్వరుని లింగైక్య కాలమునకు మరి 1లక్ష 84వేలమంది వీరశైవు లున్నట్లు పండితారాధ్య చరిత్రను బట్టి తెలియుచున్నది. దీనిని బట్టి బసవేశ్వరుని కాలమున కల్యాణ కటకమున-

3 లక్షల 80 వేలమంది వీరశైవు లున్నట్లు విశదము.

## బసవేశ్వరుడు విషము త్రాగిన మహిమ

మల్లికార్జునపండితుడు బసవేశ్వరుడు విషము త్రాగిన విషయము తన శివతత్త్వసారమున నిట్లు ప్రశంసించినాడు.

ఆసమేక్షణ శివభక్తుం
డసమశ్రేష్ఠుఁడని పలికి యన్యులతోడన్
పొసపోరై బండారువు
బసవన విషమెత్తి త్రావి బ్రదుకడె రుద్రా! (451)

ఏనుధ నుమేశుఁడె దైవము
ప్రసాదము పవిత్ర మీశుభక్తులె కులజుల్
పొసపోరని బండారువు
బసవన విసమెత్తి త్రావి బ్రదుకడె రుద్రా! 452

కుసుమశరారీ! శివలిం
గసమేతులు దక్క పొందఁ గాదని నిర్మా
ల్యాసుఖం బని బండారువు
బసవన విసమెత్తి త్రావి బ్రదుకడె రుద్రా! 452

పై విషయమేకాక, బసవేశ్వరుని సమకాలమున విలసిల్లిన వీరశైవ భక్తులలో బసవపురాణమున విడువబడినవి కొన్ని చెప్పబడినవి. పండితారాధ్య చరిత్రమున బసవని శివయోగమహిమ సవిస్తరముగా వర్ణితము. పండితారాధ్యునికి బసవేశ్వరుడు లింగైక్యము నందిన సంగతి ఎనిమిదిదినముల తరువాత తెలిసినది. పండితుడు చాల విలపించినాడు. ఆతడు బసవేశ్వరునిచే ప్రభావితుడై తెలుగుదేశమున ఆరాధ్యవీరశైవమును వ్యాప్తి గావించినాడు.

బసవపురాణముతో పండితారాధ్యచరిత్ర యందుగల బసవేశ్వరచరిత్ర ప్రశంసలు కలిపి ముద్రించి ప్రకటించిన, బసవేశ్వరుని చరిత్రయే గాక వీరశైవమత వ్యాపన మాచంద్రార్కముగా నాంధ్ర వాఙ్మయవీధి ప్రకాశింప గలదు. సంగన బసవన - బసవరాజు - బసవలింగము - బసవేశ్వరుడు - అనువిశ్రుతి గాంచిన బసవేశ్వరుని చరిత్ర - కన్నడాంధ్ర దేశముల శాశ్వతముగా వెలయ గలదు.

అట్టి కార్యము త్వరలోనే జరుగును గాక! ని. వేం.

శివమ్ భూయాత్



బసవేశ్వరుడు

శ్రీ శివాయనమః.

# బసవపురాణము-ప్రథమాశ్వాసము

శ్రీలకు నిలయమైన కైలాసమున శివుడును పార్వతియు సుఖసత్కథా వినోదగోష్ఠి నుండగా నారదుడు వచ్చి హరునితో నిట్లు విన్నవించెను—"దేవా! లోకములో శివభక్తి ఏమాత్రమును లేకయున్నది. అందలి ప్రజలు కొంద ఱానందమగ్నులై శివదైవమును మఱచినారు. మఱి కొందఱు భక్తియుక్తులైనను నితరుల బోధనల వలన అన్యదైవముల నర్చించుచున్నారు. అన్యదేవతా భక్తి కన్న శివభక్తి మిన్నయని నిరూపించుచు లింగజంగమప్రసాదస్థల సంపన్నులై జగజ్జనులు వెలయునట్లు చేసి నీవే భూవలయమున నవతరించి శివభక్తిని శాశ్వతముగ నిలుచునట్లు చేయ ననుగ్రహింపుము."

నారదు డిట్లు చెప్పగా మారారి యిట్లు చెప్పెను—"నందీశ్వరునకు నాకు భేదము లేదు. గావున నేను నందీశ్వరుడనై శైవభక్తిని పరివ్యాప్తము చేయుదు" నని చెప్పెను. అంత నుమయు "నందీశ్వరునికి మీకును భేదము లేదనిరి. ఆ నందీశ్వరుని వృత్తాంతము నెఱుగజేయుడు" అని వేడెను. శివుడును నిట్లు చెప్ప దొడంగెను.

## శిలాదుని తపస్సు

శ్రీగిరి నైరుతి దిక్కున శిలాదుడను నాతడు కందమూలములు, గాలి, సూర్యచంద్రకిరణములు నాహారముగా మూడుకోట్ల సంవత్సరములు గాఢమైన తప మాచరించెను. శివుడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనెను. అంతట శిలాదుడు "నీయట్టి వానిని సుతునిగా దయచేయు" మనెను. వెంటనే పరమేశ్వరుడు "నాకు వాహనమై ననవరతము నావద్ద నుండు వృషభమే నందీశ్వరుడను పేర నీకు జన్మించును" అని వరమిచ్చెను. "భక్తి యందణుమాత్రమైన

దక్కువ గలిగిన సుతుడనైనను తల ద్రుంచివైతు"నని శివునికి తన నిర్ణయమును చెప్పెను.

## నందీశ్వరుడు-ప్రమథగణపదవి

నందీశ్వరుడు పుట్టినతోడనే శివుడు వరమడుగుమని చెప్పెను. 'నా కే పదవియు నక్కరలేదు. నీ సదమల భక్తిని ప్రసాదింపు'మని వేడెను. శివుడు నందీశ్వరుని వాహనముగా చేసుకొనెను. ప్రమథేంద్రపదవికి నందిని పట్టము కట్టెను. నందీశ్వరుని పుణ్యతపముచేత శ్రీగిరి నైరుత్యభాగంబు నందిమండల మని పేరు కాంచెను.

భూలోకమున భక్తహితార్థంబు పరమార్థంబుగా శివభక్తిని పెంపొందించుటకు శివుడు నందీశ్వరుని జూచి "నీవు నరలోకమున బసవేశ్వరుడవై పుట్టి శివతత్త్వమును ప్రబోధింపజేయు"మని పంపెను.

## బసవేశ్వరుని జననము

శ్రీశైల పశ్చిమదిశను కన్నడదేశమున హింగుళేశ్వరభాగవాటి అను నగ్రహారము గలదు. అందు మండెగ మాదిరాజను బ్రాహ్మణోత్తముడు గలడు. ఆతని పరమసాధ్వి మాదాంబ. ఆమె నిత్య శివాచారసంపన్నయై శివుని గొల్చుచుండెను. సతీపతు లిరువురు సంతత సౌఖ్యముల దేలియాడుచున్నను వారలకు సంతతి లేకుండుటచే చింతాక్రాంతులైరి. సంతానలబ్ధికై మాదాంబ ఎన్నియో నోములను నోచెను. కాని ఫలితమగపడలేదు. తుదకామె కార్యార్థసిద్ధికి కారణమైన నందీశ్వరుని నోము నోచెను.

## నందీశ్వర వ్రతము

మాదాంబయు మానితంబైన శ్రద్ధతో నచ్చటనున్న శివాలయమున కరిగి యచ్చట నందిని సోమవారముతో మొదలుపెట్టి తొమ్మిది దినములు పూజించెను. పదవనాడు నందికి స్నానము చేయించి, చందనకుసుమము లర్పించి మెత్తని వస్త్రము మెయినిండ గప్పి, ఉత్తమాభరణములు, అంచెలు, గంటలు తూర్చెను. కొమ్ములకు పసిడి తొడుగులు తొడగి ఫాలతలమున పట్టముగట్టి అక్షతధూప

దీపాదుల నొనరించి పులగము, పంచభక్ష్యములు నివేదనము గావించి" నీవంటి పుత్రుని నొసగు"మని ప్రార్థించి నిజవాసమునకు పోయెను. మాదాంబా మాది రాజు లిరువురు యనురాగముతో మసలిరి.

మాదాంబకు నెల మసలెను. తొమ్మిది నెలలు నిండెను. కాని పురుడు రాలేదు. రెండవ తొమ్మిది నెలలు గడచెను కాని పుత్రజననము కలుగలేదు. మూడవ తొమ్మిది నెలలు గడచెను. అట్లే యుండెను. ఇట్లు మూడేండ్లు గర్భ భారము వహించి ఖిన్నురాలై మాదాంబ నందీశ్వరునికి నతి దీనముగా తన స్థితిని విన్నవించెను.

అంతట శివుడు జంగమ లింగమూర్తియై మాదాంబకడకు వచ్చి "నీవు చింతిల్లకుము. నీ కడుపులో నున్నవాడు లోకపావనమూర్తి. శిలాదుని కొమారు డగు నందీశ్వరుడు. అతడు వృషభావతారము. శివుని యాజ్ఞచొప్పున భూలోకమున నీకు సుతుడుగా నవతరించును. వానికి 'బసవన' అని పేరు పెట్టుము" అని చెప్పి యదృశ్యుడయ్యెను.

అంత నొక అర్ధోదయమున పుత్రుడు జన్మించెను. అతడే బసవేశ్వరుడు. అప్పుడు కూడలి సంగమేశ్వరుడు జంగమవేషమున వచ్చి "నేను కూడలి సంగ మేశ్వరుడను. నీకు పుట్టిన సుతుడు లోకహితార్థమై జన్మించెను. ఇకమీదట ఇతనికి నేనే గురువును. కావున నిరంతరము నిత్య లింగార్చనాపరత్వమున మెలగుచుండి నీతని పెంచుము" అని అదృశ్యు డయ్యెను.

## బసవేశ్వరుని బాల్యచేష్టలు

ప్రజలు శివుని మఱచి చీకటిలో నున్నారని యపహసించినట్లు బసవన నవ్వుచుండును. శివప్రసాదము స్వీకరించినట్లు తల్లిపాలు గుడుచును. తను వచ్చిన పనికి తడవయ్యెనని నులుకుచుండుచు. శివుని గూర్చి పాడుచు ఆనంద బాష్పములు రాల్చును. మఱుగుపడ్డ శివభక్తి మఱల తలయెత్తినట్లు తాను తల యెత్తుచుండును. తాను ద్వితీయ శంభుడను భావనతో నేలమీద దోగియాడును. వీరమాహేశ్వరాచారము ప్రోవై నిల్చిన పోల్కి నిల్చును. ఆటపాటలను నన్ని రీతుల శివార్చనను చేయును. సర్వజ్ఞుడైన వృషభమూర్తిగాన సకలవిద్యలు నాతనికి సహజముగా నలవడినవి.

4

## బసవేశ్వరుని ఉపనయనము — తండ్రితో వాదము

బసవనకు ఎనిమిదవ యేడు రాగానే తండ్రి యాతనికి ఉపనయనము చేయ సమకట్టెను. అంత బసవన్న తండ్రితో నిట్లనెను: "ఈశ్వరుని గొలిచియు నీవు జడుడవై యిట్టిపనికి పూనితివి. పరమాత్ముడగు శివుని గురునిగా బడసిన నరులకు మానవుడైన గురువెట్లు గురువగును? గురుకృపచే జన్మించినవానికి కర్మబంధము దుష్కర్మము. కర్మపాశములు తెగవ్రేయుటకు జనించిన నేను కర్మంబులకు చేయు త్రాళ్ళను కట్టుకొనను. వడుగు కర్మబంధము-దాన్నికి మంత్రము గాయత్రి. ప్రతిదినము కర్మము చేయుట ముక్తిదాయకము కాదు. ఉపనయనము గురూపదేశము. నరగురు సంబంధమైనది. శివుడు నొక్కడే గురువు. ఆతనికి మించిన గురువు లేడు. అతడే గురువు, దైవము. నిరంతరము నాతనినే స్మరించి ధ్యానము చేయవలెను. అన్యదేవతా స్మరణమున నిరువది యెనిమిది కోట్ల నరకములు గలుగునని వేదము తెల్పుచున్నది. సహజముగా లింగస్వరూపుడగు శివుని గూర్చిన భక్తి కులసతి వంటిది. బ్రాహ్మణకర్మమార్గ ప్రసక్తి వెలయాలు వంటిది. ఇలవేల్పువైన ఈశ్వరుడుండ పలువేలుపుల గొల్చుట పాడి గాదు. బ్రాహ్మణభక్తి కేవలము కర్మమార్గము. వీర మాహేశ్వరాచారమగు శివభక్తియే సకలార్థ మానవాభ్యుదయ సాధనము. నాకు శివుడే తండ్రి, పార్వతియే తల్లి. ఆ దివ్యాదిమ దంపతుల సుతుడనైన నాకు మానవులు తలిదండ్రులు కారు. ఉపనయనము నంగీకరింపను" అని వాదించెను. తండ్రి యెంత చెప్పినను కుమారుడు వినడయ్యెను. తండ్రి విసిగెత్తి అడుగుట మానివేసెను. తుదకు బసవన తలిదండ్రులను విడిచి పణిహారి ఇంటికి తన సహోదరి నాగమాంబతో చేరుకొనెను. బసవన వడుగు నాటికి మేనమామ బలదేవదండ నాయకుడు వచ్చెను గాని వడుగు కాకపోవుటచే తిరిగి వెడలిపోయెను. ఆతనికి గంగాంబ యను కూతురు గలదు. ఆమెను "శివభక్తునికి గాక భవునకీయ"నని బాస చేసెను. మేనల్లుడు బసవన మొక్కవోని భక్తుడగుట చూచి తన కూతును బలదేవుడు బసవన కిచ్చి వైభవోపేతముగా 'వేదోక్తశివధర్మపద్ధతి'లో వివాహము జరిపించెను.

పెండ్లికి నేతంతును లేదు. మంగళవాద్యములు లేవు-వేదమంత్రములు లేవు- విప్రులు లేరు- అగ్నిహోత్రము-మంగళసూత్రధారణ లేదు. వధూవరులు చూచుకొనుటయే లగ్నము; పెండ్లియగుటయే ముహూర్తము. భక్తుల దీవనయే బలము.

ఇట్టి పెండ్లి యెచ్చటను చూడలేదని జను లాశ్చర్యపడిరి.

## బసవేశ్వరుడు కప్పడి సంగమేశ్వరమున కేగుట

"కప్పడి సంగమేశ్వరమున మా గురు దేవుడున్నాడు. అతనిని సేవింప వలయును" అని బసవేశ్వరుడు తన భార్యతోడను సోదరి తోడను బలదేవు డనుపగా నచ్చటికి వెడలెను.

సంగమేశ్వరమున దేవుడు కూడలి సంగమేశ్వరుడని యారాధితుడగు చుండును. ఆ క్షేత్రమున నరశివభక్తులు చిరజీవులు. స్త్రీలు పరమ పతివ్రతలు. పలుకులన్నియు శివతత్త్వ భక్తి ప్రతిపాదకములు. అచట సర్వము శివ మయము. అచ్చట యాలయమున బసవేశ్వరుడు చిరకాలము శివు నర్చించెను.

కూడలి సంగమేశ్వరుడు ప్రత్యక్షమై లోకములో శివ భక్తిని ప్రబో ధించి వ్యాప్తిచేయుమని బసవన కిట్లుపదేశించెను:

1. భక్తి పథమునందు దక్క వేఱు మార్గమున నడువకుము.
2. శివుని భక్తుల దుశ్చరితములనైనను దోషములుగా భావింపకుము.
3. శత్రువులైనను లింగ సహితులైన మిత్రులుగా జూడుము.
4. పట్టినవ్రతము ప్రాణాంతకమైనను విడువకుము.
5. శివభక్తులు తిట్టిన, కొట్టిన, కాలిచే మెట్టిన శరణు అని వేడుము.
6. పరస్త్రీలను నెన్నడు కన్నెత్తి చూడకుండుము.
7. శివప్రసాదము దక్క తక్కినది హేయమని నెంచుము.
8. శివభక్తిని చెడనాడు ఖలులను సంహరింపుము.
9. వేదశాస్త్రోదితమైన శివభక్తిని శాశ్వతముగ జగమున ప్రతిష్ఠించుము.
10. సత్యమునే ఎల్లప్పుడు పలుకుచుండుము.

11. ఎవ్వరికి హింస చేయకుము.

12. సకల మానవులను సౌభ్రాతృత్వముతో శివ స్వరూపులుగా భావింపుము.

బసవేశ్వరుడు పై యుపదేశములను ప్రత్యక్షరము పాటించి వీరశైవ మతాచారనిష్ఠితుడయ్యెను.

# ద్వితీయాశ్వాసము

ఆ కాలమున కల్యాణ కటకమును బిజ్జలుడను రాజు పాలించు చుండెను. తన మంత్రియైన బలదేవదండనాయకుడు బసవేశ్వరునికి తనయ నిచ్చుటయు, ఆతడు ప్రమథలోకమున కేగుటయు బిజ్జలుడు విని తన యాప్తులను కూడలి సంగమమునకు బంపి బసవేశ్వరుని కల్యాణ కటకము పిలిపించెను.

## బసవేశ్వరుడు- భాండాగారాధ్యక్ష పదవి

బిజ్జలుడు బసవేశ్వరునికి మంత్రి, ధనభాండాగారాధికార పదవుల నిచ్చి, రాజ్యభారమంతయు బసవేశ్వరునిపై నిలిపి తాను సుఖముగా ప్రశాంతముగా రాజ్యము చేయుచుండెను. బసవేశ్వరుడు శివానుగ్రహమున శివభక్తిని వర్ధిల్ల జేయుటకు అవకాశము గలిగినదని అత్యంత శ్రద్ధానియమములతో నీ క్రింది ప్రతిజ్ఞలను ప్రకటించెను.

1. శివరాత్రి నిత్యంబుచేయుట.
2. శివభక్తు లెల్లరు శివుడని భావించుట.
3. భక్తుల దోషములను విస్మరించుట.
4. భక్తుల కులమెత్తకుండుట.
5. భక్తులేది కోరిన దానిని యిచ్చుట.
6. ఇతరుల నెన్నడు వంచింపకుండుట,

7. పరసతిపై దృష్టిబరపకుండుట.

8. పరమతవాదులను జయించుట.

9. లింగాంగులను దక్క తక్కిన వారిని వీక్షింపకుండుట.

10. కామక్రోధాదులను నాటించిని జయించుట.

11. ఇంద్రియ నిగ్రహము కలిగి యుండుట.

12. వేదోక్తమైన శివభక్తిని వెలయించుట.

బసవేశ్వరుడు ధీరంపు గట్టు. గంభీరంబు రిట్టు. సత్యంబు కలను, ప్రసాదంబు కొలను, దాంతత కలిమి. నిత్యత్వంబు బలిమి. శాంతత నెలవు. ఈశ్వరు కట్టినలువు. వేదాంతముల పాటి- విద్యల మేటి-వినయంబు తేట-వివేకంబు కోట. అనురక్తి యిల్లు. నుదాత్తత పెల్లు-తత్త్వమ్ము తీగ - మహత్వంబు చేగ-సత్త్వంబు వెన్ను ఆస్థానంబు చెన్నునై యలరారెను.

## బసవేశ్వరుని చూచుటకు శివభక్తులు వచ్చుట- ఆతని శివాచార నిరతి

బసవేశ్వరుని జూచుటకు శివభక్తులు విశేషముగా వచ్చుచుండెడివారు. అందఱును లింగము ధరించువారు. విభూతి రుద్రాక్షలను విధిగా దేహమున వెలయింపజేసెడివారు. వారేకాక శాస్త్రవేదులు సంగీత విద్వాంసులునగు శివభక్తులు వచ్చెడివారు. వారు రాగానే,వారియడుగులకు మ్రొక్కి పాదములను గడిగి పాదోదకము ప్రాశించి, శివానందలీలావారిధి తేలియాడుచుండువాడు. భక్తులయిండ్లకు కావళ్లతో కావలసిన పదార్థములను పంపుచుండెడివాడు. వస్త్రభూషణాదులచే వారిని సత్కరించువాడు. శీలవంతులకు మిండ జంగమములకు కోరినవెల్లను సమకూర్చువాడు- ఇట్లు నిత్యనిరతిశయ శివాచార పరత్వమున నెగడుచు భాసిల్లువాడు.

## బసవేశ్వరుని మేనల్లుడు చెన్నబసవన మహిమ

సహోదరి నాగమాంబ కుమారుడు చెన్నబసవన్న మేనమామ బసవేశ్వరుని తన గురువుగా భావించి ఆతని గొల్చెడివాడు. ఇతడు సంసార

నిస్సంగి, విమలాత్మయోగి. శ్రీగురవేనమో యని బసవని గురువును స్తుతించి నాడు. బసవేశ్వరునికి శివభక్తి వ్యాపనకు తోడ్పడినాడు.

## అల్లమప్రభుని రాక

అతిలోక శివయోగ నిష్ఠాగరిష్ఠుడు, అత్యంత శివతత్త్వ పారగుడు, అనుపమాన వైరాగ్యపరత్సుడు, అసమశివానంద పరవశభూతుడైన అల్లమ ప్రభువు బసవేశ్వరుని చూచుటకు వచ్చెను. బసవేశ్వరు డాతని స్వర్ణ సింహాసన మున కూర్చుండబెట్టి శరణు చేసి, పాదములు గడిగి, పాదోదకము ప్రాశించి ఆతనికి ప్రసాదము నర్పించెను.

## అల్లమప్రభునికి బసవడు విందు చేయుట

బసవేశ్వరుడు ఒక లక్ష తొంబదియాఱు వేలమందికి సరిపోయెడు ప్రసా దమును నాతనికి విందు చేసినాడు. ఆ ప్రసాదము నంతయు నొక్కమెతుకైన విడువకుండ అల్లమప్రభువు ఆరగించినాడు. బసవేశ్వరుడు అల్లమప్రభుని భక్తికి ఆశ్చర్యపడినాడు. ప్రభువు బసవనికి అక్షయలింగ సంపదలిచ్చి, తత్వవిద్యను ప్రసాదించినాడు.

## పార్వతి-ప్రమథులకు విందు

కైలాసమున పార్వతి ప్రమథులకు విందు చేసినది. కోటానుకోట్లు వచ్చినారు. శివప్రసాదమును వారికందఱకు వడ్డింపబోగా ఒక ప్రమథుడే ఆ విందు ఆహారము నంతయు తినివేసినాడు. పార్వతియు నందఱు ప్రమథు లార గింప విందు పెట్టలేదు. ఇది ప్రమథగణ శివభక్తి మహత్త్వము. అల్లమప్రభువు అట్టివాడని బసవేశ్వరు డాతని ప్రతిభక్తితో ప్రస్తుతించెను. అల్లమప్రభువు బస వేశ్వరునికి శివభక్తి ప్రబోధము నిరంతరాయముగా సాగి నిఖిల జగత్తులో వ్యాప్తమగునట్లు వరము నిచ్చెను.

## బసవేశ్వరుని మహిమలు

1. వంగకాయలు ప్రాణలింగములగుట :—

బసవేశ్వరుని ఇంటివద్ద చాల ధనమున్నదని తెలిసికొని కొందఱు దొంగలు దానిని దోచుకొన దలచిరి. లింగములేకయే ఆతని నింట ప్రవేశింప లేరు, గావున వంగకాయలను లింగములుగా, కట్టుకొంచుల గట్టి ప్రవేశించిరి. బసవేశ్వరుడు వారిని యీశ్వరార్చనలు సేయుడని యనగా వారు ధరించిన వంగకాయలు ప్రాణ లింగములైనవి. వారును బసవేశ్వరుని మహిమ పొగడుచు వెడలిపోయిరి.

2. జొన్నలు ముత్యములుగ మార్చుట :—

ఒక జంగమము వచ్చి ముగ్గులు పెట్టుటకై ముత్యములపొడి మూడుపుట్లు కావలయునని కోరెను. బసవేశ్వరుడు అచట నున్న జొన్నల రాశిని తన చేతితో స్పృశింపగానే అవి ముత్యము లయ్యెను. బిజ్జలుడు విభ్రాంతు డయ్యెను.

3. సంగమేశ్వరుడు బసవని మూడవకన్నడుగుట :—

జొన్నలు ముత్తెములుగా మార్చిన తరువాత, బసవేశ్వరుని దాననిరతిని పరీక్షింపదలచి కప్పుడి సంగమేశ్వరుడు జంగమరూపంబున వచ్చి 'నాకు మూడవ కన్ను కావలెను' అని వేడెను. అంత బసవేశ్వరుడు శివుని మాయ తెలిసినవాడై అద్దమును తెప్పించి అతనికి చూపగా నందు తన ఫాలాక్షము గాంచి సంగమేశ్వరుడు లజ్జనొంది నిరాకారుడయ్యెను.

4. గొల్లెత చల్ల కడవతో పడిపోకుండచేయుట :—

ఒకనాడు బిజ్జలుడు రాజకార్యములపై సమావేశము చేయగా బసవేశ్వరుడు, ఆ సభలో పెద్ద ధ్వనితో "ఇదిగో వచ్చుచున్నాను, నీకు చేయూత నిచ్చుచున్నాను" అని యుచ్చైస్స్వరమున బలికెను. బిజ్జలుడది చూచి "బసవన మంత్రీ! ఇది రాజసభ, ఇట్లు మతిలేక మాటలాడుట ఏల" నని యడిగెను. బసవేశ్వరుడిట్లు చెప్పెను, "రాజా, వినుము ఇచ్చటికి కొంతదూరమున నొక గొల్లెత కాలుజారి చల్లకడవతో పడబోవుచు 'బసవేశ్వరా! చేయూత' యిమ్మని కోరినది. నేనది విని నా చేయూతనిచ్చి ఆమె చల్ల కడవతో పడిపోకుండునట్లు చేసితిని. నీవు యీ క్షణముననే నీ మనుష్యులను పంపుము. నిజము తెలియ గలదు"అనెను. బిజ్జలుడు తన సేవకులను నచటికి పంపి గొల్లెతను తెప్పించెను. ఆమె ఒరిగిన చేతిరొంపి, జారిన కాలిరొంపి చూచెను,

అభినవ శ్రీగిరియని పేరెన్నిక గన్న సొన్నలికపురమున సిద్ధరాముడను శివయోగి కలడు. శ్రీగిరిలోని మల్లికార్జున లింగమును గొనితెచ్చి ప్రతిష్ఠించుటయే గాక లక్షతొంబదివేలు శివలింగములను స్థాపించెను. సహజమకుటము, నొసలి కన్ను గలిగి మహిత యోగానంద మహనీయలీల నుండుచు ప్రమథ లోకమున కేగుచు వచ్చుచుండువాడు. ఒకనాడు శివభక్తసమూహము ప్రమథ లోకమున బసవడున్నాడొ లేడొ తెల్పుమని యడుగుగా సిద్ధరాముడు ప్రమథలోకమున కేగి అందున్న శివుని గాంచి బసవేశ్వరుని చూపవేడగా శివుడు తన హృదయమును తెరచి కరస్థల లింగసమేతుడును, తదేక ధ్యాన నిష్ఠాపరుడై హరుమీది దృష్టి మరలింపని వాడుగా బసవన సిద్ధరామున కగపడెను. ఆలోక మీలోక మననేల యెల్లలోకములందును బసవడు కలడని శివుడు సిద్ధరామునకు తెలియబర్చెను. భూలోకమునకు సిద్ధరామయ్య యేతెంచి బసవయ్య మహిమను శివభక్త లోకము నకు చాటెను.

బసవని శక్తికి బిజ్జలు డతుల సంతోష చిత్తుడయ్యెను.

## రాజధనమునుగూర్చి బిజ్జలుడు బసవని దట్టించి యడుగుట

ఒక మిండజంగమునకు బసవన రాజబొక్కసమున నున్న ధనమంతయు నిచ్చివేసెను. అది విని మంత్రివర్గమువారు బిజ్జలునకు చెప్పిరి. బిజ్జలుడు బసవని పిలిపించి "మా ధనము తెమ్ము, నీ ప్రధానితనము చాలు" అని దట్టించి యడిగెను. అంత బసవన "భక్తుల ధనము భక్తులకే ఇచ్చితిని. మీ ధనంబునకు చేసాప" నని మారుపల్కి వెంటనే పెట్టెలను తెప్పించి చూడగా అందు ధనము మొదటి యట్టులనె యుండెను.

## శివభక్తుల మహిమలు

### బల్లేశు మల్లయ్య

బల్లేశు మల్లయ్య యను శివభక్తుడు లింగము పూజించుటకు లేకపోవుటచే ఒక కుంచము గుడిగా చేసి దానినే లింగముగా కొండ గోగుల పూజించెను. తక్కిన వారది చూచి, ఇక్కడి శివాలయము లింగము లేదే, నీవెట్లు పూజించితివి అని అడిగిరి. బల్లేశు మల్లయ్యయు వెంటనే స్వర్ణశిఖరము గల శివాలయమును నిర్మించి అందు లింగమును వారలకు చూపెను. వారలాశ్చర్యపడిరి.

## కాట కోటయ్య

కాటకోటయ్య ఏట పెంట్రిక లింగముగా పూజించుచుండెను. దానికి నభి షేకము చేయుచుండగా తండ్రి యదిచూచి ఆతని నపహసించి దానిని కాలదన్నెను. కాటకోటయ్య తండ్రి తల నఱకెను. ఏటపెంట్రిక లింగమయ్యెను. శివుడును కైలా సమున కాట కోటయ్య తండ్రిని తలుపులు తెఱచి చేకొనెను. ఆతడు ప్రమథగణ ములతో నుండెను.

# తృతీయాశ్వాసము

రాజకోశమున ధనమునంతయును భక్తులకు బసవేశ్వరుడిచ్చెనని ఇతర రాజోద్యోగులు చెప్పగా బిజ్జలుడు'మా ధనము మా కిమ్ము పరధనము నాసించుట తగదు—ఇంక నీ ప్రధానమంత్రి పదవి-భాండాగారాధిపతి పదవి విడిచిపెట్టుము' అని ఆజ్ఞాపించెను.

బసవేశ్వరుడు 'మీధనము మీ కిచ్చితిని. నాకేమియు నక్కరలేదు. దానిని నేను ఆసింపను- నాకనావశ్యకము- అనవసరము- క్షీరాబ్ధిలో క్రీడించు హంస సామాన్యమైన పడియల నీరు త్రాగునా? చంద్రుని వెన్నెల కిరణములలోని అమృతము త్రాగు చకోరము చీకటి త్రాగుటకు కోరునా? మామిడి పండ్లను తిను చిలుక భూరుహఫలము తినునా? తామరలో విహరించు తుమ్మెద బిబ్బిలి పూవులను జేరునా? మీధనమునకు నేను చేయిచాపను-మీధనము మీకిచ్చితి'ననియె. బిజ్జలుని ధనము నాతనికి చూపి, ఇందులో రవంత తక్కువైనను లేదు. ఏమియు తఱుగ లేదు. అట్లు తఱిగిన నేను శివభక్తుడను గాను. పూర్వపు లెక్కలు చూచుకొనుము. ఇదిగో తాళములని బిజ్జలుని చేతికిచ్చెను. ధనమంతయు నట్లేయుండెను. బిజ్జలుడు మాఱుమాటాడలేక చేయునదిలేక యూరకుండెను.

## నక్కలు గుఱ్ఱములగుట

శివభక్తుల మహిమ అద్భుతము. పూర్వము మధురలో పాండ్యునిపై శత్రువులు దండెత్తగా చొక్కనైనారు తనవద్ద గుఱ్ఱములులేకపోవుట చూచి నక్కల నన్నింటిని అశ్వములుగా మార్చివేసెను.

ఇదివిని బిజ్జలుడు. "ఇకముందు బసవనిపై నే కొండెములను చెప్పరాదు. అట్లు చెప్పినవారి నాలుకలు కోయించి నోళ్లలో ఇసుక పోయింతును" అని కట్టడి చేసెను. బసవేశ్వరుడు పూర్వరీతి శివభక్తులకు కావలసిన ధనము వస్తువులను నర్పణ చేయుచుండెను.

## తన భార్య చీరెను భక్తుని కిచ్చుట

ఒక విటుడు వేశ్య ఇంటియందుండి "బసవేశ్వరుని యొద్దకేగి నిత్యము నిచ్చు పతిని దెమ్ము" అని తన సేవకుని పంపెను. అతడును వచ్చి బసవేశ్వరుని భార్యకట్టిన చీరె చాలా మనోహరముగా నుండుటచే ఆ సంగతి విటుని కెఱిగించెను. అతడును వచ్చి ఆ చీరెను తన కిమ్మని కోరెను. బసవేశ్వరుడు వెంటనే దానిని విప్పి ఇచ్చివేయుమని భార్య కాజ్ఞాపించెను. ఆమె యట్లే చేసెను తన చీర విప్పగా నే మఱియొక చీరె నామె మొలనుండెను. అది విప్పగా దానిని విటుడు తీసికొనెను. ఆమె చీరె విప్పినపుడెల్ల క్రొత్తచీరె వచ్చుచుండెను. అవి ఒక మోపెడయ్యెను. వానిని విటుడు తాను మోయగలిగిన చీరెలను తీసుకొనిపోయి తన వేశ్య కిచ్చెను. పూర్వము దేవరదాసయ్య యను భక్తుడు పంన్రెండేండ్లు నేసిన చీరెను శివభక్తుడు కోరగా నిచ్చెను. శివభక్తుల మహిమల కడ్డులేదు. మొన్నయ ధరుడను భక్తుడొకడు కోరినధనము కంటె ఇమ్మడిగానిచ్చెను. తన కూతురునకు పెండ్లికి సవరము కావలసి నడిగినమానకంజారుడు తన భార్య జడను గోసి యిచ్చెను. అట్లనే బసవేశ్వరునిమహిమ వలన భార్యకట్టిన చీరెవిప్పినను నట్లే వచ్చుచుండెను. శివభక్తులమహిమ యిట్టిది కావున బసవేశ్వరుని భార్య మొలవస్త్రము విప్పినను క్రొత్తది అప్పుడే మొలను నుండుట ఆశ్చర్యము కాదు.

## ముగ్ధసంగయ్య కథ

బసవేశ్వరుని సమకాలికుడగు నీతడు శివభక్తిపరుడై యుండెను— ఒక నాడు తాను వేశ్య యింటికి వెడలెదనని యాతనితో చెప్పెను. అతడును వెళ్లమని చెప్పెను. అతడు వేశ్యయింటికి పోవగా నామె సాక్షత్తురుద్రగణికవలె నొప్ప

చుండెను. ఆమెయు ముగ్ధ సంగయకు పాదము, గడిగి భక్తితోనర్చనలు గావించెను. అతని చక్కగా శృంగారింప జేసెను. అతనికి తెల్లరుద్రాక్షల నిచ్చెను. అతడాశ్చర్యపడి, ఇదియేమి, తెల్లరుద్రాక్షలు జగత్తులో లేవే, ఇవి ఎక్కడివని యడిగెను. ఆమెయు "నేను పార్వతిదేవి చెలులలో నొకరైను,కావున నాకిట్టివి లభించినవి మమ్ములను రుద్రగణికలందురు" అనిచెప్పి అతని శివభక్త్యాంబుధి నోలలాడ జేసెను.

## రుద్రపశుపతి కథ

రుద్రపశుపతి యను శివ భక్తుడు బసవేశ్వరునకు పూర్వుడు- అతడు శివపురాణములో శివుడు విషము మ్రింగెను కావున నేమైనాడోయని దుఃఖించు చుండెను. నీవు త్రాగిన విషమును పైకియుమియక పోయినచో తాను ప్రాణములు విడుచుటకు సిద్ధమయ్యెను. శివుడును నతని నను గ్రహింప దలచి కైలాసమునకు దీసికొనిపోయి "నేను విషము గ్రక్కిన లోకములు దగ్ధమగును. కాన కంఠమున ధరించితిని. నీవేమియు అలజడి బొందకుము" అని అతని తన వద్దనే ప్రమథ గణములతో సరిగా నిలుపుకొనెను. అతడు కైలాసముననే శివునితో నుండెను.

## నక్కనైనారు కథ

నక్కనైనారను భక్తుడు శివపూజ చేయుచుండగా నొక సాలెపురుగు లింగముపై బ్రాకినది. వెంటనే అతని భార్య తన నోటితో దానిని 'థూ' అని ఊదెను. దానితో నోటి తుంపురులు లింగముపై బడెను. అప్పుడు నక్కనైనారు ఈ యపరాధము మన్నింపుమని వేడెను. సాలె పురుగు ప్రాకిన చోట తప్ప తక్కిన చోట్ల లింగమంతటను పొక్కులు గన్పట్టెను. ఈ పొక్కులు మాన్ప మని శివుని వేడుకొనుచుండెను. ఇంతలో నాతని భార్యవచ్చి చూడగా తన భర్త శరీరమంతయు పొక్కులతో నిండియుండినట్టు కనబడినది. తక్షణమే యామె శివుని నా భర్తమీద పొక్కులు మాన్పుము లేని యెడల నేను నా తల తెగవేసి కొందునని సిద్ధపడెను. శివుడును ప్రత్యక్షమై ఆ పొక్కులు మాన్పి ఆ దంపతు లకు నానందము కలుగజేసెను.

## బెజ్జమహాదేవి కథ

బెజ్జమహాదేవి శివభక్తురాలు. ఆమె శివునకు తల్లి లేదని విచారించుచుండెను. "తల్లి లేకుండ శివుడెట్లు జన్మించినాడు? తల్లియున్న తనయుని తపస్సు చేయ పంపునా? తల్లియున్న తలజడలను గట్టనిచ్చునా? తల్లియున్న విషముదిన్న యూరకుండునా? తల్లి లేకపోవుట వలననే ఇన్ని పాటులు శివునకు గల్గినవని, నేను తల్లినై శివుని పెంచెదను" అని తనయునిగా భావించి పెంచుచుండెను. ఆతనికి నీళ్లు పోయును, నిద్రబోజేయును, తన చన్ను గుడుప జేయును, తన రొమ్మున కత్తుకొనును. ఇతరుల కన్నుబడిన కొడుకునకు హాని కలుగునని ధూపొడిచి రక్షణకై కన్నులకు కాటుక పూయును. ఆ శిశువు ఏడ్చిన జన్నిచ్చి గుస్తరించును. ఇట్లు సకల విధముల నహోరాత్రములు శివుడగు తనయు యందే పంచప్రాణములు నిలిపి సంరక్షణ చేయుచుండెను. శివుడును నామె ననుగ్రహింప దలచెను. ఒకమారు చన్నుగుడుచుటకు నీయగా తనయుడు కుడువలేదు. 'అయ్యో' అంగిటి ముల్లను శిశువ్యాధి వచ్చెను. ఇక నేనేమి చేయుదును? చను పాలు కుడుచుట లేదు' అని కడుపుతీపి చేత తాను ప్రాణములు విడుచుటకు సిద్ధపడెను. తల తెగవ్రేయ సమకట్టెను. శివుడును ప్రత్యక్షమై ఆమెకు నిత్యత్వమిచ్చెను.

## గొడగూచి కథ

శివదేవుడను భక్తుడు ప్రతినిత్యము శివునకు కుంచెడు పాలను నివేదించుచుండెను. ఆతడు గుడిలో లింగమున కర్పించుచుండెను. ఒకతూరి ఆతడు స్వంత వ్యవహారమునకై పొరుగూరికి వెళ్లవలసి వచ్చెను. అప్పుడు తన కడగొట్టు కూతురు జూచి ప్రతినిత్యము గుడికేగి శివునకు పాలు పోయుమని చెప్పెను.

గొడగూచియు నట్లే కుంచెడు పాలు కాచి ఒక పాత్రలో నించి మూతపెట్టి జాగ్రత్తగా గుడికేగి ఆ పాలపాత్ర శివలింగము నెదుట నుంచెను. కొంతసేపు చూచెను. శివుడా పాలను గ్రోలునని ఆమె భావన. కాని శివుడు త్రాగలేదు. పెట్టినపాలట్లే యుండెను. ఆమెయు "పాలలో పంచదార తక్కువయైనదా తెచ్చెదను. త్రాగుము. మా యింట పాయసమున్నది. దానిని తెచ్చెదను. త్రాగుము.

మా తలిదండ్రులు బొమ్మలు మొదలైన వానిని దెత్తురు. వాని నీకిచ్చెదను. మన మిరుపురము వీరభద్రుని జాతరకు బోవుదము. త్రాగుము. అటుకులు పండ్లు నీ కర్పించెదను త్రాగుము" అని పరి పరి విధముల గొడగూచి శివుని వేడుకొనెను. కాని పాలట్లే యుండెను. ఆమెయు, నీవు పాలుత్రాగవు వానిని ముట్టవు, నేనేమి చేయుదును? అని తల లింగముపై తాటించి కొట్టుకొనెను. శివుడును లింగము నుండి పైకివచ్చి ఒక్క చుక్కయైన మిగులకుండ త్రాగెను. ఇట్లే కొన్ని దిన ములు జరిగెను. ఒకనాడు ఆమె గుడినుండి పాత్రలో పాలు లేకుండ వచ్చుట జూచి అప్పుడే ఊరినుండి వచ్చిన తండ్రి, ఆమెను చూచి నీవు పాలన్నియు త్రాగి వేయుచున్నావా లేక పాఱబోయుచున్నావా పాలేవి యని యడిగెను. ఆమెయు నమాయికముగా శివుడు త్రాగివేయు చున్నాడని తెలిపెను. శివదేవుడు నమ్మక తనయతో గుడికి పాలపాత్రతో వెడలెను. లింగము ముందఱ పెట్ట శివుడు త్రాగలేదు వెంటనే తండ్రి యామెను కొట్టి బాధపెట్ట సాగెను. గొడగూచి లింగమును కౌగలించుకొనెను. శివుడును నామెను లింగ గర్భములోనికి తీసికొని పోవుచుండగా తండ్రి జుట్టుపట్టుకొని లాగెను. తల వెంట్రుకలు మాత్రమాతనికి చిక్కెను. నేటికిని ఆ శివునకు శిరోజములు వచ్చుచుండును. అవి మూడు నెలల కొకసారి కత్తిరింపగా తిరిగి మొలుచుచుండును. ఇది బాల భక్తుల మహిమ.

## దీపదకళియారు కథ

కాంచీపురమున దీపదకళియారను శివభక్తుడు ఒకపరి నడివికి నేగి అక్కడనొక జీర్ణాలయమున శివలింగము నుండుటజూచి-శివుడు నొక్కడే యీ శిథిలాలయములోనున్నాడు అని చింతించి, దానిని బాగుచేయించి- ద్వార ములు ప్రాకారము నిర్మించి ఒక కోట వలె దానిని గావించెను. దేవాలయ రక్షణ కొఱకు తాను రెండు చేతులను రెండు దివిటీలను బట్టి రాత్రియంతయు గుడి చుట్టు ప్రదక్షణము చేయుచుండెను. దివిటీలకు మ్రానుమట్ట తీగెకసువు వెంట్రిగా చుట్టి దీపము వెలిగింపచేయును. ఇట్లు కొంత కాలము జరుగగా ఆ యడవి యందున్న సమస్తపదార్థములు తఱిగిపోయెను. దీపముగా దివిటీలను ముట్టించు టకు నేమాత్రము లేక శూన్యమయెను. దీపదకళియా రదిచూచి, తన వ్రతము తప్పినదని భావించి, శివున కపచారము చేసితినని, తన తలవెండ్రుకలను

వెంట్రిగా జుట్టి వానితో దివిటీలను చేసెను. అతని భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమై, ఆ గుడిని, దీపదకళియారును కైలాసమునకు గొనిపోయెను. శివునకు నిత్యము దీపము అర్పించువాడు గాన నాతనికి దీపదకళియార్ను పేరు వచ్చెను.

## నాట్యనమిత్తండి కథ

కాంచీపురమున ఏకామ్రేశ్వరుని గుడియందు నటరాజ విగ్రహము గలదు. అది నాట్యభంగిమములతో నుండును గావున దేహము వంకరలు బోయియుండెను. నాట్యనమిత్తండి దానిని చూచి శివునకునేదో వ్యాధి వచ్చినది శరీరము కొంకరలు పోయినది. దీనికి తగిన చికిత్స చేసెదను గాకయని ప్రతిదినము ఉమ్మెత్తచిగురులు దెచ్చి, వాని ద్రావకము చేసి ఆముదముతో మర్దించు చుండెను- కాని శివుని దేహమట్లే యుండెను. దానిని మాన్పుటకు వ్రేళ్ల వెల్లకులు దెచ్చి సేవ చేయసాగెను-కాని శివుని శరీరమట్లే యుడెను. నాట్యనమిత్తండి యిక మఱి లాభము లేదని తన తలను తెగవ్రేసికొన సిద్ధపడెను. శివుడును ప్రత్యక్షమై నేను తాండవ నృత్యము చేయుచు నిట్లుందును. ఇందువలన లోకమున నాట్యవిద్య నిలుచును. కావున నీవు నా వద్దనుండి పాటలచే నన్ను కీర్తింపుము. నీకు నాట్యనమిత్తండి అని పేరు నిత్యమగును. ఆ పేరుతో నీవు వ్యవహరింపబడుదువు అని తనవద్దనే కైలాసమున నిలిపెను.

## ఉడుమూరి కన్నప్ప కథ

ఉడుమూరి కన్నప్ప యను నతడు ఎఱుకలవాడు. ఆటవికుడగు నాతడు విలునమ్ములు గొని జంతువులను జంపి మాంసమును దొప్పలో బెట్టి శ్రీకాళహస్తీశ్వరునకు నర్పించుచుండెను. ఆతడు ప్రతిదినమును తనచెప్పుతో లింగముపై పత్రినూకి పుక్కిటి నీటితో లింగమునకు అభిషేకము చేసి మాంసపు దొప్ప నివేదించుచుండెను. అప్పుడు ఆ లింగమునకు నొక బ్రాహ్మణుడు ఏటినీటితో నభిషేకము చేసి బిల్వపత్రి నర్పించుచుండెను. అతడు ఒకనాడట్లు శివపూజ చేయుటకు రాగా, కన్నప్ప అర్పించిన మాంసపుదొప్ప చూచెను. శివలింగముపై పుక్కిటి నీరుండుట గమనించెను. శివలింగమంతయు నపవిత్రమైనది. శివునకు మహాపచారము జరిగినది. నేనేమిచేయుదును. అని దానినంతయు ప్రోక్షించి తీసివేసి పవిత్రము గావించి, శివుడెట్లు నిట్టిపూజ నంగీకరించెనని అత్యంత

సందేహపీడితుడై యుండెను. —

శివుడును కన్నప్ప సహజ ముగ్ధభక్తిని బ్రాహ్మణునికి చూపదలచెను. ఒకనాడు బ్రాహ్మణుడు వేదోక్తముగా పూజచేసి యట నిలువబడెను – కన్నప్ప పూర్వపురీతిని మాంసపుహొప్పతోవచ్చి శివునికి పుక్కిలిట నీటితో నభిషేకము చేయబోగా, నాతని కంట నీరుగారు చుండెను. కన్నప్పయు వ్రేళ్లతో వెల్లకులతో చికిత్స గావించెను. అట్లే సంతతధారగా కన్ను నుండి నీరుకారు చుండెను. ఇక లాభములేదని కన్నప్ప బాణముచే తన కన్ను పెకలించి, శివుని నీరుగారు కన్నుపై గల తావున తన కన్నతికించెను. ఇంతలో రెండవ కన్నున నీరుకారు చుండెను. తక్షణమే కన్నప్ప తన రెండవ కన్నును నట్లే పూర్వపురీతిగా పెకలింపబోగా, శివుడు ప్రత్యక్షమై బ్రాహ్మణునితో నిదిగో చూచితిరా కన్నప్ప భక్తి – దీనికి విద్య జ్ఞానము అనావశ్యకము. నిశ్చలమై నిరవధికమై నిరతిశయమైన భక్తియే మానవునకు వలయునని కన్నప్పకు నైక్యపదవి నొసగెను. — శ్రీకాళహస్తిలో నేడును శివలింగము కన్నప్పయు అట్లే యున్నవారు, కన్నప్పగించెను గాన అతని పేరు కన్నప్ప యయ్యెను. అంతకు ముందాతని పేరు తిన్నడు. ముగ్ధభక్తులను శివుడు సర్వధా,సర్వధా సంరక్షించుచు వారి కభిమతము కిచ్చును. కన్నప్ప తెలుగువాడు. పొత్తపినాటిలోని ఉడుమూరు ఇతని గ్రామము. ఈతని కథ బసవపురాణ కథలలో పెద్దది.

## కళియంబనయనారు కథ

ఇందు కథ ఏమియులేదు. ప్రతిదినము శివుని నొకమారు నవ్వించి తాను నవ్వుచుండును.

## సకలేశు మాదిరాజయ్య కథ

ఈతడు బసవేశ్వరుని సమకాలికుడు, ఒక మండలేశ్వరుడు – ఈతడు శ్రీశైలమున చిరకాలము శివుని గూర్చి ఆయుర్వృద్ధిని సిద్ధింప జేసికొనెను. ఆఱునందల యేండ్లు జీవించెను. ఆతడు శ్రీశైలమునుండి బసవేశ్వరుని వద్దకు వచ్చెను, ఆతడును సంగమేశ్వరుడును నొకేరీతి నున్నట్లు కనుగొనెను. వీరశైవభక్తి వ్యాపింపజేయుటకు బసవేశ్వరుని ననుగ్రహించెను.

ఈతని కథ కూడ పెద్దదే. ఇందు శ్రీశైల వర్ణన సమగ్రముగా గలదు. అది సర్వము లింగమయముగా లింగస్వరూపముగా నిరూపింపబడినది.

# చతుర్థాశ్వాసము

## మడివాలు మాచయ్య కథ

ఇతడు బసవేశ్వరుని సమకాలికుడు. పుట్టుకచేత చాకలి. ఇతడు శివ భక్తుల బట్టలను మాత్రమే యుతుకును. భవుల బట్ట లుదికెడు రేవుమాని వేరొక రేవున ప్రత్యేకముగా వాని నుతుకును. అవి శైవమతమునకు తీసికొనివచ్చి ధట్టించి మడతలుచేసి మూపున మోసికొనుచు వచ్చును. జంగమము లెవ్వరైన యడిగిన వారికి బట్టలనిచ్చును. తాను బట్టలు తెచ్చునపుడు భవులెల్లరు నెదురు రాకూడదని చాటెను. తన చేతిలో కత్తికూడ నుంచెను. ఇంతలో నొకనాడు ఒక భవుడు ఎదురుగా వచ్చెను, వానిని పొడిచి, వాని శరీరమును ఆకాశమున కెగురవైచెను.

అంత ప్రజలు బిజ్జలు పాలికి జని మడివాలు మాచయ ఒక భవుని జంపెనని తెలిపిరి. ఆతడు కోపోద్దీపితుడై మాచయ్యను జంప నాజ్ఞాపించెను. బసవేశ్వరుడు బిజ్జలునితో మాచయ్య మహిమ ఇట్లు వివరముగా చెప్పెను.

మాచయ్య పుట్టుకచే చాకలియైనను, నతడు సమస్తవర్ణముల వారి స్వరూపములు ధరించినవాడు. ఆ వర్ణన వినుడు.

బ్రహ్మజడలను జంధ్యములుగా వేసికొన్న బ్రాహ్మణుడు-అపవర్గ సామ్రా జ్యము పాలించు క్షత్రియుడు-కర్మఘటమును భవాంబుధిద్రిప్పు వైశ్యుడు-సత్క్రి యలు పండించి యిచ్చి శూద్రుడు-బ్రహ్మాండములు సృష్టించు ఆదికుమ్మరి-హరి యెమ్ముదండముగా అహిపతిత్రాడుగా నరసింహు నఖరము కొంకిగా మత్స్య కూర్మవరాహములను, మహాంబుధినుండి దిగిచి పట్టెడు జాలరి-జీవఘటన చక్ర మును నిర్మించు వ్రడంగి-జీవమను లోహమును కరగు కమ్మరి-శ్రేష్ఠమైన నాభ రణములు చేయు అగసాలి-బ్రహ్మశిరమును ద్రెంచిన శబరుడు-హరిముఖ్యులను

పాలించు ప్రేతేడు-కపటనాటకము నాడించు వెండీడు, కులనగములు నూకి అబ్ధులను జల్లి జగమును పొలయును సాపచేయు కృషీవలుడు-ఏకార్ణవమున బ్రహ్మాది దేవతలు మునిగిపోగా వారల నుద్ధరించి యుతికిన చాకలి.

ఇట్టి మహామహత్తు గలవాడు మాచయ్య సాక్షాత్తు ఈశ్వరుడుగాని మానవ స్వరూపుడగు చాకలికాడు.

## బిజ్జలుడు మాచయ్యపై ఏనుగును పంపుట

బిజ్జలుడు మాచయ్య మహిమలు వినియు ఆతనిపైకి ఏనుగును పంప నాజ్ఞాపించెను. ఆ ఏనుగు మాచయ్యపై వచ్చుచుండెను. మాచయ్యయు దాని తొండమును బట్టి పిడిగ్రుద్దులుగుద్ది ఆయేనుగు పీనుగగునట్లు చేసెను. అప్పుడు బసవేశ్వరుడు బిజ్జలునితో శివభక్తుల మహిమను ఇట్లు దెలిపెను.

## ఇరువదాండారి కథ

ఇరువదాండారి మహా శివభక్తుడు. ఆతడు శివభక్తులకు హాని చేసెడి వానిని వెంటనే జంపునట్టి నియమము గలవాడు. ఒకనాడొక శివభక్తుడు ప్రాతఃకాలమున శివపూజకు పుష్పములు గోయుటకు పుష్పతోటకి జని వానిని కోయుచుండగా, చేదిరాజు ఏనుగు నాతనిపైకి వచ్చి యాతని ద్రొక్క నారంభించెను. ఆ భక్తుడును శివా నన్ను రక్షింపుమని మొఱపెట్టెను. ఆ మాటవిని ఇరువదాండారి అచ్చటికి వచ్చెను. ఆతడు రాక పూర్వమే భక్తుడు ప్రాణములను విడిచెను. ఇరువదాండారి ఆ యేనుగును చంపెను. అదివిని చేదిరాజచటికి వచ్చి ఇరువదాండారి శరణు వేడెను. ఆతడు ఏనుగును జంపెను.

శివభక్తుని జంపిన యేనుగు తనది గావున, ఆతడు తన తల తెగవ్రేసికొన బోగా శివుడు ప్రత్యక్షమై ఇరువదాండారి భక్తికి మెచ్చి, భక్తుని, ఏనుగును బ్రతికించెను.

## బాపూరి బ్రహ్మయ్య కథ

బాపూరిబ్రహ్మయ్య యను శివభక్తుడు కాయకలబ్ధిచే జీవించుచుండెను. జొన్నలు లింగములుగా జేసి వానిని గొలుచుచుండును. ఒకనాడు చోళరాజు తన

సైన్యముతో పోవుచుండగా, అతని యేనుగు విడిపోయి. బాపూరిబ్రహ్మయ్యపై బడెను. బ్రహ్మయ్యయు దానిని జంపివేసెను. అంత చోళరాజువచ్చి బ్రహ్మయ్యను రక్షింపుమని ప్రార్థించెను. బ్రహ్మయ్యయు కరుణతో నాతని యేనుగును బ్రదికించెను.

## మాచయ్యను బిజ్జలుని యొద్దకు బసవేశ్వరుడు కొనిపోవుట.

పై శివభక్తుల మహిమ దెలిపి బసవేశ్వరుడు బిజ్జలుని కడకు మాచయ్యను గొనిపోయెను. బిజ్జలుడు మాచయ్య అడుగులపై బడి శరణు వేడెను. మాచయ్యయు బిజ్జలుని ఏనుగును తిరిగి బ్రతికించెను.

## బసవని గీతములను విని మాచయ్య కోపించుట

బసవన శివుని గూర్చి నాలుగు లక్షల అరువదినాలుగు వేల గీతములను రచించి పాడుచుండెను. మాచయ్య దానిని విని కోపించి, నిక్కమైన శివభక్తుడు తనకు నిదికావలయునని యాచించుట అపరాధమని, ఇదిగో శివభక్తుల మహిమ చూపుచున్నానని అచట నొక యింకిపోయిన పడియ యందు నీళ్లజల్లి నవ రత్నములను నందు సృష్టించెను. అందలి జలము లన్నియు రత్నమయము లయ్యెను.

అంత బిజ్జలుడు నక్కడకు వచ్చి మాచయ్య నర్చించెను.మాచయ్య నాతని కరుణించెను. బసవనితో శివభక్తు డెన్నడును గర్వముతో నుండ రాదు అని, పైరీతి మహిమను జూపి మాచయ్య అతని శివభక్తి సంశుద్ధి – వర్ధ మానమగునట్లు దీవించి శివభక్తుల కహంకారము వలదని శివభక్తుల కథలను జెప్పెను.

## శంకరదాసి కథ

శంకరదాసి యను భక్తుడు ప్రతిదినము ఏడు కుంచముల ధాన్యము జంగముల కర్పించుచుండెను.

అందెప్పుడును గంటెడైన తక్కువరాదు. అతని వద్ద గాదెలలో ధాన్యము

లేకున్నను నేడు మానికలు భక్తులకిచ్చుచుండెను దగ్గళప్ప యను నామె ఇది చూచి దేతర దాసయ్యను వృత్తాంతము శంకరదాసి మహిమ నెఱిగించెను.

శంకరదాసి భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమై వరమడుగు మనెను. ఆతడు నాకేమియు వద్దు చీకటిలో సూదిలో దారము గ్రుచ్చుకను దృష్టియొసగు మని వేడెను. శివుడును నాతనికి అట్టి శక్తిగల మూడవకన్ను నిచ్చెను. అంతే కాక ఆమూడవ కన్నుకు దేనినైన నుగ్గు గావించు నురుశక్తియు నిచ్చెను.

## జగదేకమల్లుని కథ

జగదేకమల్లుడను వాడు పంచలోహములతో ఉక్కుతో గోవింద ప్రతిమ చేయించి దానిని ప్రతిష్ఠించెను. శంకరదాసి, తన మూడవకన్ను విప్పి దానిని తీవ్రముగా జూడగా నది వెంటనే ముక్కముక్కలై, పొడిపొడి యయ్యెను. దేదర దాసయ్యయు. శంకరదాసి కొలుచును సృష్టించుట గొప్పగా దనెను. శంకరదాసి, ఆతనికి కొలుచు చాలగా గల్గు నిధి నిచ్చెను. జగదేకమల్లుడు, దేదర దాసయ్య శంకరదాసి అడుగుల బడి శరణు వేడిరి. శంకరదాసి వారిని కరుణించెను.

## సిరియాలుని కథ

కంచిలో సిరియాలుడను శివభక్తుడు ప్రతిదినము నలుగురు జంగమముల నర్చించుచుండెను. ఒకనాడే జంగమమును కానరాలేదు. సిరియాలుడు పురమెల్ల వెదుకగా పురము చివర నొక వృద్ధ జంగమము కన్పడెను. సిరియాలు డాతని నర్చించుటకు తన యింటికి రమ్మని శరణు వేడెను. అతడు సంగీకరించియిట్లు చెప్పెను. నాకొక వ్రతముగలదు. నాకు నరమాంస మాహారముగా నుంచవలెను. ఆతడును ఆర్చించు జంగమమునకు ఆత్మ బంధువై యుండవలెను. ఇట్టి మా వ్రతమును చెల్లించిన నేను వచ్చెదనని చెప్పెను.

సిరియాలుడును నాకు పుత్రుడున్నాడు. ఆతని జంపి మీకు ఆహారముగా పెట్టెదను దయసేయుడని తన యింటి కాతని గొనిపోయెను. సిరియాలుని భార్య

సంగళవ్వయు పుత్రుని జంపి ఆమాంసముచే ఆహారము సిద్ధము చేయించెను. జంగమమును వడ్డించిన ఆహారములో శిరోమాంసములేదు. నాకీ ఆహార మక్కర లేదని లేచిబోయెను. ఆదంపతులు నదిరిపడి, అయ్యా శిరోమాంసము కేశపూరి తమని మీకు పెట్టలేదు. అదియు మా దాసి వండినది. మీరు కోరినారు గావున నిదిగో తెచ్చితినని ఆతని ముందు శిరోమాంసము నుంచెను.

అప్పుడా జంగమము నాకు గృహస్థుడైన జంగమము కూడ నాతో నార గింపవలయును అని కోరెను. సిరియాలుడు సంగీకరించెను. వెంటనే జంగమము పుత్రులులేని వాని యింట నేను కుడువనొల్లను, అని లేచిబోయెను. సిరియాలుడు ఇంకొక పుత్రు డున్నాడు, వానిని బిల్వపంచెదను. ఈలోపుగా అన్నము శాక పాకములు చల్లారి పోవును కావున భుజింపుడు అని వేడుకొనెను.

## సిరియాలుని కొడుకు బ్రతికివచ్చుట

ఆజంగమము తల్లి పిలిచిన రాని తనయులుందరు కావున నీ కొడుకును పిలువుము అని చెప్పెను. తల్లి సుగ్గళవ్వ నాలుగు దిక్కులకు తన కుమారుని పిలిచెను. ఆ కుమారుడు పూర్వపురీతిగా వచ్చివారి ముందఱ నిలువబడెను. జంగమ స్వరూపుడై వచ్చిన శివుడును ప్రత్యక్షమై, సిరియాలుని ఆతని భార్యను కుమారుని ముగ్గురును కైలాసమునకు గొనిపోయెను. చిఱుతొండడగు సిరియా లుడు తన యట్టి భక్తుడు లేడని గర్వించుచుండెను. శివుడును నతని గర్వము బాపదలచి మఱి కొందఱు భక్తుల మహిమను చూపించెను.

## నిమ్మవ్వ కథ

నిమ్మవ్వయును శివభక్తురాలు శివుని కర్పింప ప్రసాదము చేసి యుంచెను. నిమ్మవ్వ కొడుకు చిఱుత ప్రాయమువాడు, ఆకలి కోర్వలేక అందొక మూరెను తినివేసెను. నిమ్మవ్వయునది చూచి శివునకపరాధము చేసితినని చింతించిన తన కొడుకును జంపి, భూమిలో పాతిపెట్టెను. శివుడను చిఱుతొండనికది చూపి, చూచితివా పాపము బాలు డాకటి కోర్వలేక ఒక మూరెతినగా నిమ్మవ్వ ఆ బాలుని చంపి పూడ్చినది. అని చూపెను. చిఱుతొండడు సిగ్గుజెందెను. శివుడును నా నిమ్మవ్వ బాలుని బ్రదికించెను.

## నరసింగనయనారు కథ

నరసింగనయనారను శివ భక్తుడు, శివపూజకు పువ్వులు సిద్ధముచేయగా ఆతని భార్య యొక పువ్వును చేతిౘ్రేళ్ళతో మట్టి దానిని వాసన చూచెను. భర్త యది చూచి శివపూజాపుష్ప మెంగిలి యయ్యెనని, ఆ ౘ్రేళులను చేతిని ఖండించెను. శివుడును ప్రత్యక్షమై ఆమె చేయి తిరిగి వచ్చునట్లు చేసెను.

## కొట్టురువు చోడని కథ

కొట్టురువు చోడడు తన భార్య గర్భిణియై యుండగా ఆమె గర్భస్థుడైన బాలుడు శివభక్తిహీనుడని ఆతని ౘ్రచ్చి గర్భమునుండి వెడలించెను. శివుడదిచూచి, చోడని భక్తికి మెచ్చి వరమును కోరు కొమ్మనెను. నేను కొడుకును తిరిగి యిమ్మని అడుగుటకు చిఱుతొండడను కాను అని ప్రత్యుత్తరమిచ్చెను. శివుడును ఆ కుమారుని జీవితునిగా జేసెను.

## హలాయుధుని కథ

హలాయుధుడు శివుని భక్తుడు. ఒకనాడు శివుడు సిరియాలుని కథ చెప్పెను. హలాయుధుడు సిరియాలునికథ విని కోపించి సిరియాలుని శివుని వెలి వేసెను. అప్పుడు సిరియాలుని భార్య సంగళవ్వ శివునిభార్య పార్వతి హలాయుధుని తమ భర్తలపై వెలిని తీసివే యుమనెను. ఆతడట్లే చేసెను. శివుడు హలాయుధు నను్రగహించెను.

## మిఱుమిండనైనారు కథ

మిండనైనారను శివభక్తుడు నెలనెల శివరాౘ్రిని సలుపు నియమము గలవాడు. ఈనియమమును నతడు పంౘ్రెడు సంవత్సరములు చేసెను. ఆతడు తన యూరగు చేగొండయందు వాల్మీకేశ్వరుని గుడి యందీౘ్రతము చెల్లించు చుండెను.

## ఒడయనంబి వాల్మీకేశ్వరుని గుడికి వచ్చుట

ఒకనా డచ్చటకి ప్రసిద్ధశైవభక్తుడును శివగేయ రచయితయునగు ఒడయ నంబి వచ్చెను. అంతనక్కడ శివభక్తు లందఱు నాగుడికి వచ్చిరి. ఒడయనంబి

ఆ శివభక్తులకు శరణు చేయక సంగీతముతో తాళముతో నాట్యముచేయుచు శివకీర్తనలు పాడుచుండెను. ఆతడచ్చటి భక్తగణమును గర్వముతోచూచి ధిక్కరించెను. ఒడయనంబి గర్వముచూచి మిఱుమిండనైనారు ఒడయనంబిని వెలిబెట్టెను.

## ఒడయనంబితో వాల్మీకేశుడు అదృశ్యుడగుట

ఒడయనంబి కూడ శివభక్తుడే. శివుడతని వేశ్యకు దినము వేయిమాడలిచ్చుకుంటెనకాడై యుండెను. అందుచేత నాతడు గుడిని వీడి, ఒడయనంబితో అదృశ్యుడయ్యెను.

మిఱుమిండడు నచ్చటికి వచ్చి వాల్మీకేశ్వరుడు లేకుండుట గాంచి వెదుకనారంభించెను. గుడి ఉద్యానవనమున నాతడు పూవుగద్దెపై యుండెను. మిఱుమిండనికి దర్శనమిచ్చెను. అప్పుడు ఒడయనంబిశివునితో అయ్యా ఇది యేమి మిఱుమిండనికి జంకి నాతనికి దర్శనమిచ్చితివి అని ఉమ్మలికతో నడిగెను. శివుడును శివభక్తుల మహిమనిట్లు చెప్పనారంభించెను.

## బాణుని కథ

నాకును శివభక్తులమను భేదములేదు. శివభక్తి మహిమ వినుము. బాణుడు నిత్యము వేయిమాలులు శివపూజ చేయుచుండెను. శివుడు నాతనికి వేయి చేతుల నిచ్చెను. ఆతడు వేయి చేతులతో శివపూజచేయు చుండగా, శివభక్తులు వచ్చుచుండెడివారు. బాణుని శివపూజకు అంతరాయము కలుగుచుండెను. అప్పుడు వచ్చిన వారిని వారించుటకు బాణుని వాకిలి యందు వాకిలికాపై యుండెడివాడను.

## పిట్టవ్వ కథ

పిట్టవ్వయను శివభక్తురాలు. కరికాలచోడడు కావేరికి ఆనకట్ట కట్టినపుడచట నుండెను. కరికాలుడును తక్కిన వారివలె నామెను మంటి తట్టలు మోయుమని ఆజ్ఞాపించెను. అప్పుడు తాను ఒక వెట్టివాని వేషమున వచ్చి, ఆమెకై తట్టలు మోసితిని అని చెప్పెను.

## కలికామదేవుని కథ

కలికామదేవుడను శివభక్తుడు ఒడయనంబికి కుంటెన చేయు విధమును విని, ఆతనితో నీవు శివుని కుంటెన కాడుగా చేసితినని అహంకరించు చున్నావు. అహంకారము గల శివభక్తుడెట్లు నిల్వ గలడు. ఇదిగో నిన్నేమి చేసెదనో చూడుమని గద్దించెను. అప్పుడు నేను ఒక శివభక్తుని వేషముతోకలికామ ధేను వునుశరణు వేడితిని. అనివారిమహిలను దెలిపెను.

## ఒడయనంబి భక్తి గీతముల రచించుట

ఒడయనంబి గర్వ ముడిగి. శివభక్తుల చరిత్రలను పాటగా రచించెను. అందు శివభక్తుల చరిత్రలే గలవు. వాని వివరణ.

## ఎణుమూర్తి నైనారు కథ

ఎణుమూర్తి నైనారను భక్తుడు ప్రతిదినము శివునకు చందము నర్పించుచుండెను. ఒకనాడు అతనికి చందనము చెక్క లభింపలేదు. వెంటనే ఆతడు తన మోచేయి రాతిపై అఱుగ దిసెను. అప్పుడు చందనము లభించెను. శివున కర్పించెను.

## కడమలనంబి కథ

కడమలనంబి ప్రతిదినమును వేయిదీపములు వెలిగించి శివు నారాధించు వాడు. అంత కొంతకాలమునకు దీపములు వెలిగించుటకు వస్తువులు కొనుటకు ద్రవ్యము లేకుండెను. ఇక లాభము లేదని, ఆతడు తన తల వెంట్రుకలను అగ్నిముట్టించి దీపములు వెలిగించెను.

## గుగ్గులు కళియారు కథ

గుగ్గులు కళియారు మహిసాక్షియను గుగ్గిలముతో శివునకు ధూపమిచ్చు చుండెను కాని ఒకనాడు గుగ్గిలము లభింపలేదు. ఒక రాజువచ్చి గుగ్గిలము నిచ్చెదననెను గాని యీయలేదు. అప్పుడు గుగ్గులుకళయారు తన కంఠమునకు వస్త్రము బంధించి ప్రాణములు విడుచుటకు సిద్ధముగ నుండెను. శివుడు నాతనికి ప్రత్యక్షమై అనుగ్రహించెను.

## అరివాళు నయనారుకథ

అరివాళునయనారు బియ్యముతో ఆహారముచేసి శివున కర్పించుచుండెను. ఒకనాడు బియ్యము లభింపలేదు. ఆతడును తన కుత్తుక నుత్తరింప సిద్ధముగ నుండెను. శివుడు ప్రత్యక్షమై యనుగ్రహించెను.

## అడిభక్తుని కథ

అడిభక్తుడు జాలరియగు శివభక్తుడు. ఆతడు వలవేసి చేపల బట్టి వాని వలన జీవించుచుండెను. ఒకనా డతడు వలవేయగా అందొక స్వర్ణమీనము వచ్చెను. అధి శివప్రీతి యని విడిచి మఱియొక రేవున వలవేసెను. అక్కడ కూడ బంగారుచేప వలలో పడెను దానినతడు విడువగా, అది తిరిగి వచ్చుచుండెను, ఇట్లొక పగలెల్ల చేయ ఆ స్వర్ణమీనము వచ్చుచునేయుండెను. నా ఆత్మేశ్వరుడైన శివుని స్వర్ణమీనమిది గాన. నా ఆత్మార్థము దీనిని గ్రహించుట అనుచిత మని విడిచెను. అప్పుడు శివుడు ప్రత్యక్షమై అడిభక్తుననుగ్రహించెను.

## ఏణాదినాథునికథ

ఏణాదినాథుడు ఏలూరు నివాసి. భూతిరుద్రాక్షధారణుల శివభక్తులుగా సేవించుచుండెను. అచ్చట రాజు బలవంతుడై యుండెను. ఆత డెవ్వరని లక్ష్య పెట్టు వాడు. ఆతడు తన సేనాధిపతికి భూతిరుద్రాక్షధారణచేసి ఏణాదినాథుని యొద్దకుపంపెను. ఆతడును వచ్చినవాడు భావియని వాస్తవముగా శివభక్తుడు కాడని తెలిసి,కత్తి చేబూని ఆతని తల తెగవేయ సమకట్టెను. శివుడు ప్రత్యక్షమై ఏణాదినాథు ననుగ్రహించెను.

## చేదివల్లభుడు

చేదివల్లభుడగు రాజును నట్లే భూతిరుద్రాక్షధారులగు శివభక్తుల నర్చించు చుండెను. ఇది తెలిసికొని పదుమువ్వురు భవులు భూతిరుద్రాక్షలు ధరించి ఆతని వద్దకు రాగా వా రితరులని భావింపక శివభక్తులుగా నెంచి పూజించెను వారును శివభక్తులైరి. శివుడు చేదివల్లభునకు నిత్యత్వ మొసగెను.

## కరయూరి చోడని కథ

కరయూరి చోడడు రాజు. అతడు భూతిరుద్రాక్షధారణులను శివభక్తులుగా సేవించుచుండెను. ఆకడొకప్పుడు పరరాష్ట్రముపై దండెత్తి ముప్పది వేల తలలను దెచ్చెను. అప్పుడం దొక్క తలయందు శివునివలె జడ లుండుట జూచి, కరయూరిచోడడు దానిని నఱికి, తన తల యతికించెను. శివుడు నను గ్రహించి కరయూరచోడని తలయిచ్చెను.

## కళియంబనైనారు కథ

కళియంబనైనారు శివభక్తుడు. శివభక్తుల కాళ్లు గడిగి సేవించుచుండెను. ఒకనాడు ఆతని యింటిలో పనిచేయువాడు శివభక్తునివలె భూతిరుద్రాక్షలు ధరించి వచ్చెను. ఆతడు తన సేవకుడని యెఱిగియు కళియంబ శివునిగా దలచి భార్యను పాదములు కడుగుటకు నీళ్లు తెమ్మనెను. వీడు మనయింటి దాసి, నేను నీళ్లపోయను అని నిరాకరించెను కళియంబ కోపముతో నామెరెండు చేతులు నఱికెను. శివుడు నామెకు కరముల నొసగెను.

## ఇరువదాండారి కథ

శివు డొకనాడు శివభక్తవేషమున ఇరువదాండారికి నొక బొంత కచ్చడము బాకు నిచ్చి యుంచ మనెను తరువాత తాను వెడలి వాని నదృశ్యము చేసెను. తిరిగి వచ్చి వానిని యడగెను. అవి ఇరువదాండారి ఇల్లంత వెదకిన కానరాలేదు. అప్పుడు తన యింట నున్నవన్ని బొంతలు కచ్చడములు నీయ బోయెను. శివుడవిచూచి తానిచ్చినవానితో సరిగావనెను. శివుడాతని భక్తికి మెచ్చెను.

## దంగుళి మారయ్య కథ

దంగుళిమారయ్య జంగమార్చనలు చేయుచుండగా, శివుడు వర్షమున బాగుగా దోగి గజగజ వణకుచు నొక తపసివలె అర్ధరాత్రమున మారయ్య యింటికి వచ్చెను. మారయ వెంటనే తానున్న పాకను తగులబెట్టి,అగ్నినిడి అతడు పూర్వరీతి నున్నట్లు చేసెను. ఆతడును తనకు ఆకలి యగుచున్న దనెను.

ఇంటిలో కొన్ని విత్తనములను వేచి వాని నాహారముగాజేసి, అతనిని సంతృప్తునిగా నొనరించెను. శివుడు నాతని యనుగ్రహించెను.

## గణపాలుని కథ

గణపాలుడను భక్తుడు, జంగములకు కావలసిననంత ధనము నిత్తును, తక్కిన వారిని చంపుదును, అని నియమముతో నుండెను. శివుడును వెలమయై అతనియొద్ద సేవకుడై వెట్టిపనులు సేయుచుండెను. గణపాలు డది కనిపెట్టి, వెలమని చంపుటకు సిద్ధపడెను. శివుడు ప్రత్యక్షమై అనుగ్రహించెను.

## కుమ్మరిగుండయ్య కథ

కుమ్మరిగుండయ ఒకనాడు శివుని నర్చించుటకై చనుచుండ దారిలో నొక కాంత, మీదనుండి పుక్కిలించి ఉమ్మివేసెను. ఆ యెంగిలి నీరు ఆ శివ భక్తునిపై బడిన దని గ్రహించి మేడ దిగి, అపరాధము మన్నింపవేడి స్నానము చేయించి చందన తాంబూలము లిచ్చి పంపెను. ఇంటికి రాగానే భార్య, నీవు పర కాంతవద్దకు బోయితివి నన్ను ముట్టకుము అని యెడముంచెను. ఇట్లు చాలాకాలము గడవగా వారు ముసలి వారైరి. శివుడు వారిని కరుణింప దలచి, జంగమవేషముతో నొక కప్పెర నిచ్చి వెడలిపోయెను. తరువాత దానిని నదృశ్యము చేసెను. తిరిగి వచ్చి తన కప్పెర నడిగెను. దంపతులెంత వెదకిన లేదు. నా కప్పెర నాకిండు లేని యెడల నిచ్చట నున్న నీటి గుండములో మునిగిలేదని తెల్పుడు అనెను. వారట్లు నీటిగుండములో మునగ గానే, శివుడు వారలను పైకెత్తెను. వారు పూర్వరీతిని యౌవనముతో నున్న దంపతులైరి.

## పూసలనయనారు కథ

తానున్న గ్రామమున విక్రమచోడుడు బంగారముతో శివుని గుడి కట్టగా, పూసలనయనారు అన్నియు రత్నములతో శివుని గుడి కట్టించెను

మఱికొందరు భక్తులు

### తిరుపాలుడు

ఇతడు రాజైనను రాజ్యమొల్లక జడలు దాల్చి శివుని గొల్చుచుండెను.

### దిరుకుర్వి

తిరునావకపురీశుని స్థిరముగా గొలిచెను.

### తిరుమూలుడు

తానును భార్యయు శివుని గొల్చిన భక్తుడు తిరుమూలుడు.

### చిఱుపులి

ప్రతిదినమును వేయి మంది జంగమముల నర్చించుచుండెను.

### చిఱుత్తొణయుడు

శివునిచే నిత్యము నొక మాడ గొనుచుండు శివభక్తుడు.

ఈ కథలను మడివాలు మాచయ్య దెలిపి, భక్తి భావనతో నితర భావములు లేక, గరువము చెందక వర్తింపమని చెప్పి బసవేశ్వరుని దీవించెను.

# పంచమాశ్వాసము

## కిన్నర బ్రహ్మయ్య కథ

కిన్నర బ్రహ్మయ్య ఏకాంత నితాంత శివభక్తుడు, నాదవిద్యాపండితుడు. ఆతడు తన కిన్నెరపై నిరంతరము శివుని గూర్చి గానము చేయుచు శివానంద యోగమగ్నుడై యుండెడివాడు. ఆతనికి కిన్నర వీణె వాద్యము వినుటకు నారదాదులును వచ్చెడివారు. జంగమములకు ఒక మాడ, ఒరయాక, ఒకపాతి కసు నిచ్చుచుండెడివారు.

కిన్నెర బ్రహ్మయును బసవేశ్వరుని శివభక్తి మహిమ విని ఆతని చూడ వచ్చెను. ఇరువురును శివానుభవానంద నిమగ్నులై యుండిరి.

## గొఱియ కథ

తన వారాంగనార్థమై, ఒక మిండజంగమము నొక గొఱ్ఱెను వధింప దలచి, వెల యిచ్చికొనెను. దానిని తీసికొని వచ్చుచుండగా, అది మెడత్రాడును త్రెంచి, త్రిపురాంతకదేవాలయమునకు పాఱిపోయి కిన్నర బ్రహ్మయ్య శరణు జొచ్చెను. ఆతడును దాని కభయ మిచ్చెను. మిండడును అక్కడికివచ్చి. ఈ గొఱ్ఱె నేను వెలయిచ్చి కొంటిని, కాఒట్టి దీనిని విడువుము అని చెప్పెను. కిన్నర బ్రహ్మయ్య విని, ఈ గొఱియ నా శరణు చొచ్చినది, శరణు చొచ్చిన వారి రక్షించుట పరమ ధర్మము కావున నేను దీనిని విడువను. దీనికి నీ విచ్చిన వెల కంటె హెచ్చుగా నిచ్చెదనని వేయిమాడ లిచ్చెను. వానిని చేకొని ఆమిండజంగమము వేశ్యయింటికి గొఱ్ఱె లేకుండ వెళ్ళెను. ఆమెయు గొఱ్ఱెను తీసికొని రాక పోవుటచే కోపించి తనవద్దకు నంతనుండి రావలదని చెప్పెను. ప్రస్తుతము తాను చేయు వ్రతమునకు భంగము కలిగినదని, గొఱియను తప్పక తీసికొని రమ్మని మిండని పంపెను. ఆతడును వచ్చి కిన్నర బ్రహ్మయ్యను చూచి గొఱియ నిమ్మనెను. ఆతడిచ్చిన వేయిమాడల నిచ్చెదననెను. కిన్నర బ్రహ్మయ్య యొద్ద గొఱియను బలవంతముగా తీసికొనబోయెను. ఆతడును మిగుల కోపించి ఆ మిండజంగమమును చంపెను.

అప్పుడా జంగమము సంబంధు లచ్చటికి వచ్చి. ఆతని కిన్నరబ్రహ్మయ్య చంపినాడని బిజ్జలునికి తెలిపిరి. ఆతడు కోపముతో కిన్నరబ్రహ్మయ్య కడకు తన ప్రధానుల నంపెను. వారును వెళ్లి శివభక్తులగు భక్తులు హింసచేయరు అట్టి పట్టున నీవెట్టు నీతని జంపితివి అని అడిగిరి. అపుడు కిన్నరబ్రహ్మయ్య గొఱియను శరణు జొచ్చినది. దాని రక్షణ నాకు కర్తవ్యము. దానిని బలవంతముగా తీసికోదలచినవాడు గాన నీతని జంపితిని. దీనికి త్రిపురాంతకుడే సాక్షి. "అతనిని బిలిచెదను" అని త్రిపురాంతకేశ్వరుని గుడి తలపులు తెఱచి శివుని బిలిచెను. శివుడును 'ఓ' యని పలికి, జరిగినది సాక్ష్య మిచ్చెను. బసవేశ్వరుడు నచ్చోట నుండెను. మిండని జంపితినిగాన తాను చనిపోవుదునని కిన్నెరబ్రహ్మయ్య

ప్రాణములు విడిచెను. త్రిపురాంతకదేవుడు కరుణించి కిన్నరబ్రహ్మను, మిండ జంగమును బ్రతికించెను.

## కలకేతబ్రహ్మయ్య కథ

కలకేత బ్రహ్మయ్య బసవని సమకాలికుడు. మహాశివభక్తుడు ఆతడు. కోలెమ్మగుడియ చేపట్టి. ఇతర మతముల వారిని సంహరింతునని ప్రతిన బట్టెను. దుగళవ్వయను నామె తనసుతుని బంపెను. అతడు మార్గగమనముచే అలసి అలసి కలకేత బ్రహ్మయ్య వద్దకు వచ్చెను. కలకేత బ్రహ్మయ్య యీతని చంపునని దుగళవ్వ భావించెను. కాని యట్లు జరుగలేదు. అప్పుడాతడు కిన్నర బ్రహ్మయ్య యొద్దనుండెను. నీవు ధనము కొఱకు నా వద్దకు వచ్చితివి. కలకేత విద్య యనగా కాయకము. అప్పుడు దుగళవ్వ సుతుడు మూడుపుట్లు ధాన్యము కావలెనని కోరెను. కలకేతబ్రహ్మయ్య వెంటనే వానిని కల్పించి, ఆతని కిచ్చెను. అప్పు డచ్చటికి బసవేశ్వరుడు వచ్చెను. కిన్నరబ్రహ్మయ్య బసవేశ్వరుడు కలకేత బ్రహ్మయ్యను గొనియాడిరి.

## మోళిగ మారయ కథ

మోళిగ మారయ్య కాయకముచే మాడలు సంపాదించి జంగమములకిచ్చుచుండు వ్రతము గలవాడు. బసవేశ్వరుడు నితనివద్ద ధనమున్నదా యని పరీక్షించుటకు జంగమరూపమున వచ్చెను. అప్పుడు మారయ్య ఇంటిలో లేడు. ఆతని భార్య ఆతనికి పడిగముతో కళ్లు గడిగి పూజ చేసెను. బసవన ఆమెకు తెలియకుండ పడగము క్రింద పెక్కు మాడలుంచెను. మారయ్య వచ్చి ఆ మాడలను చూచి, ఇవి యెట్లు వచ్చినవి అని భార్యనడిగెను. ఒక జంగమము వచ్చినాడు.ఆతడు పెట్టినాడేమో నాకు తెలియదనెను. ఇతడు బసవేశ్వరుడే అని మారయ ఆతని వద్దకు వెళ్ళి నీమాడలు నీవు తీసికొనుము, ఇతర జంగమముల కిమ్ము అని తిరిగి యిచ్చివేసెను, బసవేశ్వరుడు మారయ్యను శరణు వేడెను. మారయ అనుగ్రహించెను.

## కన్నడబ్రహ్మయ్య కథ

కన్నడ బ్రహ్మయ్య చోరవృత్తిచేయుచు ధనము సంపాదించి జంగమముల

కిచ్చుచుండెడివాడు. ఆత డితరభక్తుల యిండ్లకు బోయి, పట్టపగలే కన్నము పెట్టెడివాడు. అయిన నాతనినెవరు పట్టలేరైరి. అంత నాతడు ఒకనాడు పట్టపగటియందే బిజ్జలుని ధన బంఢారమంతయు కన్నము పెట్టి తీసికొనెను. ఈ సంగతి బిజ్జలునకు నెఱిగింపగా, అతడు వచ్చి కన్నమును చూచి ఇది బసవనమంత్రి పని కానోపునని తలచి, ఆతని బిలిపించెను. బసవేశ్వరుడు వచ్చి ఆధర్మమును, ధర్మముచే జయింపవలెను. ఇది వేద వాక్యము, నీవు అధర్మముగా ధనము వెచ్చము చేయుచున్నావు. కన్నడ బ్రహ్మయ్య యీ ధనము జంగమములకు స్వధర్మ నిర్వహణమునకై యిచ్చు చున్నాడు. కావున కన్నడ బ్రహ్మయ చేసిన పని సరియైనది: నీ ధనమట్లే యున్నది చూడుము. ఇకనుండి శైవధర్మ కార్యములకు వినియోగింపుడని చూపెను. ఇది కన్నడ బ్రహ్మయ్య సృష్టి యని చెప్పెను. బిజ్జలుడు కన్నడ బ్రహ్మయ్య మహిమ కాశ్చర్యపడెను. కన్నడబ్రహ్మయ్య బసవేశ్వరుని కరుణించెను.

## ముసిడి చౌడయ్య కథ

ముసిడి చౌడయ్య ముసిడిపండ్లాహారముగా గొనువాడు. ప్రతిదినము నాతడు ఊరువెలుపలికి బోయి అచ్చట ముసిడిచెట్లను నఱికి ఆ పండ్లను తినువ్రతము గలవాడు. ఇట్లుండగా నొకనాడు చౌడయ్యకు కొంత దూరమున నొకమఱ్ఱిచెట్టు గనబడినది. చౌడయ్యయును దానిని నఱుక బోగా, నది బసవేశ్వరుని వటవృక్షమగుటచేత, అది వెంటనే వృషభస్వరూపము దాల్చి, చౌడయ్య ముందఱ నిలిచి అది నందీశ్వరునిగా భావించి చౌడయ్య యర్చన లిచ్చెను. అంతనొక దంపతులు తమపుత్రికతో చౌడయ్యను చూడవచ్చిరి పుత్రిక మ్రొక్కగా "శతాయుష్యమస్తు" అని దీవించెను కాని ఆమఱునా డామె గతించెను. తలిదండ్రులు చౌడయ్యవద్దకు వచ్చి యీ సంగతి తెలిపిరి. చౌడయ్యయు ఆమెపై నీళ్లు చల్లి ఆమెను బ్రతికించెను. అచ్చట నొక పాడుగుడి ముందఱ నొక తపసిశవము కన్పింపగా చౌడయ్య ఆతని బ్రతికించెను. ఆతడు విమానము మీద చౌడయ్య గ్రామము ముందు దిగెను. ఆతడును శరణుచేయగా అతనికి శివసూక్తి యనుగ్రహించెను. తపసి జంగమ మయ్యెను. ముసిడిపండ్లు తినుటచే నితనికి ముసిడి చౌడయ్య యని పేరు వచ్చినది.

## సురియ చౌడయ్య కథ

సురియ చౌడయ్య పంచభక్ష్య పరమాన్నములతో శివప్రసాదము చేసి దానిని జంగమములకు సంతృప్తిగా బెట్టుచుండెడివాడు. ఎంతమంది ఏ సమయమున వచ్చినను వారికి నర్పించుచుండెను. శివు డాతని భక్తిని పరీక్షింప నొక జంగమస్వరూపముతో చౌడయకడకు వచ్చెను. చౌడయ్యయు తొల్లిరీతి పంచ భక్ష్యములతో ప్రసాదము నిడెను. ఆతడు దానినంతయు తినివేసెను. ఎన్ని మారులు వడ్డించిన అంత ప్రసాదమును తినివేయుచుండెను. ఆ ప్రసాదము మున్నూటి అరువది పుట్లయినది. చౌడయ్యయు నిది చూచి జంగమము శివుడేయని అతనికి నర్పించెను. శివుడును చౌడయ్యను వరము కోరుకొమ్మనెను. అతడును "నాకుమఱియేమి వలదు. నీ యందు నిరతిశయభక్తి గలుగనెగడునట్లు చేయు" మని యడిగెను. శివుడును అనుగ్రహించెను. ఇత డెల్లపుడు 'సురియ' అను నాయుధము ధరించుటచే నీతని పేరు సురియ చౌడయ్య యయ్యెను.

## తెలుగు జొమ్మయ్య కథ

ఇతడు మృగవ్యాధరుద్రుడని పేరు గాంచినవాడు. కల్యాణకటకమున శివాచారయుతు డని పేర్గాంచినవాడు. సర్వజీవ దయాపరుడు. శ్రీశైలమున శివానందుడను యోగి సమాధిస్థుడై తపము సల్పుచుండెను. అతని పదనఖములు భూమిలో కూరిపోయినవి. తలవెంట్రుకలు జడలు కట్టి ఆ యోగి నీలగిరి మాడ్కి వెలుగొందుచుండెను. అతనివద్ద ఆ యోగి శిష్యుడు కందమూలాహారుడై యుండెను. అంత నక్కడికి గంధర్వకాంతలు కొంతమంది వచ్చి సమాధిస్థుడైన మునిరూపమును చూచి ముది యెలుగుబంటి యని వెక్కిరించిరి. వెంటనే అచ్చటనే యున్న మునిశిష్యు డాగ్రహము చెంది "భూమిపై మృగములుగా బుట్టు"డని శపించెను. గంధర్వకాంతలు శాపవిముక్తి కొరకు వేడుకొనగా నా ముని వారికిట్లు చెప్పెను. "కల్యాణకటక ప్రాంతమున తెలుగు జొమ్మయ చేతిలో మీరు చనిపోయినచో శాపమోక్షంబగు"నని తెల్పెను.

తెలుగు జొమ్మయ కల్యాణకటక ప్రాంతమునందు పత్త్రిరి కోయుట కరణ్యమున కేగగా మృగరూపధారులైన గంధర్వకన్యలు తెలుగు జొమ్మయను గుర్తించి వారిపై వేటాడమని, దానితో వారికి శాపమోక్షంబగునని వేడుకొనగా జొమ్మయ దివ్యదృష్టిని యథార్థమును గ్రహించి వారిపై శరములు నిగిడించి చంపివేసెను. అంతటితో గంధర్వకన్యలకు శాపవిముక్తి కల్గెను. వారు దివ్య విమానమున శివలోకమున కేగిరి. తోడి వేటకాం డ్రచ్చెరువు నొందిరి.

# షష్ఠాశ్వాసము

## ఏకాంత రామయ్య కథ

ఈతడు శివభక్తుడు. ఇతర మతముల వారిని హింసించువాడు. ఒకనాడొక జైనుడు చెప్పు లూడ్వక శివాలయము జొచ్చెను. ఏకాంతరామయ్య వాని శిరము తెగవ్రేయ సమకట్టెను. శివుడును నీతని భక్తి పరీక్షింప గోరి ఒక జంగమము రూపమున వచ్చి ఒరుల శిరమును నఱుకుట యుక్తముకాదని చెప్పెను. అంతేకాక, శివభక్తులు తమ శిరముల నర్పించి తిరిగి బడయుదురు. జంబూర్మహాకాళుడు గోవిందభట్టారకుడు తమ శిరముల శివుని కర్పించి బడసిరి. మొఱటద వంకయ్య శిరము నఱుకుకొని యర్పింపగా శిరము తిరిగి మొలిచెను. ఆతడు దానిని తిరిగి ఖండించుకొనెను. అట్లే ఎన్నిసారులు నఱుకుకొనిన అన్ని మారులు శిరములు వచ్చుచునే యుండెను. అవి పెద్దరాశిగా పడియుండెను. శివుడు ప్రత్యక్షమై, నన్నుగెల్చితివి. అని ఏకాంతరామయ్యను ప్రశంసించి కరుణించెను.

## తిరునావకరశు కథ

తిరునావకరశు అను శివభక్తుడు ఇతర మతీయుల నెన్నడును చూడని వాడు. అప్పు డచ్చటి జైనులు నాతనిపై నొక మదపుటేనుగును పంపిరి. గజాసురుని జంపిన శివుని భక్తుడగు తిరునావకరశును ఆమదకరి ఏమియు చేయలేక చూడగానే తిరిగిపోయెను. తిరునావకరశు, భవియగు నేనుగును చూచి, ఇది జైనులు చేసిన పని యని గ్రహించి. జైనదేవాలయములలో జినదేవుని విగ్రహము లన్నింటిని నాశనము చేసెను.

## ఇరుత్తాండి కథ

ఈతడు జాత్యంధుడు. అందుచేత నాతడు శివుని యభిషేకించుటకు నీటి కొఱకు ఒక కొలనికి పోవుటకు ఒక యుపాయము పన్నెను. ఒక శంకువునకు, మఱియొక శంకువునకు త్రాడుగట్టి ఆ త్రాటి చేత సరిగా కొలనికి బోయి, నీరు దెచ్చి శివుని నభిషేకించు చుండెడివాడు. జైనులు దీనిని కనిపెట్టి యీతని వ్రతము భంగపఱచెదమని పట్టుబట్టి, ఒకనాడతనికి సహాయముగ నున్న త్రాటిని

మధ్యకు తెగగోసిరి. కాని వెంటనే శివుని కరుణవలన ఆతడు పడిపోలేదు. కన్నులు వచ్చినవి. ఆతడప్పటి నుండి జైనవసతులను ధ్వంసము గావించెను.

## పిళ నెనారు కథ

పిళ్లనాయనారను శివభక్తుడు స్నానము చేయుటకు ఏటికిబోయి తన బాలు నచట తీరమున నునిచెను. ఆతడు స్నానము చేయుచుండగా శివపార్వతులు విమానారూఢులై వెడలుచు, "ఆబాలునికి చన్నుగుడుపుము ఇతడు మనకు కొడుకు" అని శివుడు చెప్పెను. గౌరికి చన్ను చేపెను. ఆమె బాలునికి పాలిచ్చి, ఒక బంగారు గిన్నెతో మఱికొన్ని చనుబాల నిచ్చెను. పిళ్లనయనారు స్నానము చేసి వచ్చు సరికి బాలుడు దేహకాంతిచే మెఱిసి పోవుచుండెను. చేతను బంగారుపాత్ర చను బాలతోనుండెను. బాలునడుగగా పార్వతీయే యట్లు చేసెనని చెప్పెను. ఆతడు బాలుని గొనిపోయి, శ్రీకాళికానాథుని దృఢభక్తికథలను వినుచుండెను. అప్పు డచ్చటి బౌద్ధులు రెండువేలమంది, జైనులు పదునెనిమిది వీరశైవుల నోడించుటకు జ్ఞానసంబంధియను నాతని సాహాయ మడిగిరి. ఆతడు నొప్పుకొనెను. అప్పుడు జైనులు అచ్చటి రాజుతో "జినమంత్రలేఖ, శివమంత్రలేఖ ఏటినీటిలో వదలు దము. ఏది మునిగి, ఏదిపైకి వచ్చిన వారిదే గెలుపు" అనిరి. శైవులు నంగీక రించిరి. రెండు లేఖలను ఏటి నీటిలో వదలిరి. జిన మంత్రలేఖ మునిగిపోయెను. శివమంత్రలేఖ పైకివచ్చెను. దీనిని ప్రోత్సహించినందు వలన జైనుడగు రాజు నకు గుండెపై పుండుపుట్టెను. రాజు భార్య మంగయక్కరసి. ఈ పుండు మాన్పు వారిని వెదకు చుండెను. అప్పుడు జైను లొక యుక్తిని నాలోచించిరి.

"జినమంత్రలేఖ శివమంత్రలేఖ అగ్నిలో వేయుదము. ఏది కాలిపోకుండ నుండిన. వారిదే గెలుపు. వారు దీనిని మాన్పగల"రని తెలిపిరి. ఆమె యట్లే కానిమ్మనెను. జిన. శివమంత్రలేఖలను రెండింటిని అగ్నిలో వేసిరి. జిన మంత్ర లేఖ కాలిపోయెను. శివమంత్రలేఖ కాలిపోక అట్లేయుండెను. పిళ్లనయనారు రాజు గారి పుండుమాన్పెను. వారు శివభక్తి పరులైరి. పిళ్ళనయనారు, జైనవసతులను ధ్వంసము చేసెను. జైనులు నశించిరి.

## నిడుమారని కథ

నిడుమారడను రాజు శైవుడు. అయినను ఆతని రాజ్యమంతయు జైనులే

యుండిరి. రాజది సహింపలేక వారి నందఱ బిలిపించి, మీరు అశాస్త్రీయమైన జైనమతమును వహింపుచున్నారు. దానిని విడిచిపెట్టి శైవమతము చేరుడని చెప్పెను. వారును సభచేసి శైవ మతమే శాస్త్రీయమని నిరూపించి నపుడు చేరుదుమని చెప్పిరి. రాజును సభ చేయించెను. శివుడు ఒక శివభక్తుని రూపమున వచ్చి శాస్త్రవాదమున జైను లందఱను జయించెను. వారు శైవులైరి.

## నమినంది కథ

తిరువాలూరిలో అందఱు జైనులే యుండిరి. నమినందియను నొక్క శివ భక్తుడు మాత్రమే యుండెను. ఆతడు నేతితో ప్రతిదినము వేయిదీపములు వెలిగించుచుండెను.

అచ్చటి జైను "లీ శివభక్తునకు నేయిలేకుండ చేయుదము,ఎట్లు దీపములు వెలిగించునో చూత"మని నేయి యాతనికి దొరకకుండ చేసిరి. నమినందియు గుడికివచ్చి శివుని ముందఱ నేయి దొరకకున్ననేను ప్రాణములు విడిచెదనని తన తల తెగవేయుటకు సిద్ధమయ్యెను. శివుడు ప్రత్యక్షమై కావలసినంత నేయి నిచ్చెను. అంత అచ్చటి పశువులెల్ల పాలు లేక హతమైనవి. జైనులు నమినందిని వేడగా నతడా పశువులను బ్రతికించి, జైనులకు శివదీక్ష నిచ్చెను.

## సాంఖ్యతొండని కథ

ఇతడు జైనుడయినను శివభక్తిపరుడయి యుండెను. కాని వారు శివ పూజకు పుష్పములు లేకుండగ చేసిరి. అప్పుడాతడు రాళ్ళను తీసుకొని వానితో పూజించుచుండిరి. జైను లారాళ్ళుకూడ లేకుండ చేసిరి. అప్పడు సాంఖ్యతొండడు, శివునితో మల్లెమొగ్గలు వైచిన మదనుని సహరించితివి. ఇది న్యాయమా నేను పూవులు దొరకక పోవుటచే నిట్లు చేసితిని నీవు కరుణించి, నేను నీమీద వైచిన రాళ్ళను పూవులుగా మార్చి అంగీకరింపుమని వేడెను. శివుడట్లు చేసి యాతని ననుగ్రహించెను.

## కోవూరి బ్రహ్మయ్య కథ

కోవూరి బ్రహ్మయ్య శైవ భక్తుడు. జైనులాతని హింసింప గోరి, నొక మఱ్ఱిచెట్టును గాల్చి దానిని బ్రతికింపుమనిరి. కోవూరి బ్రహ్మయ్యయు దానిపై

భసితపునీళ్లు చల్లి తొల్లిటివలె, అకులతో, ఊవలతో దానిని విలసిల్ల జేసెను.

## దేడర దాసయ్య కథ

పొట్లచెఱువను వూరిలో ఏడువందల జైన వసతులను గట్టించి, ఇరువది వేలమంది జైనులు గొలువగా నొక జైన గురువుండి అక్కడ రాజైన దేసింగ వల్లభుని జైనమతస్థునిగా చేసెను. ఆతని భార్య సుగ్గలదేవి. ఆమె శివ భక్తురాలు. శివభక్తుడగు దేడర దాసయ్య శిష్యురాలు. అప్పుడు రాజామెను చూచి, సతికి, పతికి వేఱువేఱు మతము లుండునా నీవు పవిత్రమైన జైనమతము స్వీకరింపని యెడల నన్ను విడిచి వెళ్ళిపొమ్మనెను. ఆమెయు పతిని వీడి వేఱుగా భవనము నిర్మించుకొని దేడర దాసయ్యతో శైవశాస్త్ర విచారణ చేయుచుండెను. శైవమతము వ్యాపింపజేయ మొదలుపెట్టెను. జైనులది గని రాజుతో శైవులకు మాకు సభపెట్టించి వాదమునకు వారిచే బిలువుము. వాదములో గెల్చిన వారి మతమును ఓడిన వారు స్వీకరింప వలయునని నియమము చేయుమనిరి. రాజు అట్లే కావించెను. సుగ్గలదేవి దేడర దాసయ్యను పంపెను. ఆతడును వాదమునకు ప్రారంభించి మీకు గల్గినది జీవమో, ఆత్మయో దెలుపుడని ప్రశ్నించెను. కాని నాస్తికులైన జైనులు ఈశ్వరు నంగీకరింపరు. అందుచే వారు ప్రత్యుత్తర మీయ లేకపోయిరి దాసయ్య శివజీవ భేదమును నైక్యతను శాస్త్రీయ సంప్రదాయములతో సిద్ధాంత పూర్వకముగ నిరూపించి, జైనమతము ఖండించి శైవమతము ప్రతిష్ఠించెను. జైనులేమి నూఱు మాటాడలేక ఊరకుండిరి. తమ ఓటమి నంగీకరించిరి. వారందఱు రాజుతో గూడ దేడర దాసయ్య శివదీక్ష పొందిరి. రాజు వారి ఏడువందల వసతులను క్రొప్పించి వైచెను. పొట్లచెఱువున సమస్త జనులు శైవులైరి.

## హిరియ బాచయ్య కథ

మానుడిగ అను జైనపురమున హిరియ బాచయ్య యను శివభక్తుండుండెను. అచ్చట నొక శివాలయము గలదు. దాని యందలి లింగమును జైనులు క్రొప్పించివైచిరి. అంత హిరియ బాచయ్య తన శివభక్తి మహిమచే, ఏడువందల శివాలయములు గట్టించి, ఏడువందల లింగములను ప్రతిష్ఠించెను. పన్నెండువేల

జంగమములతో నాతడు శివమత వ్యాప్తి చేయుచుండెను. శైవులును జైనుల తలలు నఱికిరి. జైన గురువు లేమియు చేయజాలరైరి. శైవులును వేయి ఏడు వందల జైన వసతులను ధ్వంసము చేసిరి.

## సోమన్న కథ

హుళిగర అను పురమున, సోమన్న యను శివభక్తుడుండెను. ఆతని కొకనాడు కన్నులు కానరాలేదు. జైనులు వచ్చి, "ఇదిగో నిన్ను శివాలయమునకు తీసకొని పోయెదము. ఆతని చేయిబట్టి ఏటివద్దకు తీసికొని పోయి, ఇదే శివలింగము మ్రొక్కు"మనిరి. ఆతడును ఒక జైనుని తలపట్టెను. వెంటనే ఆతడు లింగాకృతి ధరించెను, సోమన్నకు కన్నులు వచ్చెను. జైనులు సిగ్గుపడి పాఱి పోయిరి.

## వైజకవ్వ కథ

వైజకవ్వ అను శివభక్తురాలు వరళిపురమున నుండెను. ఒకనాడు శివుడు ఒక తాపసివేషమున వచ్చెను. వైజకవ్వ ఆతనికి పరిచర్యచేసి పంచభక్ష్యములతో ఆహారము బెట్టెను. ఆతడు సంతృప్తిగా తిని వెడలిపోవుచుండగా జైనులది చూచి రాజుతో నీ విషయము దెల్పిరి. తపసిని చూచుటకు రాజు తనపరివారముతో రాగా ఆత డదృశ్యు డయ్యెను. రా జామెను చూచి వైజ' తపసిని నెచ్చట దాచితివని యడిగెను. అంతేకాక తన యాజ్ఞలేకుండ నాతనికి ఆహారము పెట్టించినందున ఆమెను చూచి నీవాతపసితో బొమ్ము. అని సమ్మెటతో నామెను కొట్ట నారంభించెను. వైజకవ్వ శివుని దలచెను. ఆ సమ్మెటపె ట్లన్నియు పతిపై బడెను. ఆ పెట్లు వేయియై జైన గురుల మీద బడెను. శ్రీచంద్రముని భరింపలేక అడవిపాలయ్యెను. జినచంద్రముని ఆగ త్తలో బడెను. క్షపణేంద్రముని విలవిలకొట్టుకొని అపరాని తాపమందెను. విపులేంద్రముని వీపువిఱిగెను. నాగేంద్రముని ప్రాణములు విడిచెను. పతియు సతియైన వైజకవ్వ శివభక్తికి ఆశ్చర్యమొంది జినాలయమున కేగ అది శివాలయమయ్యెను. తిలకవ్వయను నామె, శివభక్తురాలై శివభక్తి రహితుడైన మగని విడిచి శివలింగము వెనుక దాగెను భర్త ఆమె కొంగు లాగగా ఆమె పురుషత్వమునందెను. దీనికి పూర్వము వింటిమాని జైనులు వైజకవ్వకు మ్రొక్కిరి. అప్పటినుండియు వరళిగలో శివుడు వైజనాథుడను పేర ప్రసిద్ధుడయ్యెను.

వైజకవ్వ మహిమను విని బిజ్జలుడు, బసవేశ్వరుడు, ఏకాంత రామయ్య కీర్తి ఎల్లకడల వ్యాప్తి జెందెను. ఈమె బసవేశ్వరుని సమకాలీన.

## షోడ్డలదేవు బాచయ్య కథ

షోడ్డలదేవు బాచయ్య బిజ్జలుని సమకాలీనుడు. శివభక్తుడు అతడు శివరాత్రికి సౌరాష్ట్రమునకేగి సోమనాధుని దర్శించి వచ్చుచుండెడివాడు. అదిచూచి బిజ్జలుడు శివరాత్రి యిచ్చట చేయుటకు వీలులేదు. సౌరాష్ట్రమునకే చనునని యుత్తరువు చేసెను. సౌరాష్ట్రనాధు నిచ్చటకి రప్పింతునని బాచయ్య భక్తినిష్టతో నుండెను. ఒక ప్రతీహారి రూపమున సోమనాధుడు వచ్చి బాచయ్యకు శివలేఖ నిచ్చెను. బాచయ్య అదిచుచి ఆతనికి మ్రొక్కెను. ఆతడు బాచయ్య ఇంటి యందు గాదెల కొద్ది ధాన్యమును నింపెను. ధనమును విశేషముగా లభింప జేసెను. అది చూచి బాచయ్య పూర్వపు గుడిని బగులగొట్టించి శివునికి సువర్ణాలయము గట్టెను. కొట్టరువు వలన నీ ఆలయము కట్టింపబడినది గాన, ఇట శివుడు కొట్టరువు సోమనాధుడని ప్రసిద్ధిగాంచెను. బిజ్జలుడును బాచయ్యను తన కొలువు నుండి తొలగి పొమ్మనెను. బాచయ్యయు బసవేశ్వరుని గని, కల్యాణమును వీడి కొట్టరువు సోమనాధునే సేవించుచుండెను.

## అరియమ కథ

ఒకనాడొక బ్రాహ్మణుడు రుద్రమంత్రము చదువుచు ఇతని భిక్ష వేడెను. బాచయ్యయు నాతనికి ఆహారము పెట్టెను. బ్రాహ్మణుడు దానిని భుజించెను. అందుండి ఒక మెతుకు జారిపడెను. బ్రాహ్మణుడు అరియమను వేఱొక రీతిగా నిందింపగా, ఆతడు బ్రాహ్మణుని కడుపుచచ్చి ఆహారముపైని బడవేసెను. బ్రాహ్మణుడు చనిపోయెను. అరియమ బ్రాహ్మణుని చంపెనని చెప్పిరి. రాజు కోపించి అరియమ పొట్ట గ్రచ్చుడని ఆజ్ఞాపించెను. సేవకులట్లు చేయుటకు ప్రయత్నింపగా అచటి శివుడగు సోమనాధుడు లింగ గర్భమును దెఱచి యందు దూరుమనెను. అట్లాతడు లింగగర్భము దొచ్చుచుండగా సేవకు లాతని పైకి లాగుటకు ప్రయత్నించి కట్టుబట్టను లాగదొడగిరి. కాని అరియమ గర్భములోపలికి వెళ్ళిపోయెను. ఆతని కట్టుబట్ట మూరెడు పైకి వచ్చెను. అది

నేటికిని అచ్చట గానవచ్చును. ఇది మహేంద్ర మంగళమను పురమునందు గలదు.

## వీరశంకరుని కథ

వీరశంకరుడు శివభక్తుడు. ఇతర మతములవారితో పలుకడు. వారిని నిరసించును. ఒక బౌద్ధుడది చూచి, ఈతని గాల్చిన సరిపోవునని తలచెను. వీరశంకరుడు శ్రీగిరియందు శివునర్చించు స్థలముక్రింద నొక యినుప పెన ముంచెను. అది బగబగమని కాలుచుండెను. వీరశంకరుడది యెఱుగక వచ్చి దానిపై గూర్చుండి శివు నర్చించుచుండెను. అది ఆతని శివభక్తి మహిమవలన చల్లనయ్యేను.

## శివలెంక మంచెయ్య కథ

శివలెంకమంచెయ్య శ్రీ కాశీక్షేత్రవాసి. విశ్వేశ్వరునికి ప్రతిదినము తన పది వ్రేళ్ళను నఱికి శివున కర్పించి తిరిగి వానిని పడయుచుండెను. కాశీ క్షేత్రమున నొక వైష్ణవాచార్యుడు వచ్చి మంచెయ్యతో శాస్త్రవాదను చేసెను. గాని యాతని గెలువలేకపోయెను. అచ్చట ఇతర మతస్థులు కేశవుడే కర్తయని గదాధరుడగు విష్ణుమూర్తికి ఆలయము గట్టి అందు విష్ణుమూర్తిని ప్రతిష్ఠించిరి.

వైష్ణవాచార్యుడు అంత శాస్త్రవాదము చాలదు. నీకు శక్తి గలదేని శివుడే జగత్తు కంతయును కర్తయని-వేఱు దైవము లేడని దృష్టాంతము చూపుము- అని ఢీకొనిరి. శివలెంకమంచెయ్యయు, ఆ గుడియొద్దకేగి "ఓరోరి విష్ణు! నీ కొడయడైనట్టి విశ్వేశునకు మ్రొక్కవెడలి రమ్మ"ని పిలిచెను. వెంటనే విష్ణు మూర్తియు పాదచారియై వచ్చి విశ్వేశ్వరునకు "శివభక్తః ప్రభుర్మమ" అని శివుడగు విశ్వేశ్వరునికి మ్రొక్కెను. అచ్చట వారందఱు శివలెంకమంచెయ్య శివభక్తి మహిమ కత్యంతాచర్యచ్చకితులైరి. నేటికిని విష్ణువు విశ్వేశ్వరలింగ మునకు ముందు మ్రొక్కినటు లున్నవాడు.

## శంకరదాసుమయ్య కథ

శంకరదాసుమయ్య "మమకర్తా మహేశ్వరా" అను వీరవ్రతముతో నుండెను. అతడు నాతతముగ శివోత్కర్షను బాహాటముగా ఛాటుచుండెను.

"ఏకో రుద్ర ఉచ్యతే" అని వేదవాక్యమును నేకైకముగా వ్యాప్తి జెందించెను. కర్మము కర్త క్రతువు సర్వము శివుడే యని స్థిరము నిరూపించెను.

శివుడు మత్స్యావతారము మడియించి మత్స్య కేతనవైరిని తల చుట్టెను. కూర్మావతారమున కూర్మము కపాలమును తన హార మధ్యమున నిమిడ్చెను. వరహావతారమున వరాహదంష్ట్రము తన చేతిలో నుంచుకొనెను. నరసింహావతారమున శరభరూపమై నారసింహు తోలుద్రవ్చి, తన వస్త్రముగా ధరించెను. త్రివిక్రముని నెట్టెము ఖట్వాంగముగ తన యాయుధము చేసికొనెను. హరిని హరించిన హరుడయ్యెను. దక్షుని యజ్ఞము ధ్వంసముచేసి, ఆతని శిరస్సుకు బదులు మేకశిరస్సు నతికించెను.

విష్ణువు ప్రతి దినము శివుని వేయి కమలములతో పూజించుచు నొకనాడు పూజాకమల మొకటి తక్కువయైన తన కన్నిచ్చి-దానిచే పూజను పూర్తిచేసి, కన్నును చక్రమును శివునిచే పడసెను. లంకలో మత్స్యకేశ్వరుని ప్రతిష్ఠించెను. శ్రీరాముడై సేతువునందు లింగమును స్థిరము చేసెను. ద్వార సముద్రమున కూర్మనాధుని నిలిపెను. వ్యాసుడు వ్యాసేశ్వరుని కాశిలో వ్యాప్తము చేసెను. "యథాశివమయో విష్ణు"వనుమాట ప్రక్షిప్తము. శివుడే సృష్టికర్త, స్థితి కర్త, అతడే లయకర్త అని దృష్ట ప్రమాణ ప్రత్యయములతో నిర్వివాదముగా శంకరదాసి నిరూపణ చేసి, శివమహా మహిమైకత్వము, ఏకైక దైవత మూర్తిత్వము సమస్త లోకైకవ్యాప్తము గావించెను.

# సప్తమాశ్వాసము

## శివనాగుమయ్య కథ

బసవేశ్వరుడు అంత్యజులైన వారి పాదములను గడిగి, అవి ప్రాశించు చుండును. వారలకు భక్తితో మొక్కును. మన కల్యాణ కటక మంతయు మాలల పాలయ్యెనని పురజనులు బిజ్జలునితో చెప్పిరి. బిజ్జలుడును బసవేశ్వరుని పిలిచి బసవనమంత్రి ఇట్లు చేయుట నీకు తగునా? అగ్రవర్ణులే పూజనీయులు

గాని అంత్యజులు అంటరాని వారని నిరసించెను. బసవేశ్వరుడు అంత్యజుడగ్ర వర్ణుల కంటె నధికుడు. ఇతరుల శరీరములో రక్తముండును, అంత్యజుల శరీరములలో పాలుండును.

ఇట్లుచెప్పి ఆ స్థానమధ్యమున శివనాగుమయ్యను సింహాసనము పైనుంచి అతని చేతిఁవ్రేళ్లను నలిపి అందుండి రక్తమునకు బదులు పాలు స్రవించుట కన్నులార అందఱికి చూపెను. ఇట్లు చూపుటయే గాక, శివ భక్తులు వర్ణాశ్రమ కులాదివ్యవస్థల కతీతులని కొంతమంది భక్తుల చరిత్రలను చెప్పెను.

## కల్లిదేవయ్య కథ

కల్లి దేవయ్య యను శివభక్తుడు మనపురములోనే గలడు. ఆతడొకనాడు వచ్చుచుండగా ఆతని దాసి, నీళ్ల కొఱకు కడవతో వెడలి, నీళ్లు నింపితెచ్చుచుండెను. అంత నొక బ్రాహ్మణుని చేయి యామెకు దగిలెను. వెంటనే నీళ్లు అపవిత్రమైనవని, ఆ కడవ నచ్చట పగులవైచి, క్రొత్త కడవ తెచ్చి నీళ్లు కొనిపోయెను. అక్కడ నున్న తక్కిన బ్రాహ్మణులిదియేమి ఈ దాసి ఆగడము- బ్రాహ్మణులితర వర్ణముల వారంటినచో స్నానము చేయవలయును. ఈమె బ్రాహ్మణులను తగిలినానని యిట్లు చేసినది. ఈ బ్రాహ్మణుడు సాక్షాత్తువసిష్ఠుల వంటివాడు. ఇట్టిపనులు తగవు అని బిజ్జలునితోజెప్పిరి. అతడు కల్లిదేవయ్యను పిలిపించి, ఏల యిట్లు జరిగినది అని అడిగెను. కల్లిదేవయ్య బ్రాహ్మణులకు ఆధిక్యత అగ్రవర్ణత్వము వేదములు చదువుట వలన వచ్చినది. వేదములు మా యింటి కుక్కలు కూడ చదువగలవు, అని తన యింటి కుక్కలను బిలిచి వేదము చదువు మనెను. ఆ కుక్కలు వేదస్వరము తూచా తప్పకుండ చదివినవి, కావున విప్రులు శివ భక్తులతో సమానులు కారు అని చాటెను. ఇంకను మఱికొందరి భక్తుల కథలు వినుము.

## బిబ్బ బాచయ్య కథ

గొబ్బూరిలో బిబ్బ బాచయ్య అను శివభక్తుడు భక్తుల చెప్పుల బిళ్ళలను శరీరమున ధరించి ఒక బండ చేయించి, దానికి నంపె పడగలుగట్టి బంగారు పట్టముతో వృషభములను పూన్చెను. ఒక పౌణకతో శివ ప్రసాదమును సంధు

బెట్టి అందుపై నొక వస్త్రముగప్పి ఆ ప్రసాదమును భక్తులకు పంచిపెట్టు చుండెను. ఒక భక్తుడా యూరిలో పండువు చేయగోర బిబ్బ బాచయ మునుపటి వలె, పౌణక నిండ శివప్రసాదము పోసి ఆతని గృహమున కేగెను,

అప్పుడచ్చటి బ్రాహ్మణు లందఱు "నేడు దొరకినాడు భక్తుడు కుల భ్రష్టులైన వారి యెంగిలికూడు అందఱికి పంచిపెట్టుచున్నాడు. ఈతని పట్టి బంధి యందలి ప్రసాదము భస్మము చేయవలెను" అని బట్టుల పిన్న, అప్పన గారి మంచన, చట్టనపెద్ది, కూచి దామోదరుడు, భాస్కరుడు, శిష్టుల బంభద్రుడు చిమ్మి కేతప్ప యెడ్లనుకట్టువిప్పి "త్రోలుడు-పౌణకపై వస్త్రమును తీయుడు, ఆ యెంగిలికూడు నాశనము చేయుడు". అని వారిని బాచయ్యపైకి బంపిరి. బాచయ్యయు నెంతమాత్రము భయపడక ఇది యెంగిలికూడా? ఇదేమి కాలకూట విషమా ఏదియుకాదు. అని పలికెను. అది వారు వినిపించుకొనక పౌణకపై వస్త్రమును దీసివేసిరి. ఇంకేమున్నది? అందున్నది అగ్నిహోత్రము వస్త్రము తీయగానే, ఆ యగ్ని వ్యాపించి బ్రాహ్మణుల యిండ్లను పూర్తిగా కాల్చెను. అగ్రహారమంతయు నగ్నిపాలయ్యెను. బ్రాహ్మణుల తలవెంట్రుకలు గడ్డములు కమరిపోయెను. వారందఱు బాచయ్య మహిమను గొనియాడి నీవే మాకు దిక్కని ఆతని పాదములపైబడిరి. మాయిండ్లను మాకు నిమ్మని కోరిరి. బిబ్బ బాచయయు కాలిన వానిపై భస్మపు నీళ్లుచల్లి మునుపటివలె బ్రాహ్మణుల యిండ్ల నన్నింటిని నిలిపెను.

## మాదర దూడయ్య కథ

మాదరదూడయ్య స్నానము చేసిన నీరు ఆతని ఇంటి ముంగల నిలిచి ఆ భాగమంతయు బురదమయ మయ్యెను. ఇట్లుండగా నొక నాడొక బ్రాహ్మణుడు, కాలుజారి ఆ రొంపిలో బడెను ఆతడు బురదలో పొర్లుచు పైకిలేచెను. లేవగానే ఆతని శరీరము మిక్కిలి కాంతిమంతమై ప్రకాశించెను. అచ్చటి బ్రాహ్మణులందఱు మాదర దూడయ్య మహత్తును గొనియాడిరి.

## భానస భీమయ్య కథ

ఈతడు దూడయ్యవలె బ్రాహ్మణులను దివ్యాంగులనుగా తీర్చెను.

## శ్వపచయ్య కథ

శ్వపచయ్యయను శివభక్తుడు ఆహారము వండి, ఇతరుల దృష్టితాకునో అని, దానిని చెప్పుతో గప్పెను. ఒక సామవేది అది చూచి, ఇతడు మాంసము వండి నన్ను చూచి బట్టను కప్పినాడు అని తలచెను. వెంటనే ఆతని మంత్ర శక్తి క్షీణించి ఆకసమున కెగురవైచిన తన వస్త్రములు క్రింద పడిపోయెను. ఆ సామవేదియు శ్వపచయ్య శరణుచొచ్చెను. ఆతనితో ముప్పది యూళ్ళవారికి శ్వపచయ్య శివదీక్షనిచ్చి శైవులుగా విలసిల్ల జేసెను.

## ఉద్భటుని కథ

బల్లకి పురమునకు రాజైన భోజుడు శివభక్తిపరుడు. అయినా వేదమార్గానువర్తి. ఆతనిభార్య జొమ్మవ్వ శివభక్తిపరురాలు. వారలకు గురువు ఉద్భటుడు. ఆతడు శివభక్తుడు గాన బ్రాహ్మణుడైనను అన్ని జాతులవారితో ముఖ్యముగా అంత్యజులతో కలసి మెలసి వర్తించుచుండెను. దీనిని చూచి తక్కిన బ్రాహ్మణులు రాజుతో ఉద్భటుడు అంత్యజులను తనవారిగా గౌరవించుచున్నాడని చెప్పిరి

శివుడు ఉద్భటుని శివభక్తి మహిమను ప్రకటింపదలచి బల్లకిపుర సమీపమున నొక మఱ్ఱిచెట్టు క్రింద తానుమానుష దేహము ధరించి దానిని దహనము చేసికొనెను. అప్పుడామఱ్ఱిచెట్టు ఆశ్రయముగా గలిగిన ఏడువందల భూతములు దివ్య దేహములతో అకాశమున కెగిరి పోయెను. ఒక భూతమాసమయమున ఆహారమున కేగెను. ఆ భూతము మిగిలి పోయి తన తోడి భూతములు కైలాసమునకేగెనని తను మిగిలితినని చింతించి భోజరాజున కీవిషయము నెఱిగించెను. వారు గంధర్వులనియు పండ్రెండు వేల యేండ్లు నంది శాపమున నట్లు భూతములైరనియు శివభక్త శరీరాగ్ని వలన తన తొంటి గంధర్వరూపము వచ్చునని తెలిపెను. ఉద్భటుడును తను తన దేహమునుండి అగ్నిని సృష్టించెను. ఆ మంట తగిలి అచ్చట మిగిలిన భూతము గంధర్వుడై స్వర్గమునకు బోయెను. మఱ్ఱి చెట్లు కాలిపోయెను. భోజరాజు దానిని చూచెను. అప్పుడు శివుడు ప్రత్యక్షమై వటవృక్షము నిల్పి, భోజరాజును జొమ్మవ్వను ఇతర పరివారసహితముగా బల్లకి పురజనులందఱిని కైలాసమునకు గొని పోయెను,

## కక్కయ్య కథ

కక్కయ్య యను శివభక్తుడు విష్ణుసత్కర్ష వినడు అచ్చట నొక పురాణభట్టు, హరి మాహాత్మ్యమును గూర్చి పురాణము చెప్పి ప్రజలను నాకర్షించెను. వారందఱు హరియే పరమదైవమని వేఱె దైవము లేదని భావనతో నుండిరి. అప్పుడు కక్కయ్య అది విని పురాణము చెప్పుచోటికి జని ఆ పురాణ భట్టును డొంకెనతో బొడచి, తల తఱిగి పొట్టలో బెట్టి విడిచెను. అది కొంత సేపటికి పురుగుల పోకయయ్యెను. ఆతని హరి కూడ రక్షించి బ్రతికింపలేక పోయెను. ఇది కక్కయ్య శివభక్తి మహిమ. ఈతనికి డోహరి కక్కయ్య అని పేరు. డోహరి అనగా కుట్టుపని చేయువాడు. ఈతడు శివభక్తుల స్త్రీ, పురుషుల బట్టలను కుట్టుచుండెను.

## భోగయ్య కథ

కెంబావిలో భోగయ్య శివభక్తుడు కలడు. ఆతడు జన్మముచే మాదిగ వాడు. అతడు జంగమార్చన చేయుచుండగా నొకనాడు ఒక శివభక్తుడు చని పోయిన పెయ్య శవము మోసికొని యతని యొద్దకు వచ్చెను. ఆతడు తనకు పెయ్య మాంసమాహారమని తాను అకలితో నున్నానని చెప్పెను. తానిది వఱకు దుగ్గళవ్వను ఆ మాంసము పాకము చేసి పెట్టమనగా ఆమె ఆలస్యము చేసెను. కావున నిప్పుడే ఆహారము పెట్టుము. అనగానే భోగయ్య ఆ పెయ్య మాంసము వండి ఆతని తన ఋంట నారగింపజేసెను. ఇట్లు చేయుచుండగా, అచ్చటి బ్రాహ్మణులందరు వచ్చి, చుట్టుముట్టిరి. ఇంతలో ఆ శివభక్తుడు శివుడు కాన అదృశ్యుడయ్యెను. విప్రులందఱు నెచ్చట నాతని దాచితివో చెప్పుమనిరి. ఆతడు శివభక్తులిండ్లలో శివేవరులుండరని చెప్పి మీరు శివదూషకులు మిమ్ములను చూడరాదని యూరివెలుపలికి పోయెను. అంత నాతనితో ఆ యూరనున్న శివ లింగములెల్ల తమ స్థానములను వీడి భోగయ్యవెంట నడచి వచ్చినవి. ఆ దృశ్యము చూచి విస్మయులై విప్రులు భోగయ్యను శరణు వేడిరి. భోగయ్యయు లింగములను యథాస్థానమున నిలిపి, తన శివభక్తి మహాత్మ్యము ప్రకటించెను.

## గుడ్డవ్వ కథ

గుడ్డవ్వ అను శివభక్తురాలు హీనకులజ. ఆమెకు కుష్ఠురోగము వచ్చెను. ఆమె ఆవిందిగె అను ఊరు ప్రవేశింప అచటి బ్రాహ్మణు లామెను నడ్డపెట్టిరి. అమెయు దానిని విడిచి సౌరాష్ట్రమునకు బోయెను. పాపమామెకు శక్తిలేదు అట్లే, కాళ్ళీడ్చుకొనుచు, మేనినుండి రక్తము కారుచుండగా బహుశ్రమతో సౌరాష్ట్ర మున కేగెను. అచట సోమనాధ దేవాలయము ముందఱ ప్రాణావశిష్టయై పడి యుండగా, సోమనాధుడు ప్రత్యక్షమై, ఆమె భక్తికి మెచ్చి ఆమె రోగము మాయముజేసి, దివ్యాంగురాలిగా నొనర్చెను. శివుడు వరము కోరుకొమ్మనిన ఆవిందెగలో వెలయుమని కోరెను. అప్పుడు సోమనాథు డచ్చట నిలిచెను. ఆమె శివభక్తికి గుడ్డవ్వయై పరగెను గాన అమె గుడ్డవ్వ యని పేరు వహించెను. ఈమె బసవేశ్వరుని సమకాలిరాలు.

## బసవేశ్వరుడు విషమును త్రాగుట

అప్పుడు కల్యాణ కటకమున నున్న బ్రాహ్మణులు తమకు శివప్రసాదము నీయుమని నిర్బంధించి యడిగిరి. "సరియే అట్లనే యిచ్చెదను మీరు శివ నిర్మాల్యమును శివప్రసాదమును స్వీకరింతురా. విషము శివుని ప్రసాదము కావున దానిని మీకు నిచ్చెదను స్వీకరింపుడు" అనెను. వారును తమ్ము చంపుటకు బసవేశ్వరుడెత్తిన యెత్తని గ్రహించి నిరాకరించిరి. శివుని ప్రసాదము మహిమ చూపనిదే సమయమని బసవేశ్వరుడు మహోగ్రముగ జాజ్వల్యమానముగ మంటలు గ్రక్కుచున్న విషము కొన్ని కొప్పెరలలోనించి ఆ కొప్పెరలలో నొకటిరెండు మాత్రము మిగిల్చి తక్కినవానిలో విషము నొక్క చుక్కయైన విడువక త్రాగి పూర్వముకంటె దివ్యశరీరముతో నుండెను. ఆతడు విషము త్రాగి, మిగిలిన శివభక్తులను బిలిచి, వారలను కడుపాఱ గ్రోలజేసెను. వారును పూర్వము రీతిని చెక్కుచెదరకుండిరి. అంతట బసవేశ్వరుని భక్తమహిమ దిగంత విశ్రాంత మయ్యెను.

## జగదేవదండనాయకుని కథ

జగదేవదండనాయకుడు బసవేశ్వరుని ఖ్యాతి విని, అతనిని చూడవచ్చి, అతడు గృహమున లేనప్పు డచ్చటికి కొందఱు బ్రాహ్మణులను పిలిపించి వారి కాళ్ళు గడుగుచుండెను. బసవేశ్వరు డది చూచి వెంటనే, శివద్రోహులను చూడ కూడదని తిరిగిపోయెను.

## ఏలేశు కేతయ్య కథ

ఏలేశుకేతయ్య యను శివభక్తుడు భవులతో పలుకడు. వారిని చూడడు అప్పు డచ్చటి భవులు కేతయకు హానిచేయదలచి ఆతని యింట ధాన్యముతో నిండిన గాదెలకు నిప్పంటించిరి. అవి పూర్తిగా కాలిపోయినవి. అయినను కేతయ్య జంకక తిరిగి నీళ్ళతో విత్తనములు నాటి ధాన్యము మొలిపించి గాదెల నింపెను. కేతయకు చేసిన హానివలన అప్పుడు బ్రాహ్మణులైన భవుల పశువు లన్నియు మేత మాని సొలియక యుండెను. ఇది కేతయ్య మహిమయే యని గ్రహించి వారందఱు నాతని శరణు జొచ్చిరి. కేతయ్యయు ఆ పశువులను పూర్వపురీతి పాలిచ్చునట్లు చేసెను.

## సవరద నాచయ్య కథ

సవరదనాచయ్య శివభక్తుడు. అతని భార్యకు కవలపిల్లలు పుట్టుదురని అందొకన్ బాలునికి లింగము పుట్టునని తెలిసికొనెను. బాలునికి వేఱుగా లింగము కలుగకపోవుటచే- నాచయ్య కోపించి, ఆ బాలుని విడిచివైచెను. బసవేశ్వరుడిది యెఱిగి "ఇచ్చట నిక విప్లవము పుట్టగలదు. అని భావిజరుగ బోవునది తెలిపెను. సవరదనాచయ్య జగదేవదండనాయకునితో బసవేశ్వరుని వద్దకు వచ్చెను శివుడు వారిని కరుణించెనని బసవేశ్వరు డెఱిగి వారెని తనతో కూడదీసికొనిపోయెను.

## అల్లయ్య మధుపయ్యల కథ

అల్లయ్య మధుపయ్య అను శివభక్తు లుండిరి. కల్యాణపురీశుడు బిజ్జలుడు బసవేశ్వరుని మహిమ నెఱిగియు నెఱుగ నట్లుండెను. అంత నాతడు

అల్లయ మధుపయ్యలను బిలిపించి కన్నులూడ బీకించెను. అది బసవేశ్వరాదులు విని వారిద్దరికి తిరిగి కన్నులిచ్చి బిజ్జలునిపై మండిపడి కల్యాణము రాజుతో గూడ పాడగునని శపియించి కప్పడి సంగమేశ్వరమునకు పోయిరి. కల్యాణ కటకమంతయు కసిబిసియై పాడయ్యేను. జగదేకదండనాయకుడు మల్లి బ్రహ్మయ్యలతో కలిసి బిజ్జలుని వధించిరి. బసవేశ్వరు డిది యెఱిగి తాను లోకమున నవతరించినందుకు వీరశైవమతోద్ధారణ సాంతముగా జరిగినదని సంతృప్తుడై సంగమేశ్వర లింగమునం దైక్యమయ్యెను. అప్పుడు పుష్పవృష్టి గురిసెను. మాదిరాజయ్య మాచిదేవయ్య మొదలగు సమస్త శివభక్తులు బసవేశ్వరుని కీర్తించి భక్తితో సంగమేశ్వర స్వరూపమును గొల్చుచుండిరి

బసవపురాణవచనము సమాప్తము

శి వ మ్ - భూ యా త్



కలచూరి బిజ్జలరాజ్య
వృషభలాంఛనము



బసవేశ్వరుడు లింగైక్యము చెందిన కూడలి సంగమము

వేశ్వరుడు ఎనిమిది దినముల క్రిందటనే లింగైక్యమయ్యెనని యచ్చట నొక యయ్య సెప్పగా విని కడు దుఃఖితుడై శ్రీశైలమునకు బయలుదేరెను. వెల్లటూరున కొచ్చి మల్లికార్జున మహాలింగము వెలసిన పవిత్ర శ్రీశైలపర్వతమును తన పాద స్పర్శచే నపవీకృత మొనర్ప నిష్టము లేనివాడై శిష్యుడైన దోనయ్యను పిలిచి శ్రీమల్లికార్జునుని దర్శించి శివరాత్రి చెల్లింపుమని యానతిచ్చెను. దోనయ్య అంతట శ్రీశైలమాహాత్మ్యమును గూర్చి చెప్పుమని గురువును వేడుకొనగా పండి తారాధ్యులవారు శ్రీనగ మాహాత్మ్యములు నీ క్రింది విధముగా చెప్పదొడంగిరి.

శ్రీగిరిమహిమఁ దా శేషునకైన
వాగీశ్వరునకైన వాణికినైనఁ
దనరుచు శ్రుతు "లనంతావై" యనంగఁ
జను వేదవేదాంత శాఖలకైన
సూతునకైన వ్యాసునకైనఁ జిత్ర
భా తనుం దట్టి శ్రీ పర్వతుఁ గన్న
యాశిలాదునకుఁ దానై కీర్తిసేయఁ
గా శక్యమే, నీలగళుఁ డెర్గుఁ గాక
వినియెఁ బార్వతి దన విభుఁ డిట్లు సెప్పఁ
దన కుమారున కంతఁ దా నానతిచ్చె,
నాతనిచే విని రమరులు మునులు
ఖ్యాతిఁ బురాణోక్తిఁ బర్వతుమహిమ
యా పురాణైకసారార్బుదాంశంబు
రూపింప నే సమర్థుండను గాన;
యైనను వినుము గృతార్థతానియతి
నా నేర్చుభంగి శ్రీనగ మహత్త్వంబు
వర్ణింతు సత్కవీశ్వరు లుత్సహింప
నర్ణవావృతధాత్రి నరు దదెట్లనిన
నాది కనాది యుగాది శిలాదుఁ
డాదరికమున మహాతపోనియతి

ముక్కంటి మెప్పించి మువ్వురసుతులఁ
జక్కన పడయుచో సద్భక్తి బుద్ధి
సిద్ధభవద్భక్తిహీనుఁ దద్వైత
బద్ధుఁ డందొకఁడైనఁ బ్రభవించెనేని
నెట్టణ పొరిగొందు నీ వద్దపడిన
నిట్టినెఁగొడుకుల నిమ్మ నా కనుఁడు
నిత్యు నయోనిజు నిర్మలదేహుఁ
సత్యకీర్తి ద్వితియ్యు శంభు సర్వజ్ఞు
ధర్మావతారు నాద్యస్తుత్యు శైవ
ధర్మశాస్త్రాచార్యు తము వృషాధీశు
నందితప్రమథగణశ్రేష్ఠు నజరు
నందికేశ్వరు సగ్రనందను నొసగె
నానందికేశ్వరుం డతివీరఘోర
మానితవర తపోమహిమాతిశయత
శివుని నిక్షించి భజించి మెప్పించి
భువిని ద్వితియ్యశంభుం డనుపేర
వాహనత్వంబు సర్వజ్ఞత్వమును స
మాహిత మగు శ్రీవృషాధిపత్యంబు
శివధర్మ శాస్త్ర విశేషరహస్య
వివిధదివ్యాగమ విరచనత్వంబు
సహజలింగైక నిష్ఠాపరతంత్ర
మహితకేవలభక్తి మతిగురుత్వంబుఁ
బ్రమథేశ్వరత్వంబుఁ బడసె లోకములఁ
దమ మేది ధర్మావతారుఁడై పరగె
ఖ్యాపితలీల శిలాదుండు; మఱియు
దీపితమహిమ ద్వితియ్యతనూజుఁ
బుణ్యజనైకశరణ్యు నగణ్యు
పుణ్యుఁ జతుర్దశ భువనవరేణ్యు
నాశాంతకీర్తి నాయత కలియుగ స

దాశివమూర్తి గతప్రపంచార్తి
మంగళచరితు నఖండు లింగోత్త
మాంగు సంతతపదయామాంగు దివ్యాంగు
నాతతపంచమహాపాతకోప
పాతకనిరసన ప్రఖ్యాత, చరితు
నాద్యు నాద్యస్తుత్యు నవికలవేద
వేద్యు నభేద్యు నవిద్యావిదూరు
నక్షీణకరుణా కటాక్షవీక్షణ సు
రక్షిత సకలముముక్షు నక్షరుని
సర్వజ్ఞు సన్మునీశ్వరసార్వభౌముఁ
బర్వతు నిహతాఘపర్వతుఁ బడయఁ
బరమేశుకారుణ్యభావాతిశయత
హరపాద భక్తి సమగ్రత నందు
సురుతపశ్చరణ కుద్యుక్తుఁడై తొంటి
పరమునీంద్రుల తపోవర్తనల్ దలఁచి
ధరణి నజాదిదుస్తరజీవరాసు
లరయఁ బర్ణాహారమైకాదె బ్రదుకుట?
జలచరాదులు వృక్ష సస్యభూతాదు
లరసి జలాహారమై కాదె బ్రదుకుట ?
పారవతాదులు [illegible]
యారసి [illegible] హారమై కాదె బ్రదుకుట?
[illegible]
లనిలంబు యాహారమై కాదె బ్రదుకుట ?
సరిఁ బిపీలికముఖ్య జంతుప్రధాన
మరయఁ గణాహారమై కాదె బ్రదుకు ?
ననుచుఁ బర్ణాది [illegible]
వినుత [illegible]
[illegible]
[illegible]

పంచాగ్నిమధ్యాది పటుతపశ్శక్తి
నంచితదేహేంద్రియాదివిరక్తి
సతతవ్రతోగ్రప్రచారానురక్తి
నతులలోకవ్యక్తి యగు గురుశక్తి
నపరిమితంబైన యతిపీఠ ఘోర
విపరీత విఖ్యాత తప మాచరింపఁ
బ్రమథాధిపతులు స్తోత్రము స్తోత్ర మనఁగ
నమరు లత్యాశ్చర్య మాశ్చర్య మనఁగ
ననుజు లెంతయును జోద్యము చోద్య మనఁగ
సనకాదు లనుపమం బనుపమం బనఁగ
వరమునీశ్వరు లిది యరు దరు దనఁగ
నరు లిట్టితపముఁ గానము గాన మనఁగ
నిష్ఠురవరతపో నిర్ణయనిరతి
నిష్ఠఁ బర్వతసన్మునిప్రవరుండు
మానతదివ్యవర్షానేకకోట్లు
దా నట్లు సరియింప ధరణి గంపింప
జడనిధు ల్గలఁగఁ దజ్జలశాయి యలుఁగ
బడబాగ్ని మలంగ దిక్పాలురు దొరఁగఁ
జుక్కలు రాల వాసుకితలల్ వ్రాల
దిక్కరీంద్రులు దూల దివి భువిఁ గూల
నమరులు వంప నజాండముల్ డిందఁ
గమలమిత్రుఁడు గ్రందఁ గమఠంబు మ్రందఁ
గులగిరు లదఁగ దిక్కులు వీడువడఁగ
సలువ యుక్కడఁగ నాద్యులు మ్రొక్కఁదొడఁగ
నంతఁ బర్వతుని మహాతపోనియతి
కంతకాంతకుఁడు ప్రత్యక్షమై నిలిచి
"జాగ్రన్మహోగ్ర సముగ్రతపోవి—
నిగ్రహావిగ్రహా ! నీ కనుగ్రహము
గావింతుఁ గావింతుఁ గావింతుఁ గరుణ

భావింతు భావింతు భావింతు నిన్ను,
మెచ్చితి మెచ్చితి మెచ్చితి వరము
లిచ్చెద నిచ్చెద నిచ్చెద, నింక
మాట లేమిటికి ముమ్మాటికిభక్తి
పాటవ ధౌరేయ! పర్వతవిభుఁడ!
వేఁడుము వేఁడుము వేఁడుమీ" వనుఁడుఁ
బోఁడిగా సర్వాంగములు భువిఁబొందఁ
దొడిఁదొడిఁ జాఁగిలఁ బడి మ్రొక్కిమ్రొక్కి
కకుభక్తి ముకుళితకరపద్మఁ డగుచు
హృత్పద్మ నీశు నెదుట నీక్షించి
ముత్పులకలు మేన మోసులుసాఁగఁ
గంఠసముద్గత గద్గదస్వరము
గుంఠితంబుగ నుతుల్ గుత్తుకఁ జిక్కి,
నానందబాష్పధారాసార వారి
నాననాంభోరుహం బటుదొప్పఁదోఁగ
బెంపు సొంపారెడు కెంపుఁగన్నులను
సొంపు వెంపారెడు కంపంబు దొడలు
దమలోనఁ బలుమఱు దర్శించి మ్రొక్కఁ
దమకించు మచ్చరికము దొంగలింప
నాయంగవిక్రియ లవియ భూషణము
లై యిట్లు పొల్పార నర్థి దులాకుఁడ
"భక్తవత్సల! విన్నపం బయ్య! జియ్య!
భక్తమనోంబుజ భ్రాజితశయ్య!
భర్గ! పరాపర! భవ! నిష్కలంక!
సర్గస్థితిలయ ప్రచరితగుణాంక!
వరద! మహేశ్వర! వఙ్రి సంత్రాణ!
పరమదయారస వరనేత్రకోణ!
యనవరత త్రిలోకైక నమస్య!
వనజాసనాచ్యుతో ద్యనిమిషోపాస్య!

గణమనోరథ పరికల్పనవ్యసన !
ప్రణత జనానీక పాతకగ్రసన !
శుభకర! యవికల; శ్రుత్యంతవేద్య!
యభవ! సంసార మహారోగవైద్య!
సర్వజ్ఞ! విశ్వరక్షణ కృపారంభ!
పర్వతకన్యకా పరిపరిరంభ !
శరణాగ తౌఘ దుస్తర పాపదావ !
పురహర! చిత్తగింపుము దేవదేవ!"
యని యిట్లు నినుఁ బర్వతాష్టకం బందు
వినుతింప నిష్టార్థ వితతులు సెందుఁ
గావున నిష్టఫలావాప్తి నీవ
కావింతు నా కని కైకొని దేవ!
వేఁడెద నిన్ను నే విజితాభిషంగ !
పోఁడిగా నవధరింపుము దయాపాంగ !
పర్వతుం డనుపేరఁ బరమార్థముగను
బర్వతాకార మగుర్వగాఁ దాల్చి
యుండెద, నీవు నా యుత్తమాంగమున
నుండవే నాథ! దివ్యోరులింగాంగ!
యాసక్తి హరివిరించాద్యులు గొలువఁ
గా సురగిరి నుండు గతి నున్కి నొల్లఁ
గైలాసమున మహాగణములు గొలువఁ
గా లీల నీవుండు గతి నున్కి నొల్ల
మందరగిరి సురబృందంబు గొలువ
నొందంగనుండు నీయున్కి నేనొల్ల,
శ్రుతులశిరంబున సూక్ష్మరూపమున
వితత మౌ నీయున్కి విధము నేనొల్ల,
గూడఁ ద్ర్యంబకముఖ్య కుధరసంఘముల
వేడుక నీ యుండు విధము నేనొల్ల,
శివలోకముఖ్య విశేషలోకములఁ

దవిలి నీయందు విధంబు నేనొల్లఁ,
బూని "యణోరణీయా" నన్నఁ బఱవి
తానంబు నందుండు తతియు నేనొల్ల,
సనకాదియోగుల సన్మనోగతుల
నొనర నుండెడునున్కి నొల్ల, వెండియును
ననుపమ శైవ సిద్ధాన్తాన నియతిఁ
జను గౌతమాదుల సజ్జలయందు
దనరంగఁ బాశుపతవ్రతోద్యుక్తిఁ
జను [illegible] సజ్జలయందు
శివయోగసూత్రైక వసిష్ఠాదిమునుల
సవిశేషముగఁ దాల్చు సజ్జలయందు
నీసమస్తులు వ్యాసాదిభూతి
శాసనుల్ ధరియించు సజ్జలయందు
నతిఫలాపేక్ష నిన్నర్చించు శౌరి
శతపత్రజాతుల సజ్జలయందు
సుర పాగ్ని యమ దైత్యవరుణాని లోక్ష
సరస నీశానుల సజ్జలయందు,
నీక్షితి మఱియు ముముక్షులు తాల్చు
కక్షల గద్దెనఁ గరుల మీ రర్థి
నుండెడు విధమును నొల్లఁ బ్రాణేశ!
యుండు మెప్పుడు మదీయోత్తమాంగమున:
దేవ! మన్మస్తక దివ్యపీఠమున
నీవు లింగాంగ సన్నిధిఁ బేర్చి పూత
భువ నాథ శ్రీ స్వయంభూలింగరూప
మవధరించుటకు మహాప్రసాదంబు
ని న్నవినాభావ నిత్యసంబంధ
సన్నిధి వేఁడితి స్వామి! విన్నపము
ప్రతి "సర్వతః పాణి పాదం త" మనఁగ
శ్రుతులు లింగాంగముల్ రూపించుఁగాన

ధర "యథా రాజా తథా ప్రజా" యనుట
యరుదగునే పర్వతాకారమయ్యెఁ
దనువెల్ల శిరమ యై నిను ధరియింపఁ
దనువెల్ల గన్నులై నినుఁ గనుఁ గొనఁగఁ
దనువెల్ల వీనులై నిను మును వినఁగఁ
దనువెల్ల జిహ్వలై నిను వినుతింపఁ
దనువెల్లఁ జేతులై నినుఁ బూజసేయఁ
దనువెల్ల మనసయై నినుఁ దలంపంగ
నొడఁ గూర్చి దాసప్రయుక్తి నద్వైత
జలధి ముంపక, నాకు సద్భక్తి యొసగి
రక్షింపు భృత్యుగా శిక్షింపు, దయ ని
రీక్షింపుమయ్య! మదీశ! వెండియును
గైలాస శుక్తిమ ద్గౌరీ తుషార
నీల మైనాక మాణిక్య మహేంద్ర
సైంధవ కల్యాణ సారంగ సహ్య
గంధమాదన కింశుక శ్వేత మాల్య
వ ద్విశాలోదయ వర్ధమాన హిమ
వ ద్విద్యు దస్త ప్రవాళ సువేల
సోమ నైమేష కుసుమ చిత్రకూట
హేమకూట క్రౌంచ సీ మేంద్రకీల
హారిత పూర్వ సంధ్యా ఋశ్యమూక
వైరోచన నిషధ వజ్రాభ్ర తామ్ర
మలయరోహణ వింధ్య మానసోత్తర వ
కుల రౌప్య కేసర గోవర్ధన శత
మేరు కుంజర వృష మేచక శృంగ
పారియాత్రాది శుంభద్గిరీంద్రములు;
గంగ భాగీరథిగంగ పాతాళ
గంగ భీమరథి సౌగంధిక విరజ
కౌశిక గాంధారి గావేరి యసి వి

పాశ వరుణ దుంగభద్ర ప్రయాగ
నంద సరస్వతి నర్మద యమున
మందాకిని గయగోమతి ద్రాప్రమపర్ణి
స్రోత వేత్రావతి సోమప్రభాస
వైతరణి దమస వంజర సరయు
వేగవతి సురస విశుత సంద్ర
భాగ మహాభాగ వాసవి సిత
యమరఁ బంచనది గాయత్రి యుత్సాహ
విమల వేత్రపతియు విమలాభ కనక
శోణ వేదవతియు శుక్లప్రభాస
వేణి పుష్కర గృష్ణవేణి మలాస
హారి గోదావరి యాదిగా నిఖిల
ధారుణిఁ గలుగు తీర్థంబులు నదులు
మూర్తిమంతంబులై మొనసి నామీఁద
వర్తింపుచుండెను వరమిమ్ము; మఱియు
సద్రతి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య
శూద్రాదిసత్కులజులును దుష్కులజు
లెట్టిమానవులైన నీశ! మన్నగము
మెట్టినంత నచేసి మిక్కిలికూర్మి
వారి పురాకృత ఘోరకర్మములు
నారూఢ పాతకా ద్యా నీకకోట్లు
హరియింప వారల కభిమతసిద్ధిఁ
గరుణింపు, కరుణింపు, వరము లొండొల్ల,
ననుచు ముమ్మాటికి హరుచేతఁబడసి
యనఘుఁ డప్పుడు పర్వతాకారమగుడు
భంగిగా శివుఁడు దత్పర్వతోత్తుంగ
శృంగోత్తమాంగ ప్రసిద్ధపీఠమునఁ
బొంగారు శ్రీ స్వయంభూలింగమూర్తి
యంగీకరించె నుదగ్రమహామహిమఁ

ప్రచరింప శ్రీశైల ధర్మహర్మ్యాగ్ర
ఖచితమాణిక్యోరు కలశ విభూతి
నప్పర్వతాగ్ర శృంగైక మధ్యమున
నొప్పెనెంతయుఁ దదీ యోరులింగంబు;
శివదుందుభులు సమంచితలీల మ్రోసె
దివిఁ బుష్ప వర్షంబుఁ బ్రవితతఁ గురిసె
నంతనంతంత నయ్యంతకాంత కుని
చెంత నెంతయు మూర్తిమంతంబు లగుచుఁ
బుణ్యాయతనములుఁ బుణ్యతీర్థములుఁ
బుణ్యసరోవరంబులుఁ బుణ్యగిరులుఁ
బుణ్యమహాస్థానములుఁ బుణ్యనదులుఁ
బుణ్యలోకంబులుఁ బుణ్యమార్గములుఁ
బుణ్యవనంబులుఁ బుణ్యౌషధులును
బుణ్యభూములుఁ బుణ్య పురములు సర్వ
పుణ్యంబులు నగణ్య పుణ్యాంగులైన
పుణ్యుండు గిరశిరంబునవసియుంప;
నిదియ క్రీడాస్థాన మింక మా కనుచు
ముదమునఁ బ్రమథ సమూహంబు వొదలఁ,

## :: గౌతమాదిముని కృత శ్రీగిరిప్రశంస :—

గనుఁగొనఁ బ్రత్యక్ష కైలాస మిదియ
యనుచు శ్రీరుద్రగణాధిపు లలర
నశ్రాంతమును హరాభ్యర్చనక్రియల
కాశ్రయం బిది మన కని సురల్ సెలఁగఁ,
దవిలి బ్రాఁతిగఁ బర్వతా యని క్రొలువ,
భవుఁ గంటిమని హరిప్రభృతులు నిక్క,
నాసురభక్తిమై హరుఁ గొల్వ నిది ని—
వాసమంచును దైత్యవాస ముప్పొంగఁ
గంటిమి త్రిపథగంగా సంగమంబు
ఘంటి మేమని మర్త్యమండలి వొగడ,

ననయంబు జపతపోధ్యాన సత్క్రియల
కనువిచ్చుటని మునులాసక్తిఁ బొంద,
సిద్ధించు నిచట నీప్సితసిద్ధు లనుచు
సిద్ధసాధ్యాదులు సేరి నుతింప,
గరుడ గంధర్వ కిన్నర కింపురుష ని
కర మిగ్గిరియ సుఖకరమని నిగుడ
నలి జలక్రీడా వనక్రీడలకును
గల నిదియని దేవగణికలు సొలియ,
మన కగు దర్శనమాత్రన మోక్ష
మనుచు ముముక్షు లత్యర్థిఁ గామింప,
సద్భూతాచల మిది యగపడె ననుచు
సద్భక్తనికర ముత్సవలీలఁ దేల
నా దధీచి భృగు కణాద గౌతమ శి
లా దోపమన్యు కణ్వాది సన్మునులు
'దేవ! మహాదేవ! దేవాదిదేవ!
దేవ! యుమాదేవ! దివ్యలింగాంగ
యిచ్చితి ప్రమథత్వ మీశ! ప్రమథుల
కిచ్చితి రుద్రత్వ మీశ! రుద్రులకు,
నిచ్చితి బ్రహ్మత్వ మీశ! బ్రహ్మలకు
నిచ్చితి విష్ణుత్వ మిందిరాపతికి,
సుర పాగ్ని యమ దైత్య వరుణ సమీర
నరవాహ నేశాన వరదిగీశులకు,
ధర వెండియును సురాసుర సిద్ధ సాధ్య
గరుడ గంధర్వోరగ ప్రముఖులకు,
నీ విధంబున నిర్వ దెనిమిది గోట్లు
దేవాధికారముల్ దెల్ల మిచ్చితివి,
గాక, యుష్మత్కృపా కలిత సమాన
లోకనామృతవార్ధి నోలలార్చితివి.
ఖఁగిగా శ్రీనగోత్తుంగ శృంగోత్త

మాంగావిభేద సమగ్రపీఠమున
నిత్యసల్లింగ సాన్నిధ్యానురక్తిఁ
బ్రత్యక్షలింగ రూపముఁ దాల్చియుండు
నిట్టివరంబు మీ రిచ్చినచోటు
నెట్టణకలుగునే నిటలాక్ష! మున్ను
భంగిగా వీరభక్తాంగంబు దివ్య
లింగోత్తమాంగంబు లీలఁ ధరించి
భంగురేతర వీరభద్రేశమూర్తి
నంగీకరించుట యది గల దొకఁడు
భంగిగా న వ్వీరభద్రోత్తమాంగ
లింగసంబంధంబు లీలఁ దలిర్ప
నుత్తమాంగము లింగ మున్నది దేహ
ను త్తతి వీరభద్రాధిక్య మెంత
యది పర్వతునదేహ మది పర్వతాగ్ర
మది పీఠ మది లింగ మనుభేద మెద్ది?
పర్వతుతనువ శ్రీపర్వతం, బట్టి
పర్వతు శృంగంబు భద్రపీఠంబు
నురుపీఠమదియ యయోనిలింగంబు
భరితలింగము మోక్షఫలదాత యగుటఁ
బరమమునీంద్రుండు పర్వతపతుఁ డ,
వరతపోధనుఁడు పర్వతవల్లభుండ,
పర్వతోత్తముఁడును బర్వతాధిపుఁ డ,
సర్వేశపీఠంబుఁ బర్వతపతుఁ డ.
కలిత తదీయ లింగము పర్వతుం డ,
తలఁప దర్శనముక్తి దాత పర్వతుఁ డ,
మాహేశ్వరుండును మహాఁబర్వతుఁ డ, స—
మాహిత ప్రమథ నాయకుఁడుఁ బర్వతుఁ డ,
భువనపావనమూర్తి భువిఁ బర్వతుం డ,
శివభక్తి శిఖరంబు శ్రీపర్వతుం డ,

కావున వరము లీక్రమమునఁ దొల్లి
భావించి పడసిన ప్రాజ్ఞులుఁ గలరె

*　　　*　　　*

దన్నచ్చి లోకహితముగఁ బర్వతుఁడు
సన్నుతిఁ బడసె దర్శనముక్తి పథము,
వరతపోనిష్ఠఁ బార్వతి నిన్నుఁ గొలిచి
హరుఁడ! నీ తనువున నర్ధంబు వడసె
వరతపోనిష్ఠఁ బర్వతుఁడు నిన్ గొలిచి
హరుఁడు నీలింగాంగ మంతయుఁ బడసె
నలి నజసుతుఁడు సనత్కుమారుండు
గలఁగి యద్వైత సంగతి నుష్ఠ్రి మయ్యెఁ,
బర్వతుండు శిలాదు పట్టి సద్భక్తి
పూర్వకంబుగ లింగపుంగవ! నీకు
నానరంగ "భక్తకాయో మమకాయ"
యనఁగ సలింగ సింహాసనం బయ్యెఁ,
గాన నీ కృపకల్మి గలిగినఁ బడయ
రానిది గలదె ? పర్వతనాథ! నాథ!
తపము లొల్లక యన్య దైవత సేవఁ
జపలులై కొందఱు జడమతుల్ సెడఁగఁ
దపములఁ గోరక తరుణులదృష్టి
దపియించి కొందఱు ధార్మికుల్ సెడఁగఁ
దపముల నూఁకి యద్వైతసంగతుల
నపరాధులై కొంద ఱజ్ఞులు సెడఁగఁ,
దపములు సేసియుఁ దగ నిన్నుఁ గోర
కపహృతమతిఁ గొంద ఱధములు సెడఁగ,
నేవికల్పంబులు నే విఘ్నములును
నేవిషయంబులు నేదురాశలును
నేయకార్యంబులు నేయహంకృతులు

నే యపాయంబులు నేకోరికలును
దనకడ్డ పడకుండఁ దాత్పర్యభక్తిఁ
బొనరు తపఃపరిపూర్తిఁ గావించి
సవిశేష నిర్దోష సంతోషయుక్తి
భవదియ్య మహనియ్య పాదైకభక్తి
సృజియించి నిష్ఠించి శీలించి నిన్ను
భజియించి మెప్పించి పడసెఁ బర్వతుఁడు,
పున్నెంబు పర్వతుఁ బుత్త్రుగా నిన్నుఁ
గన్న శిలాదుండు గాఁడె ధన్యుండు?
పుడమిఁ దా మాయమ్మ వడసెరా కొడుకుఁ
బడసిన నిట్లుండు బడయంగ వలదె?
కొడుకులఁ బడయ సిగ్గులు గావె యింక
వెడదపంబును వన్ని వేఁడు వారలకుఁ?
జక్రి నేత్రార్చిత చరణ భృగుండు
శుక్రుఁ దనొక్కడుకు నిష్ఠుర నిష్ఠఁ బడసె,
మేఘరూపముఁ దాల్చి మిముఁ గొల్చి నిర్గ
తాఘు శార్ఙ్గి వడసె సాంబుఁడన్ కొడుకు
గడునుగ్ర తప మూఁది మృడుఁడ నీచేతఁ
బడసె నధోక్షజుఁ గొడుకుఁగా నజుఁడు,
నమితతపశ్శక్తి హరి మున్నువడసెఁ
గమలాసనునిఁ బుత్త్రుఁగా మిమ్ముఁ గొలిచి,
యేమని తపము వహించిరి వీర
లేమిగాఁ బడసిరి, యేమిగాఁ గనిరి
యొక్కొక్క కోర్కులఁ జిక్కిరిగాక
ముక్కంటి నీకెకాఁ జిక్క రేయిట్లు
భూమి ఖాతము మాన్పఁ బుట్టినయట్లు
భూమిఁ బర్వతుఁడనఁ బుట్టెనోకాక
కాదేనిఁ బంచవక్త్రింబులం దెట్లు
మేదుర కాంతిమై మీఱెఁ బర్వతుఁడు?

మహిని దర్శనముక్తి మహిమ దానెట్లు
సహజమై పరగె శ్రీ శైలాధిపతికి ?
హర! శిలాదుండు మిమ్ము నర్థి భజించి
పరహిత నిహితు శ్రీ పర్వతుఁ బడసెఁ
గావున మూఁడు జగంబులఁ బరమ
పావనంబుగఁ జేయఁ బాల్పడి తాన
యరుదగు తీర్థంబు లందెల్ల పుణ్య
తరమగు పుణ్యతీర్థం బిది యనఁగ,
నతుల పుణ్యక్షేత్రతతులలో నిదియ
కృతులఁ బేర్కొన్న ముక్తిక్షేత్రమనఁగ
విదిత మూలస్థాన వితతులం దెల్ల
మొదలిమూలస్థాన మిదియ తాననఁగ
ముఖ్యపర్వతచయంబులలోన నిదియ
ప్రఖ్యాత మగు రాజపర్వతం బనఁగ
హరు పూర్వసింహాసనాదులం దిదియ
యరుదగు దివ్యసింహాసనం బనఁగఁ
బరగు పర్వతతపోభావాతిశయత
విరచింప శక్యమే వేదపమూర్తి
ధర స్వర్గమర్త్యపాతాళంబులందు
నరయంగ గతభవిష్యద్వర్తమాన
కాలంబులందుఁ గలవ శ్రీనగముఁ
బోలంగఁ బర్వతంబులుఁ దీర్థములును ?
గేదారమున సత్క్షేత్రం [illegible]
మోదకం బానక యొనరదు ముక్తి
సెప్పెడు వారణాసిని సదాపేక్షఁ
గ్రచ్చుటఁ [illegible] ముక్తి
ద్రావంగ [illegible] మోదకము
[illegible],
[illegible] నెప్పుడు కెక్కైన శ్రీ [illegible]

శిఖరదర్శనమాత్ర సిద్ధించు ముక్తి,
వారణాసిని లక్ష వరవిప్రతతికి
నార నన్నముపెట్టి నట్టిఫలంబు
గయలోన రెండులక్షలు భూసురులకుఁ
బ్రియమార నన్నము పెట్టిన ఫలము,
ననిచిన ద్విజుల కన్నంబు గేదార
మున మూఁడులక్షలకును బెట్టుఫలము,
నున్న తీర్థంబుల నొక్కొక్క కోటి
కన్నంబు విప్రుల కందించు ఫలము,
న్నాకాంక్ష శ్రీగిరియం దొక్క జమ్మి
యాకు పట్టెడునంత యన్న మొక్కనికి
దానంబుసేయు నుచ్చైత్ఫలంబునకు
మానుగా నవి యసమానంబు లనఁగఁ
బర్వతుమహిమ యేభంగిఁ గీర్తింప?
సర్వజ్ఞ సద్యఃప్రసన్నైకమూర్తి
దవిలి "చకిత మభిధత్తే" యనంగ
భువి "నేన మేత న్నిబోధత" యనంగ
సంగతి "సత్యతిష్ఠద్దశాంగుల" మ
నంగఁ దా "స్మర్యతే న చ దృశ్యతే" య
నంగ విరించి జనార్దనాదుల కె
ఱుంగ రాఁగగు దివ్యలింగ! నీ తనువు
గరతలామలకసంగతిఁ గానుపించెఁ
గర మొప్ప పర్వతు కారణంబునను,
నప్రతిమోద్యద్దయాధామ! నీదు
ప్రప్రసన్నత పెంపు భవ్యంబటంచుఁ

## శ్రీగిరి దివ్యస్థాన కథనము

పమ మునిబృంద మెంతయుఁ గెడగూడి
క్రమమున ఁప్రసూక్తము లాది యైన

వికచితాశీర్వాద వేదనాదముల
నరుదుగాఁ గీర్తింప హరుదక్షిణమునఁ
గుండతీర్థమనంగఁ గుంభినినొప్పు
దండిపాతకకోట్లఁ దా హరింపుచును,
నందు మందాకిని యాదిగాఁ గలుగు
నందితంబై మూఁడు నదు లాశ్రయించి
యదియ తల్లింగమూలావరణాంక
మొదవంగ నుదయించె నుత్తరంబునను,
మల్లికాకుండనామమున లోకములు
వల్లభత్వమునఁ బావనము సేయుచును
నందు భాగీరథి యాదిగానుండు
వందితంబై మూఁడు నదు లాశ్రయించి
యవిరళనిత్యమహాదేవ శర్వ
భవ భీమ రుద్రోగ్ర పశుప తీశాన
కమనీయ తల్లింగ కలితనామాష్ట
కమున దివ్యాష్టలింగస్వరూపముల
నీక్షించు జనులకు మోక్షమిచ్చుచును
మోక్షేశ్వరం బన ముందట వెలసె,
నలరి సూక్ష్మస్థూల యాతనాదేహ
ములునాఁగఁ బురములు మూఁడు హరించు
ననుప మాద్య త్రిపురాంతకదేవుఁ
డనఁగఁ దచ్ఛిఖరేక్షణార్థమై యొప్పఁ
బాటిల్లె పాతకోత్పాటనమహిమ
హాటకేశ్వరమన నలరె యామ్యమునఁ
పాపవినాశనప్రతిష్ఠ నొప్పారి
పాపవినాశనుం డేపారి యవ్వల
దనరఁ జరాహేశ్వరముఁ గిన్నరేశ్వ
రమును సోమలింగేశ్వరముత్రను ఘంట
సిద్ధేశ్వరంబునాఁ జెలువారి జనుల

శుద్ధులఁ గావించుచును బశ్చిమమున
నద్భుతలీల నాయాస్థానముల స
ముద్భవం బయ్యె లింగోపకంఠమున,
నాలసి తదియ్య సద్యోజాతవదన
మలరె బ్రహ్మేశ్వరం బనఁ బశ్చిమమున,
వామదేవాంచిత వక్త్రంబు దనరెఁ
దా మహేశ్వరమనఁ దగ నుత్తరమున,
గుఱి దక్షిణమున నఘోరవక్త్రంబు
వఱలె జ్యోతిస్సిద్ధవటనాథుఁ డనఁగ,
రమణఁ దత్పురుషవక్త్రము మహామహిమ
నమరెఁ దూర్పునఁ ద్రిపురాంతకం బనఁగఁ,
దనరె నీశానవక్త్రంబు నూర్ధ్వంబు
నన మల్లికార్జున నామంబుఁ దాల్చి;

—: మల్లికార్జున నామోత్పత్తి :—

యా మల్లికార్జునోదాత్త విఖ్యాత
నామ మెట్లయ్యెఁ బినాకి కంచేనిఁ
గృపఁ జెప్పెఁ యుగముల క్రింద శ్రీపర్వ
తపురాణమహిమ రుద్రాణికి రుద్రుఁ
డానతియిచ్చుచో నటయున్న యయ్యెఁ
బా ననేక యుగార్బుదంబులనాఁడు
నల మల్లికార్జుననామ మన్వాక్య
మలరుటఁ గాఁ జేసి యయ్యుగంబునను
జంద్రగుప్తుం డనఁ జను భక్తుఁ డొకఁడు
చంద్రవంశ్యుండు వజ్రనపతితనయ
చంద్రవతీకన్య సహసచ్చైతన్య
చంద్రవతరాగిన్య సంచితపుణ్య
యనురక్తి శ్రీమల్లికార్జునుఁ జూడఁ
జనుదెంచి తనతోడ నతడు [illegible]
[illegible] వక్త్రంగొల్చుచును
[illegible] హర్షము [illegible]

గిన్నర గంధర్వ గీతప్రకలిత
సన్నుతనాదప్రసన్నత మీఱ
యతిమృదుమధుర సమంచితాలాప
గతుల సప్తస్వరకలితమై శ్రుతులు
సొంగమై మ్రోయఁ దొడంగినరీతి
శృంగముల్ గూడియాడంగ దిక్కులుగ
లంగ నాకస మృదువంగ నందున్న
గంగ మనం బలరంగఁ బాతాళ
గంగ యంతంత కుత్తుంగతరంగ
రంగముల్ నలిఁ గడువంగ, మీఁదటికిఁ
బొంగ, సురల్ నుతింపంగ, శిలలుఁ గ
రంగఁ గాష్ఠము లిగ్రుపంగ, మృగములు
గ్రాల, రసంబులు గ్రోలఁ జిత్తములు
సోల, గాయకతతుల్ వ్రాలఁ గిన్నరులు
దూల, నుమానాథుమ్రోల నానంద
లీల దలిర్ప సభ్యాల సంప్రీతిఁ
బాడఁ సుగతు లోలిఁగూడ, నాచంద్ర
చూడ పార్వతియును బ్రోడనునంబుఁ
గూడ నాదాంబుధిఁ గ్రీడఁ దేలుచును
జూడ, మెచ్చులు దులుకాడ, సోముండు
"మెచ్చితి సబాసు మృగశాబనయన !
యిచ్చ నెయ్యదివేఁడు మిచ్చెద" ననుడు
"శ్రీపర్వతోత్తుంగ శృంగోత్తమాంగ
దీపితఖ్యాపిత దివ్యలింగాంగ !
మీమౌళియందు సమేళనంబుగను
ప్రేమం బెలర్ప నర్పించినయట్టి
యీమల్లికాదామ మెల్లగాలంబు
మీ మౌళియందు సమ్మిళితమై యుండ
దయసేయుఁ డనుచుఁ" జంద్రవతి వేఁడుటయు

రయమునఁ దేజోవిరాజితం బైన
మల్లికాదామ ముమానాథుఁ డునిచె
నల్లీల జాహ్నవీ చంద్రమధ్యమున
గంగాతరఁగిణీ సంగతోత్తుంగ
రంగత్తరంగ పరంపరోద్ధూత
పృథులకూలంకష ఫేనవిభాతిఁ
గథనియ్యమగు మల్లికాదామ మరియు
నర్జునకాంతిఁ జెల్వగుట శ్రీమల్లి
కార్జును డనునామ మయ్యె లోకములఁ,
దక్కినలింగప్రతతులకు నట్ల
యొక్కొక్క నామంబు లొనరె నొక్కొక్క
కారణంబునను నాఖ్యాతి దల్లింగ
చారు పూజాఫల సౌఖ్య మెట్లనిన,
నగణితంబైన లింగాకారమైన
నగసంస్మరణ దర్శన స్పర్శనముల
వలనను స్వర్గాపవర్గాదిసౌఖ్య
మలరారుచున్న దే మని ప్రస్తుతింప?
విను "పునర్జన్మ నవిద్యతే" యనుచు
ఘనపురాణాదు లొక్కటి యాయుఁగాన॥
యనుచు వెండియు మల్లికార్జునగురుఁడు
మనికుఁడై పర్వతు మహిమ నుతింప,
"వరగురునాథ! నీ వచనంబులేని
విరచింపఁ బర్వతు వినుతియేనియును
నున్న దే వీనుల కొక్కింతదనివి?
విన్నపం, బేఁ బనివినియెద, నాకు
క్షిప్రంబ యీపని గృపసేయుటకును
సుప్రసన్నాత్మ! మహాప్రసాదంబు,
వారక పర్వతు వర్ణన యనఁగ
మీ రానతిచ్చిన చారుసత్కృతిని

లెక్కింప శిలలెల్ల లింగరూపంబు
లక్కజంబుగ వాక్య మది దథ్యముగమ,
బాఠీనకేతనాపహమూర్తి లింగ
పీఠప్రకారమై పృథివి శ్రీనగము
మీదివ్యదృష్టికి మించి వెలుంగు,
భేద మెఱుఁగ మీ పాదముల్ గాని,
మీయాజ్ఞఁ దలమోచి పోయెద నిష్ట
దాయక ! మీప్రసాదము దయసేసి
రక్షింపుఁ" డని యసమశక్తి దోరంటస్వ
యాక్షితి సాష్టాంగ మెఱఁగి శ్రీగిరికి

## దోనమార్య మహేశ్వరాచలప్రాప్తి కథనము,

పండితారాధ్యేంద్ర మండితపాద
పుండరీకాంతరంగుండు దోనయ్య
శ్రీమహేశ్వరదేవు శివు నుతింపుచును
గామించి తద్భక్తగణసంఘమునకుఁ
బ్రవితత భక్తిమైఁ బర్వంబు సలిపి
యవిరళప్రీతి గుర్వర్పణసేసి
ధరగూడ సప్తపాతాళముల్ గాఁడి
యురుతరంబై మీఁద నుడువీథిఁ గడచి
పరగు శృంగంబులుఁ బనసామ్రముఖ్య
తరు గుల్మ దివ్యలతావితానములు
నందుల బహుమర్కటావలి సెరలు
నందుఁ గాకులు దక్క నలపుపక్షులును
రుద్రధారయ పెక్కు రూపంబులైన
ముద్రక్తిఁ దొరఁగు సమానధారలును
శ్రీకుబేరేశ్వర సిద్ధేశ్వరాద్య
నేకలింగములు మాహేశ్వర బిలముఁ
గనుగొంచు నద్భుతాక్రాంతాత్ముఁడగుచు

ఘనమగు తన్నగాగ్రము శివపురము
మహిమయుఁ దద్ద్వారమహిమయుఁ దీర
మహిమయు వినుచు ధీమణి దోనమయ్య
మనమున హర్షించి మల్లికార్జునము
నన నభిముఖుఁడుగా సాఁతును నలరి
సూరెల జయవెట్టుచును సంతసిలుచు
భోరన నగమధ్యమున దిగఁ జాఁగి
రతిఁ గల్పవృక్షంబుఁ బ్రాకెడు కల్ప
లతయును బోలె నల్లన కుర్వఁ జేకి
యక్కజం బంద స్వర్గాపవర్గములు
నెక్కొని నిల్చిన నిశ్రేణులట్లు
నెక్కొన్న యారెండు నిచ్చెనల్ గడచి
గ్రక్కన తన్నగాగ్రం బెక్కి చనఁగఁ
జనఁగఁ దూర్పునను బంచక్రోశమాత్ర
మున రమ్యమగుచును మును పశ్చిమమునఁ
గడు నొప్పెసగు బిల కల్పోక్తి నెన్నఁ
బడు శ్రీచతుర్ముఖ బసవేశ్వరుండు

## చతుర్ముఖ బసవేశ్వరదర్శన కథనము

నాదేవదేవు మహత్త్వ మెట్లనిన,
నాదిసర్గల కాది యగు వృషసర్గ
నభవుండు శివుఁడు లీలార్థమై సృష్టి
కభిముఖుండై శ్రీవృషాధీశుఁ జూచి,
"చనుము గోమాతృపంచకములో భద్ర
యును నందయు సుశీలయును సుమనసయుఁ
గొనుచుఁ బొ, మ్మమరులకు సురభి నను పు,
మొసర ధరిత్రి, బశూత్పత్తిఁ బతయు,
శ్రీకుధరోత్తర శృంగంబునను స
ధేశాంతమున వసియింపు" నావుడును

జనుదెంచి యిల సహస్రధనుః ప్రమాణ
మునను గ్రిందట నొక్క పురముఁ గల్పించి
భువినా వృషభపురమునను జతుర్ము
ఖవృషభేశ్వరు నిల్పి కాంక్షఁ గొల్చుచును
నాల్గు ముఖంబులై నాల్గు దిక్కులను
నాల్గుగోమాతల నలవరింపుచును
దొడరి గోమాతృచతుర్ముఖంబందు
వడసెఁదాఁ బశురాశిఁ బడసి వాసికిని
బ్రథితంబుగా బిల్వపర్వతం బందు
పృథివికి వెడలంగ బిలముఁ గావింప
నవియును వెడలెఁ గన్యాసిద్ధనాథు
భవనాంతరమునఁ దత్పశువులు వెడలఁ
గా నంత మునికన్యకలువచ్చి హేమ
ధేనువులను గొన్ని ధృతిఁ గొనిపోవఁ
జిక్కిన పశురాశి సృష్టిపై నిలిచె,
నక్కజంబుగ నంత నఖిలలోకముల
వృషభేశుఁ డాసృష్టి విరచింప నదియు
వృషసర్గ నా వేదవిదితయై తనరె
మూలమై యాచతుర్ముఖ వృషభేశు
నాలుగు ముఖములు నందితం బయ్యె.
గనుగొన ధర్మార్థ కామమోక్షముల
కును గారణంబులై కూడు శ్రుత్యుక్తి,
నదిగారణము మును లందఱు నదియు
మొదలుగా శ్రీచతుర్ముఖ వృషభేశుఁ
బరమేశు వృషభేశుఁ బాతాళవృషభ
పురవరాధీశు శ్రీ భూధరావాసు,
నర్చింతు రట్లు కన్యాసిద్ధనాథు
నర్చింతు రందును నందు ముప్ప్రొద్దు
గడు నర్థి మునికన్యకలు ద్రికాలంబు

నెడపక యావృషభేశు లింగంబు
నతమునియూథుఁ గన్యాసిద్ధనాథు
వ్రతరూప మెసగ నివాళింతు రర్థి,
నదియాదిగాఁగఁ గన్యాబిలం బయ్యె
నది గారణముగఁ గన్యాసిద్ధనాథుఁ
డనఁ బొల్చె నణిమాదు లష్ట సిద్ధులకు
నునికిపట్టై యంత జనులు గీర్తింప
నక్షీణతరకీర్తి యాలింగమూర్తి
దక్షిణంబున సముద్యన్మహామహిమ,
సేకొని దిక్తటశ్లోకిని, పుణ్య
పాకినే, హితచక్రవాకిని, సితప
తాకిని, నిర్ధూత ధాకిని' యమృత
సేకిని, దివ్యమందాకిని యొప్పెఁ,
గావున మును బిలకల్ప్రోక్తమైన
యావృషభేశ్వరం బలరారె మున్ను
వెలయఁ జతుర్ముఖ వృషభేశుపేర
నిలఁ జతుర్ముఖ బసవేశ్వరుం డొప్పెఁ
బసరింప నా వృషభపురంబు పేర
వసుధమైఁ బరగె నా బసవపురంబు
నీచతుర్ముఖబసవేశు భజింప
నాచతుర్ముఖ వృషభాంకలింగంబు
భజియింప నభిమత ఫలములుపొందు,
నిజ భుక్తిముక్తులు నెక్కొనఁ జెందు,
నట్టి శ్రీ బసవేశ్వరాలయం బంత,
గట్టెదురను గాంచి ఘనుఁడు దోనయ్య
దడయక యిష్టార్థ దాతగా నెన్నఁ
బడిన చతుర్ముఖ బసవలింగంబు
నత్యర్థిసముచితాభ్యర్చితుఁజేసి

నిత్యలింగార్చన నియమముల్ దీర్చి
పండితార్పణముగా భక్తమండలికిఁ
బండువు సేయ

*　　　*　　　*

రసికత దోనమరాజయ్యఁగారు
బసవేశు మహిమను బ్రస్తుతింపుచును
శోభిల్లు మల్లికార్జునదేవు పురవ
రాభిముఖుండయి యరుగ నంతంత

*　　　*　　　*

వేడ్కఁ నరుగ ముందఱను...
శృంగారతర సదాశివపంచ మోత్త
మాంగ కోటీరజటాటవీ మధ్య
మంగళ శ్రీవియద్గంగా మహోత్త
రంగిణీ రంగ తరంగోపకంఠ
సంగతినొప్పు భాస్వచ్చంద్ర రేఖ
భంగి హృదయ భంగ పర్వత, కనక
పర్వత, నక్షత్ర పర్వత, గద్య
పర్వత, ముఖ్యోరుపర్వతావళుల
నడుమ గంగామహానది సూడ నొప్పెఁ
దడయక భక్తిఁ జంద్రవతి మున్ బూన్చు
మల్లికార్జునశిరోమండనం బైన
మల్లికాదామంబు మాడ్కిఁ, వెండియును,
భరితమై కానంగఁ బడసి మ్రొక్కుచును
బరుస హృదయభంగపర్వతం బెక్కి
గిరితుట్టతుదనుండి క్రిందు సూడంగ
నురగలోకము గాఁడియునికికి బెగడి
పందల హృదయముల్ భంగంబునొంద
నంధ్రుండి కోయని యార్చి యుప్పొంగి

మునుకొని మాటలు ముడియలు వీఁవు
లనుగట్టుకొనుచుఁ దలలు ముడ్చికొనుచుఁ
గుట్టుఁ గచ్చలుజుట్టుఁ గట్టి పైవలువఁ
జుట్టుకొనుచు జయి వెట్టుఁడో !' యంచు
మెల్లన మెల్లన మెట్టుచుఁ జనుచు
నొల్లనొల్లన మంది కోసరించుచును
నొడ్డుజాలెక్కుచు నొదికిలఁ గాళ్ల
నడ్డగించుచుఁ ద్రోవలరసి త్రొక్కుచును
డిగ్గుచు వృద్ధుల డిగఁబడనీక
దగ్గఱి పట్టుచు దాకొని చనుచు
గడగడ వడఁకుచుఁ గాళ్లు సెమర్పఁ
దొడ లూఁదికొనుచును ద్రోవుఁద్రొక్కిఁ కాళ్ల
వాఱుచు క్రింగొడశ్లూరుచు నెడలఁ
బాఱుచు నుఱ్ఱట జాఱుచుఁ జనుచుఁ
జిక్కుచు నట గొంత సేద దీర్చుచును
జక్కన హృద్భంగశైలంబు దరియ
నప్పర్వతాదిమధ్యాంతము ల్గాడ
నొప్పెఁ బరుస ప్రవాహోత్ప్రేక్షఁ దనరి
కడుఁ బ్రియంబగ నగాగ్రంబు నందుండి
కడునొప్పు గౌతమీగంగా ప్రవాహ
మేపార నీధ్రాతి కేతెంచుపగిది
నాపరిషత్కోటి యంత నేతెంచి
సంగతి హృద్భంగశైలసమీప
గంగాప్రవాహోపకంఠ దేశమునఁ
బోఁకమ్రాకుఁల సందిఁ బొన్నలగొంది
మ్రోఁక మ్రాఁకు లఱుత మొల్లల కుఱుతఁ
బనసల పొంతఁ జంపకముల క్రంత
ఘనసారముల యిర్వ నసఁటుల కుర్వఁ
గమ్మరేసుల త్రోవఁ గడమల క్రేవ

నిమ్మ పొదలగూడ నేరేండ్ల నీడఁ
గొండగోఁగుల పొక గురుజుల యాఁక
బొండుమల్లెల యోర బురుగుల చేఱఁ
గరవీరములమెట్టఁ గురువుల మిట్ట
సురగుల బ్రిద్ద నశోకంబు లొద్దఁ
జెంగలువల కుంటఁ జింతల వెంట
గంగరేఁగుల మూలఁ గ్రాఁగుల బ్రోల
మందారముల బ్రంద మారేళ్ల క్రిందఁ
జందనంబుల చెల్వఁ జాదుల కాల్వ
సరళుల లోయ భూర్జంబుల డాయఁ
గురువకంబుల చెంత గ్రోవుల క్రంత
హింతాలముల బాయ సీడెల చాయ
సంతానముల యంట జమ్ముల చెంట
వటముల మలల లవంగంబు శిలలఁ
గుటజంబు లెడల గుగ్గులముల మడల
గూఁడచప్పరములు గుడిసెలు గూళ్లు
గూఁడారములు దెరల్ గొల్లెనల్ వన్ని
వేలముల్ దప్పక విడిసి యుత్సుకతఁ
గ్రాలుచు ఘనత గంగాసంగమమునఁ
జని కృతస్నానులై జన్మసహస్ర
ఘనఘోర కర్మపంకము పొంక మెడల
నంత నిష్టాన్నపానాది వస్తువుల
సంతుష్టులై పరిషత్కోటి యలరఁ
బ్రఖ్యాతి దోనమ రాజయ్యఁగారు
ముఖ్యంబుగా గణములు ప్రహర్షమున
నంతకుమున్న సంధ్యావేళయందు
నంత మహానిశియందు సాంగముగ
నత్యంతభక్తి సమగ్రత మెఱసి
నిత్యలింగార్చన నియమములీ దీర్చి

యిష్టలింగ ప్రసాదేచ్ఛోపభోగ
పుష్టసుఖావాప్తిఁ బొంద సంతంత
బసవన్నగీతముల్ పసరించువారు
బసవపురాణ మొప్పంగఁ జదువువారు
భరతోక్తి నేలలు వాడెడువారు
నరుదందఁ జిందుల కాడెడువారు
నాళతుల్ సేయుచు నలరెడువారు
శైలముల్ ఘూర్ణిల్ల జయవెట్టువారు
నెట్టణ శ్రమ మేద నిద్రించువారు
బిట్టు మేల్కాని చూడఁ బ్రియపడువారు
గిరిసమూహం బొప్పఁ గీర్తించువారుఁ
దెరువుల చక్కట్టు దెలిపెడువారుఁ
దమతమ రాకలు దలపోయువారు
నమిత ఘోరాటవు లంకించువారు
నారఁ బర్వతపురాణంబులు సదువు
వారును వినియెడువారును జెలఁగి
యిట్టితీర్థములు మే మెన్నఁడు నెఱుఁగ
మిట్టిచోద్యము లంచు నెన్నెడు వారుఁ
జెప్పెడి దేమి యీ శ్రీపర్వతుండు
దప్పక నానావతారముల్ దాల్చి
చెలమలై పరుసకు జలములు సూపు
నిలలింగమూర్తులై చలుపు నేమములు
పండినతరువులై ఫలములు గురియు
నిండు మేఘంబులై నీడలుసూపు
వల్లరులై పుష్పవాసన లొసగుఁ
జల్లనిగాడ్పులై శ్రమములు వాపు
నలి దారికాంద్రులై నడిపించుఁ బథము
వెలయంగ వనములై విడుదల నిచ్చుఁ
బండితులై చెప్పుఁ బరమేశుమహిమ

గండుఁ దలారులై కాఁచు మార్గములు
మహిఁబాఱు మృగములై మఱపించు దప్పి
విహగరూపంబులై వేడ్క-లుగొలుపు
నతిథి రూపంబులై యర్చన లొందు
ధృతిఁ దపోమూర్తులై దీవన లిచ్చు
క్షితి వ్రతులై ప్రణమితులఁ గావించు
నతుల జంగమరూపులై భక్తిఁ జూపు
నెంతయు నాప్తులై హితములు సలుపు
నంతంతఁ బల్లెలై యాసలు సూపు
భూరితీర్థంబులై పుణ్యులఁ జేయు
నారఁగఁ బెన్నదులై ముక్తు లొసగుఁ
గాక యీపరుసపై ఘనదయాబుద్ధిఁ
గాకున్న నెట్టి దుర్ఘటమార్గ దుర్గ
భూరిపర్వతమహోద్భుత గుహాగహ్వ
రారణ్య దుష్టమృగాసురచోర
నాగ సంశ్రిత నిర్జన ప్రదేశములు
నీ గిరీశ్వరుఁ గాన నెట్లు రావచ్చు
ననుచుఁ బర్వతుని మహత్త్వంబు గూడ
వినుతింప నట ప్రొద్దు వేవుడు నంత,

సత్క్షేత్రపర్వతారోహణము

దూరీకృతాఘంబు దోసముబాఱఁ
గారును సద్భక్తగణసమూహంబు
మది నుబ్బి యవసరమహిమ సాంగముగ
నుదయమజ్జనము లుద్యుక్తిఁ గావించి
యటుదెంచి నియతి సమంచితలీలఁ
బరుసయుఁ దారు నపరిమిత పుణ్యా
తర నిజ తీర్థయాత్రావిఘ్న హేతు
విరసవిస్తర ఘోర విషయ వారాశిఁ
గడచిన మాడ్కి- గంగాప్రవాహంబుఁ

గడచి తదియ్య విఖ్యాత ప్రవాహ
పరచిత ప్రత్యంత పర్వతావళుల
సురచిరాభ్రంకషచూడాదితతుల
వఱలు నక్షత్ర పర్వత మంత నెక్క
తఱిఁ బరిషత్కోటి దాఁ దీగసాగి
కమనీయ్య సురదీర్ఘికానిత్యసంగ
మమున నానది యేఁగుమాడ్కి నొప్పారె,
ఘోరన యేఁగుచుఁ బొంగుచు బింక
మారయఁ గొంతద వ్వలరి పాఱుచును
సంతసిల్లుచు నుఘే జయజయ యనుచు
నంతంత నిక్కుచు నలరి యార్చుచును
దప్పక యప్పురాతనతీర్థ చరులు
నొప్పారునుజ్జ్వల సోపానములుగఁ
ద్రొక్కుచు నెక్కుచుఁ దొట్రిల్లుకొనుచుఁ
జిక్కుచు మ్రోఁకాళ్ళఁ జేతు లూఁదుచును
వంగుచు వ్రాలుచుఁ దొంగుచుఁ జనుచు
జెంగుచు నొండొరుఁ జెయ్యూఁది కొనుచుఁ
జేఁదుకో ! చేఁదుకో ! శ్రీగిరినాథ !
చేదుఁకో ! మల్లయ్య ! చేఁదుకొ"మ్మనుచుఁ,
"జేఁదుకో ! చేఁదుకో ! చేసేత నాదయ !
చేఁదుకో ! మల్లయ్య ! చేఁదుకో'' మ్మనుచు;
గనుకని పాటలు గట్టి పాడుచును
జనిచని బిందుల జతుల కాడుచును
పరమోత్సవామృతపరిపూర్ణ పుణ్య
తరపరిషద్బృంద తతులు సంధిల్ల
శూలి శ్రీమల్లికార్జునుఁడు దయాను
కూలరజ్జులఁ జేఁదుకొనవేడు క్రియను
గట్టుపవడి నగాగ్రం బెక్కఁ బనుప;
యిట్టిప కాకెట్టు హాయకృప లేక

చెచ్చెర యోజనోత్సేధ మెల్లెక్క-
వచ్చు సకత్రతపర్వతము నావంత ?
యంతంతఁ దత్పథశ్రాంతులై వరుస
గొంత విశ్రమమంది గొబ్బున చెలఁగి
కట్టలు గట్టి నక్షత్ర పర్వతము
బిటు గలఁగ నొక్క- పెట్టునఁ గూడి
పర్వతాగ్రంబెల్ల పథము నా నెరవి
"పర్వతయ్యా మమ్ముఁ బాలింపు'' మనుచు
మ్రొక్కుచు, నీడలఁ జిక్కుచుఁ, బండ్లు
మెక్కుచు, లీలల నుక్కుచు, దిన్నె
లెక్కుచు, జాలకు స్రుక్కుచు, సెలలఁ
జిక్కుచుఁ, దెరువుల మక్కుచుఁ, జలువ
ద్రొక్కుచుఁ, దాపంబు దక్కుచుఁ, నాత్మఁ
జొక్కుచుఁ జనిచని నిక్కుచు గిరులు
సూచుచు, సుకృతముల్ నోచుచు, భవముఁ
బాచుచు, జమ్ముతలఁ దాచుచు, లీల
నేచుచు, మార్గముల్ గాచుచుఁ, బరుసఁ
ద్రోచుచుఁ, బడిఁబడి లేచుచు, వ్రతులఁ
బ్రోచుచుఁ, జేతుల వీచుచుఁ, భట్ల
రాచుచుఁ, గూఁకలు వైచుచుఁ, దరులఁ
దూఁగుచు, నుయ్యల లూఁగుచు, శ్రమము
లీఁగుచుఁ బూఁదేనెఁ దోఁగుచుఁ, జలికి
ద్రేఁగుచు, నెండలఁ గ్రాగుచుఁ, బ్రియల
నాఁగుచు, మదిఁ జెలరేఁగుచుఁ బ్రీతి
వీఁగుచు, మలఁగుల డాఁగుచు, గముల
మూఁగుచు, మెల్లన నేఁగుచు, బోదలు
దూఱుచు, గ్రంతలఁ బాఱుచు, దరులఁ
జూఱుచుఁ, జనలేక చీఱుచు హితుల
దూరుచు, నటుగూడఁ జేరుచు, వారిఁ

గూరుచు, సందడిఁ గోరుచు, మంది
మీఱుచు, నతిథుల నేఱుచు, బ్రముక్తిఁ
దాఱుచు, గోర్కెఁ జేకూఱుచు, నెతల
నిలుచుచు, ఫలముల విలుచుచు, దప్పిఁ
దలఁచుచుఁ, దుష్టిమైఁ బొలుచుచు, గుడుల
గొలుచుచు, నిష్ఠమైఁ గలఁచుచు, భవము
గెలుచుచు, నటుగూడఁ బిలుచుచు, మూఁకఁ
గలఁచుచు, నదులకు వలచుచు, ఖలుల
మలఁచుచు, బసవన్నఁ దలఁచుచు. బ్రీతిఁ
గ్రాలుచు, శరణని వ్రాలుచు, నాత్మ
సోలుచు, వెడదప్పిఁ గాలుచు, నట్లు.
దూలుచు, నాదంబుఁ గ్రోలుచు, సుగతి
వ్రాలుచు, సుఖలీలఁ దేలుచు, భక్తిఁ
జూలుచు, భవముఁ బ్రోలుచు. బుషులఁ
బోలుచు మదిఁ గోర్కెఁ దేలుచు, శివుని
గూర్చుచు, నేమముల్ దీర్చుచు, నుతులఁ
జేర్చుచు, నలిరేఁగి యార్చుచు, మునుపు
ననుచు, వీడియములు గొనుచు, మీశరణ
మనుచు, జంగమముఁ గన్గొనుచు, దాశములు
గూడుచు, సిరిగిరిఁ బాడుచు, జతుల
కాడుచు, నొసఁగులు వీడుచు, నలవిపి,
కో యంచుఁ, జాంగు భళా యంచు, మల్లి
యా! యంచు ఘే యఘే యనుచుఁ గూడంగ
'జయవెట్టు జయ వెట్టు జయపెట్టుఁ' డనుచు
"జయ జయ జయ జయ జయ జయో" యనుచు
నరగలి గొన కిట్టు లఖిలదేశముల
పరుసయు నానందభరితమై నడుప

నరువొంపంగా నందు నాంధ్రదేశంబు
పరుస బంతులు గట్టి పాడుబెట్లనిన

**ఆంధ్రదేశముపరుస**

నల్లవో! నల్లవో! నగరాజరాజ!
మల్లయా! మల్లయా! మహనీయతేజ!
పరమపాతకకోట్లు భస్మమై తూలు
సిరిగిరిమల్లన్న శరణన్నఁ జాలు;
రాఁబోవ నెంత దూరం బైన నడువ
నేఁ బోదు మల్లయ్య నేఁ జేటఁ గొలువఁ;
పాతాళగంగాప్రవాహ మెంతైనఁ
జూతునే మల్లికార్జున దేవునైనఁ;
శ్రీశైలపర్వతం బెక్కు టెంతైనఁ
జిక్కైక పోదునే శిఖరేశుఁ గాన;
నాయకోత్తముఁ జిక్కనాయకు డంత
నాయకు బసవన్నఁ బాయక కొలుతు;
శృంగి బొప్పయ సత్తమాంగన కేశి
సంగన బసవన్న శరణని కొలుతు;
పండితారాధ్యు శ్రీపతిపండితయ్య
బండారు బసవయ్యఁ బాయక కొలుతు:
శంకరదాసయ్య తెంకమంచెయ్య
బంకయ్య శివరాత్రి సంకయ్య శరణు;
యేలేశకేతయ్య యిండె శాంతయ్య
మోళిగ మారయ్య మున్నయ్య శరణు;
బొప్పూరి బ్రహ్మయ్య బాచిరాజయ్య
కోవూరి బ్రహ్మయ్య నొగ్గయ్య శరణు;
కిన్నెర బ్రహ్మయ్య కేశిరాజయ్య
పన్నగ బ్రహ్మయ్య గణవాసి శరణు;
బాచయ్య, నవరద బాచయ్య, బిబ్బ

బాచయ్య మడివాలు మాచయ్య శరణు;
సిరిగిరి శరణు; శ్రీగిరినాథ శరణు;
సిరిగిరి మల్లయ్య శరణు అశరణు;
అనుచు నీక్రియ సుబ్బి యాడుచుఁ బాడు
చును బేర్చిపేర్చి యుత్సుకతమై నడనఁ
జెన్నార, మఱి యిట్లు గన్నడపరుస

## కన్నడపరుస నడక

ప్రన్నని కర్ణాటభాష సొంపుగ
"సజగమ దేవయ్య! బిజమాడి రయ్య;
నిజభావదేవయ్య! నీవిత్త బన్ని,
యల్లమ దేవయ్య! యెత్తలో హోది?
బల్లద దేవయ్య! బన్నిరి నీవు;
శివముద్దు దేవయ్య! చిలిక దేవయ్య!
శివరాత్రి బసవయ్య! చిత్తయిసయ్య;
విరుపాక్షదేవయ్య! కరుణిసు బేగ;
పురవణి సంగయ్య! హరిదు బారయ్య;
మహలింగ దేవయ్య! మంది బేడయ్య;
సహసుఖ దేవయ్య! సరసర బన్ని;
బవడిగె దేవయ్య! బన్ని మల్లయ్య!
శివదేవ! నిల బేడ శీఘ్రదె బన్ని;
గురుదేవ! నీ కుణి కుణిదాడ బేకె?
సిరిగిరి యిదు నిమ్మ సిరిగిరల్లయ్య?
సంగ దేవయ్య! ప్రసాది దేవయ్య!
లింగ దేవయ్య! యుత్తుంగ దేవయ్య!
యమృత దేవయ్య! మహాత్మ దేవయ్య!
విమలాత్మ దేవయ్య! విశ్వనాథయ్య!
సర్వజ్ఞ దేవయ్య! శాంతి దేవయ్య!
పర్వత దేవయ్య! ధ్రువ దేవయ్య!

ప్రాణ దేవయ్యా! నిర్వాణ దేవయ్యా!
జ్ఞాన దేవయ్యా! కల్యాణ దేవయ్యా!
పరుసె హోయితు బేగ బన్ని యువగళ
తరలాట నీవు నిందక సిరి యెనుత
గుడ్డవ్వా! దుగ్గవ్వా! గొగ్గవ్వా! బన్ని,
షోడ్డల సోమవ్వా! షోడశి బన్ని,
హెమ్మవ్వా; రెమ్మవ్వా! హెగ్గవ్వా! బన్ని,
యమ్మవ్వా! నిమ్మవ్వా! బొమ్మవ్వా! బన్ని,
హెల్లవ్వా! హల్లవ్వా! హేచవ్వా! బన్ని,
మల్లవ్వా! చల్లవ్వా! మాచవ్వా! బన్ని,
యక్కవ్వా! కక్కవ్వా! యాచవ్వా! బన్ని,
జక్కవ్వా! రెక్కవ్వా! సొంతవ్వా. బన్ని,
సంగవ్వా! లింగవ్వా! సింగవ్వా! బన్ని,
గంగవ్వా! రామవ్వా! కామవ్వా! బన్ని,
ప్రమథవ్వా! [illegible] బన్ని,
కొమరవ్వా! [illegible] బన్ని,
చెన్నవ్వా! [illegible] బన్ని,
జన్నవ్వా! సోకవ్వా! [illegible] బన్ని,
శరణవ్వా! సొంతవ్వా! సతిశవ్వా! బన్ని.
పురుషవ్వా! రూపవ్వా; బొప్పవ్వా! బన్ని,
మత్తె [illegible] దేవి!
[illegible] దేవి!
[illegible] దేవి!
సిరిదేవి! [illegible]దేవి! సిద్ధబదేవి!
యమదేవి! [illegible] [illegible]దేవి!
సమ[illegible]దేవి! [illegible]దేవి! బన్ని,
ముంచె పోగలు బేడ మందితాహోల్ల,
హింగె సిల్లలు బేడ ఇరుదముఖ పావు,
ఉలికదె సిల్లదె పాంవాగి సమ్మ

బిళిపల్లి కెంపల్లి బన్ని బణ్ణ [illegible]
పాలెకారిద తుమ్మ [illegible]
హారె పర్వతవెంబ సంతోషపల్లి
మొబ్బరొబ్బర నోడి కొబ్బుత, కునివ
[illegible] బ్బుత్త, [illegible] హొబ్బుత్త, హాసివ
[illegible] ఎంయుత్త, [illegible] యుత్త, [illegible]
[illegible]
[illegible] హాసి
[illegible] త్త. సమసమగ [illegible] త్త, [illegible]
పేళుత్త, మందియొళ్, మాళుత్త, నెరహి
తిళియుత్త, మందియొళ్ సుళియుత్త, ప్రియువు
బెళయుత్త, జనగళ కళవుత్త, పురవ
నుడియత్త, తనగెతా నుడియుత్త, సలుహి
వాడెయుత్త, కుణికుణి దాడుత్త, సొక్కి
సిందుగ శిక్కుత్త, సిద్ధితాళగళు
సందిసుత్తా, తాళజడిగె మెట్టుత్త,
నడువవర్ నమ్మవర్ కావేకె హింబె
నడెనడెయెనుత, సందణిసుత్త, కూడి
కయ్యతాళంగళ కవిదు బారిసుత,
మెయ్యెల్లబాయాగి మ్మాతనహాడిరిభో!
హాబ్బుత్త. కొబ్బుత్త, యుబ్బియాడుత్త.
పబ్బతదొడయంగె భక్తిమాడిరిభో,
హాడుత్త, యాడుత్త, నోడుత్త, బత్తి
మాడిభో! సిరిగిరి మల్లికార్జునగె,
ప్రాణేశ నెనుగె శ్రీపర్వతదొడయ
మాణిదె నెన్నిభో! మల్లికార్జునగె,
హరహర! శివశివ! శరణు నీవెంబగె,
సిరిగిరి మల్లయ్య శరణెన్నిరయ్య,
పరమపాలకగళ పదిహాడిసునున.

సిరిగిరి మల్లయ్యా శరణెన్నిరయ్యా
మంగళమూరుతి మల్లయ్యనాథు,
సంగన బసవయ్యా శరణెన్ని రయ్యా,
బసవన్న యిష్టార్థఫలకె యూళిగను
పసరిసి మాడిథో! భక్తిమల్లయగె,"
యని యిట్లు పాడుచు నాడుచుఁ బ్రీతి
వనుగొనఁ గన్నడపరుస యేతేర
నరుదుగా నట్ల తా నారెదేశంబు
పరుసయు మరహాటభాష వెంపార,

-: ఆరెదేశపు పరుస :-

మాగ రహో సకోమరు బాప హ్మణత
భాగవతే పలే భక్త తే హ్మణత
చరలింగ గురులింగ శంభూనా హ్మణత
పురపర కెతితూర పర హోతె హ్మణత
'అఖిసిరికైలాస దఖశీల హ్మణత
సుఖముఖా ఝూలోపు ముఖఆమ్చ హ్మణత
మగ మహారాటాచ మహాదేవు ఆమ్చ
గగన రాజా ఆమ్చ కైలాస ఆమ్చ
అఖుమరాణా ఆమ్చ సుఖదేవు ఆమ్చ
సుఖకర ఆపలే శుభదేవు ఆమ్చ
అరె! తావ హే భక్త ఆపలే లింగ
సిరిగిరి మల్లయ్య చరమదియంత,
సుఖతాళ జతిమానలా ఖేలనాచె
మఖరజే సిరిగిరి మల్లయ్యరాణ,
మాలానిబంధన తాళగీతాశి
మాలాసమర్పణ మల్లయ్యరాణ,
ప్రబ్భసంతాప సంసార నాటకనె
ప్రబ్భతమల్లమ్మ ప్రబ్భజ్ఞ గాతొ,
ఆమ్చామగా పుణ్యా హారజాణచిత్త
ఆమ్చామహాభక్త అఖిల సమ్మేళ,

శరణ హేచిదర్వర జపళ తే హ్మణత
వరసుఖ సుఖీమూర్ఘు వరద హే హ్మాణత"
యనుచుఁ జిందులువెట్టి యాడుచుఁ బాడు-
చును నాలెపరుసయుఁ జన దేర మఱియు
నరుదొంద నటు యయ్యారువదేశంబు
పరుసయు ద్రావిడభాష సాంగముగ

**అరువదేశము పరుస**

"అరుట గిరెతియెన్న యదనే పిరానె
చిరిగిరి నిలయనే చివనె యాణ్డవనె
అంగమూఱుందానె యా యిరుందవనె
మంగయర్ పొంగనే మల్లికార్జునవనె
యా నున కక్కుడియచే నఖిలనాయనె
యేనమిల్లాలానె యిల్లపిల్లి యనె
అఱువత్తు మూవరు క్కాత్మనాయకనె
మఱునాలుమరియాద మల్లికార్జునవనె
ఆఱాలగండనే యాదియన్ద్రవనె
చూలియే మల్లికార్జునవనె యన్నరనె
యెల్లయిల్లాదానె యెజ్జుమఱ్ళవనె
దొల్లవల్లాదానె మల్లికార్జునవనె
అఱుమ్మిడ త్తిరు నీఱుముళ్ళవనె
యేజేఱుమీచనె యెల్లపల్లయనె
వేదియరుతుడుప్పు మాదియే చివనె
చోడియే మల్లికార్జుననె యన్నవనె"
యనుచుఁ జిందులువెట్టి యాడుచుఁ బాడు
చును నెల్లపరుస యుత్సుకత నేతేర
నరగలి గొన కిట్టు లఖిల దేశముల
పరుసయు సంస్కృతభాష వెంపున,

**గీర్వాణభాష**

"నాయాతి పరిష దాయాహి సఖీ త్వె,
మాయాఖి సన్మార్గ మతిరథ సేస,

ఆతపక్లాంతాసి, హే మనోరమణ!
ఏత దేవ హి పుర మిందీవరాక్షి!
దృష్టిం విశిష్టాం విధేహి ప్రమోద
మిష్టదాయిని సదా హేకరభోరు!
శ్రాంతాసి కిం సఖి! శైలతలేషు,
భ్రాంతిర్గతా పురసంవేశనేన,
జలజాక్షి! గురుపిపాసాపరిహర్త్రి
కలశస్థపాదోదకం పిబ స్వాదు,
ఉత్తంస ఘటాంజలి సముద్వీక్ష్య నగర
ముత్తాలఫలసిద్ధి రుపకంఠ మేతి,
నాథం భవానీసనాథ మనాథ
నాథ మాత్మని మల్లినాథం భజస్వ,
అన్యోన్యసల్లాప నాన్యోన్యవంద
నాన్యోన్యకృతవినయామేళనేన,
శుభకర శ్రీశైలచూడాకరాయ
అభవాయ శ్రీ మల్లికార్జునాయ నమో,
కరుణాకరాయ శ్రీ కంఠాయ కర్మ
హరణాయ శ్రీ మల్లికార్జునాయ నమో,
అంబకత్రితయాయ హర శంకరాయ
సాంబాయ శ్రీమల్లికార్జునాయ నమో,
ఆద్యంత విరహితాయ నమశ్శివాయ
ఆద్యాయ తే మల్లికార్జునాయ నమో,
ఆయురారోగ్యప్రదాయక ప్రమథ
నాయక శ్రీమల్లినాథ మాం పాహి,
మల్లికామాలికామస్తకాభరణ
మల్లికార్జునదేవ మామేవ పాహి,
మల్లికాఘనసార మందారదేహ
మల్లికార్జునదేవ మామేవ పాహి,
మల్లికార్జునయశోమండిత శాంత

మల్లికార్జునదేవ మామేవ పాహి,"
అనుచు సంస్కృతభాష నంతంత నెరపి
యను షక్తిఁ బాడుచు నాడుచు నంత
మాళవ కాశ్మీర మాగధ సింధు
గౌళ తురుష్క కొంకణ శూరసేన
బంగాళ కాంభోజ పాండ్య ఘూర్జర క
ళింగ బర్బర సింహళిక కరహాట
సౌరాష్ట్ర బాట ప్రశస్త దేశముల
వా రాదిగాఁగఁ బెంపారు దేశముల
యందును మధ్యదేశానీకమత్త్య
సందోహమును నట్ల సహజభాషలను
మసలి యొంపారులతో మాటలాడుచును
బసరించి శ్రీగిరిఁ బ్రణుతి సేయుచును
జతి దేశియఁ బ్రబంధచరిత తాళాను
గతి యుగ్గళన పదశ్రుతి యాదిగాఁగఁ
జను స్వదేశ విదేశసరణి వెండియును
ననుషక్తిఁ బాడుచు నాడుచు నట్ల
చెలఁగి నానాదేశముల కప్పుడిలు
గలకలంబుగ గముల్ గట్టి యేతేర
నంత నత్యంతసమగ్రత నంత
కాంతకుండగు మల్లికార్జునపురము
గడునొప్పి ముంపటఁ గానంగనయ్యె,

## పర్వతవర్ణనము

నదరి] తన్మహిమ యే మని ప్రస్తుతింప?
గిరిదర్శనము ముక్తికిని హేతు వనినఁ
బురివర్శనఫలమే పోల్కి వర్ణింప?
గిరి సెలయేఱులు సురనదు లనినఁ
బుధి నదీనదము లేపోల్కి వర్ణింప?

గిరిచుట్టు ప్రాఁకులు సురతరు లనిన
బురి యుపవనము లేపోల్కి వర్ణింప?
గిరి మందయై యుండు సురభుల కనినఁ
బురిఁ బశురాశి నేపోల్కి వర్ణింప?
గిరి సమస్తంబును హరమూర్తియనినఁ
బురి లింగమహిమ నేపోల్కి వర్ణింప?
గిరి కిరాతుల ముక్తిపురినాథులనినఁ
బురి భక్తవరుల నేపోల్కి వర్ణింప?
గిరి యంత్యజులు ధరామరముఖ్యు లనినఁ
బురి బ్రహ్మవరుల నేపోల్కి వర్ణింప?
గిరి సర్వజీవులు గీర్వాణులనినఁ
బురి జీవకోట్ల నేపోల్కి వర్ణింప?
నైన నొక్కించుక నానేర్చుభంగి
మానుగాఁ బొగడెద మహి నస్మదాది
కవుల పాఠకుల వాక్పావనకరము,
భవత్ప్రణికరము, దుర్భరకర్మహరముఁ,
ప్రమథమందరము, సద్భక్తి భాస్వరముఁ,
గమలాకరముఁజూడఁ గడు ననశ్వరము,
భంగురేతరము, శ్రీపర్వతపురము;
లింగ మేదుర మెన్న లేదితఃపరము,
శుభ సముత్కరము. విశ్రుత సౌఖ్యకరము,
నభినవకైలాస మాపురవరము,
శ్రీశైల విభు సదాశివుమీఁది శిరము;
నాశిరోమణి మల్లికార్జునస్వామి
దేసిగా నప్పురి దివ్యలింగములు
నాసదాశివుని నేత్రాదీంద్రియములు,
సెనసి దర్శనముక్తి శిఖర మద్దేవు
ఘనజటాజూటసంగత శిఖరంబు
మల్లికాకుండ యామ్యజకుండ సలిల

వల్లరి శివుమౌళి మల్లికామాల,
వరనన్నతపురవత్రప్రాకార మీఱు
వరమధ్యమేఖలా వలయభూషణము,
భువ్యచతుర్ద్వార భరితహారత్రయములు
నవ్యవిభూషణ నాయకమణులు,
భావింపఁ దత్పురభ్రాజితనదులు
దేవదేవేశ్వరు దివ్యాంబరములు
వరుసఁ బురోద్యానవనము లీశాను
చరణార్చితలతాంత చారుమంజరులు
వరగు నస్పురపీక భక్తపుంగవులు
హరుపరకరచరణాద్యంగకములు.
భంగిగా నప్పురిజంగమావళులు
సంగజహరుని వగావతారములు,
నటుగూడఁ బరసయు నాపౌరజనులుఁ
బటురతిశివుభ్రమోలఁ బసరించు ప్రజలు
పురి బహురత్న భాసురతోరణములు
గరమొప్పు పురనాథు గ్రైవేయకములు,
నమిత తత్పురవరోద్యత్కేతనములుఁ
బ్రమథేంద్రు లిడు చామర ప్రతానములు,
గా నిట్లు పురము సాక్షాద్రుద్రరూప
మై నివ్వటిలఁ దదీయమహత్త్వమునను
నేపార నిట్లొంశు హేతుదృష్టాంత
రూపనిరూపణల్ రూపింప నెట్టు
లెగుడు కీర్తనసేఁత కిల నెట్లు సొంగ
మగు ''గగనం గగనాకార'' మనఁగ,
నొగి ''సాగరం సాగరోపమం'' బనఁగ,
జగదభినుతలీల శైలాధినాథు
పురము పురీశున పోలుఁగా కనఁగ,
నరుదగు శ్రీమల్లికార్జునపురము

శ్రీకరం బై జగత్సేవ్యమై యిట్లు
ప్రాకటంబుగఁ గని పరుస యుప్పొంగి
సంతసిల్లుచును 'షే' 'జయజయ' యనుచు
నంత నెంతయుఁ బ్రీతి నప్పురి దరియ
మండియు మండియు మల్లడి గొనఁగఁ,
గ్రందును గ్రందుసు గజిబిజింపంగు
బడగలుఁ బడగలు ముడివడి గొనఁగ,
గొడగులు గొడగులుఁ దొడిదొడి నదరఁ,
గలయంగ నడపంచిరులు నడపంది
రులు మేఘపంక్తుల రుచి దివిఁ బర్వ,
వినుకులు వినుకులు వినుపీథి మోయ,
మనుకులు మనుకులు మానక తగుల,
మదళీలు మదళీలు మచ్చరింపంగ,
సుదతులు సుదతులు శ్రుతి గౌరవింపఁ,
దాళధారులుఁ దాళధరులు నుప్పొంగఁ,
దాళముల్ దాళముల్ దందడిగొనఁగఁ,
గాళెలుఁ గాళెలు, గలసి ఘూర్ణిల్ల,
నాళతు లాళతు లటుదొట్రుకొనఁగ,
నటకులు నటకులు నలిరేఁగియాడ,
నటవిలు నటవిలు నటుప్రస్తుతింప,
వాద్యముల్ వాద్యముల్ వరుసలు దప్పఁ,
బద్యముల్ పద్యముల్ గద్యలుగాఁగఁ,
బాటలుఁ బాటలు బరిపాటిఁ దవ్వ;
మాటలు మాటలు మ్రందియడంగ,
రసములు రసములు రతులు దలిర్ప,
రసికులు రసికులు నొసగులు పీద,
దిట్టలు దిట్టలు దెల్లట్లు సెప్పఁ,
దొట్టరుల్ దొట్టరుల్ దొలఁగి చనంగ,
మిండలు మిండలు మెలుఁతల నరయ,

మెండిలు మెండిలుఁ దండకింపంగ,
దానులు దానులఁ దమకించిపట్టి,
దీనులు దీనులుఁ దిరుగుడుపడఁగఁ,
జూపలుఁ జూపలు సుడివడి తిరుగ,
మోపరుల్ మోపరుల్ ముందఱ నడువఁ,
గావళ్లఁ గావళ్లఁ గ్రందుకొనంగఁ,
జావళ్లఁ జావళ్ల సందడింపంగ,
నందలా లందలా లందందువెనఁగ,
మందళ్ల మందళ్ల మలయుచు నడవ,
నాయకుల్ నాయకుల్ హాయనేతేర,
గాయకుల్ గాయకుల్ ఖచరముల్ వాడ,
భట్టులు భట్టులుఁ బ్రతిగట్టి పొగడ,
గట్టులు గట్టులుఁ జిట్టలుసెలఁగ,
సేవకుల్ సేవకుల్ సేరి కొల్వంగ.
భావకుల్ భావకుల్ వథ మిచ్చితొలఁగ,
బాంధవుల్ బాంధవుల్ ప్రతిఁగౌఁగిలింప,
నంధులు నంధులు నటమున్న నడవ,
నంగళ్ల నంగళ్ల నట యిట దనర.
సంగళ్ల సంగళ్ల జనులేఁగి పిలువ,
మిన్నేటి జలములు మెత్తనిమణులుఁ
గ్రొన్నెలతిలకముల్ గొమరుఁబ్రాయములుఁ
జుక్కల పేరులు సురధేనువులును
జక్కనిరూపులు సంతానతరులు
నజరామరత్వంబు లైరావతములు
గజవైరి జడలును గామరూపములు
రవితేరి హరులును రసకూపములును
విధి యొక్క నిచ్చెనల్ దీర్ఘాయువులును
వెన్నెలపూతలు విద్యుల్లతలును
గిన్నరగానముల్ ఖేచరత్వములు

జంగమతురువులు స్వర్గాంగణములు
సింగంబు కొదమలు సిద్ధమూలికలు
ఖపగపౌషధములుఁ బండితత్వములు
దివిజేంద్రపదవులు దివ్య దేహములు
నిలఁ గమ్మపసిఁడియు నిక్షుఫలములు
మలయజపుష్పముల్ మంచు ముద్దలును
నష్టాంగయోగము లణిమాదు లైన
యిష్టసిద్ధులును, దృష్టాదృష్టసౌఖ్య
ములు, నేదుకన్నులుఁ, బులుజున్ను, విలువఁ
గలుగు తత్వజ్ఞ్యమార్గములు సూపుచును,
సఱిముఱిఁ దనర నత్యంతఃపురంబుఁ
దఱియంగఁ జొచ్చిన త్రోవనటు గూడ
నడతెంచపరుసంయు నడుపపండరులు
గొడగులుఁ బడగలు నుడువీథిఁ దనర
నాలుగుద్రోవల నలిపచ్చుపరుస
నేలయు నడవియు నింగియు దెసలు
గోపురద్వారముల్ గోటలుఁ గొమ్మ
లాపురంబున మల్లికార్జునుగుడియు
మండపంబులు నిండ్లు మార్గముల్ నదులుఁ
గుండముల్ వనములుఁ గూడంగ ముంచి
శ్రీగిరీశ్వరు శిరశ్శేఖరయైన
యాగంగ పరిషత్సమాగమవేళ
నలరి యుప్పొంగి మిన్నంది వెల్విరియు
పొలుపునఁ బరుస యప్పురి వెల్లివిరిసి
క్రిక్కిఱిసి నెక్కొని పిక్కటిల్లి, గిరి
గ్రుక్కిఱిపంబై కట్టుకొని, గుండుగూలి,
నిట్టద్రోచి, యలమి, దట్టమై, తూఁటు
గట్టి, సంకీర్ణమై, బిట్టుబ్బి, కూడ
నెక్కడ నెక్కడ నెంతెంత దెలిపి

యక్కుడసక్కుడ నటగూడిపిడియుఁ,
బండితమల్లయ్య పరపదస్థుఁడప్పు
డుండగు శిష్యుండు దోనయ్యగారు
శ్రీపర్వతావాసు శివు భవుఁ బిరద
యాపరు శ్రీ మల్లికార్జున దేవు
దర్శించి హర్షించి తద్భక్తవరుల
దర్శించి యతులితోత్సవలీల వసర
జంగమారాధనల్ సక్కఁజల్పి నిత్య
లింగార్చనములు సల్లీలఁ గావించి
పండక పూవక పత్త్రిరియంప
నిండారుఫలముల నిటలాక్షుఁ బూన్పఁ
బండొక్క డీశ్వరార్పణ సేయనొక్క
పండునఁ చనకగు ఫలకోట్లు మఱియు
శ్రీగిరీశ్వరున కంచితరత్న మణి పు
రోగమబహువిధాభూషవస్తుప్ర
తానసమర్పణప్రవర్త మంతయును
గానుక యగు నిది గనుఁ జిత్ర మనుచు,
ఫలములుఁ, బుష్పముల్, పత్త్రి, గాను
కలు, దర్శనంబు లీఁ గాంచునంతంత
గంతులు నెఱసి, సంగడములు బెఱసి.
బంతు లేర్పడఁ జెట్టపట్టలు పట్టి,
కట్టలు గట్టి, తీఁగలు సాఁగి యల్లి,
పట్టులు వట్టి, కుప్పలు గోనిగములు
గట్టి, పేరెలువాఱి, తిట్టలు ద్రోచి,
చట్టంబులై సముద్ధతి నేఁగుదెంచి,
కూడ సప్తార్ణవ ఘోషంబు సెలఁగ,
నాడెడు పాడెడు నలరెడు బృంద
ములు వినుకులు వేలములు సంప్రదాయ
ములు గొలువులు భోగములు పెక్కు వంగ

దములుఁ దోయములుఁ దండములతో నాట
కములల మొత్తముల జోఁకల మంది పఱచి
యుద్రిక్త మతి శ్రీనగోత్తుంగ నిలయ
రుద్రుని మల్లికార్జునుని దర్శింప
నలి నుబ్బి పౌరగణసహాయు లగుచుఁ
లకలాకీర్ణ సాగర ముత్తరింప
చనువారు, దర్శించి చనుదెంచువారుఁ,
జనలేక నడుమఁ గ్రచ్చఱఁ జిక్కువారు,
నొత్తొత్తుననుఁ గాక యొడ్డగిల్వారు,
నొత్తికొంచును సముద్వృత్తిఁ జన్వారుఁ
బత్తిరిపుష్పముల్ పడకుండఁ జేతు
లెత్తికొనుచు నడ్డ మేఁగెడువారుఁ,
బరుసమీఁదన పడిఁ బడిఁ బోవువారుఁ,
జరణంబు లెపదాటిఁ జనియెడువారుఁ,
దెఱలి సందడి కోడి గిలఁబడువారు,
మొఱ బలిమిని మునుముట్టఁ జన్వారుఁ,
బరుస పాదంబులు వాయంగ నడుము
కరణి సందడివాయఁగా నడప్పువారు,
నట్లును బుష్పమాల్య ప్రతానముల
యట్లుగాఁ గై కొని యరిగెడువారు.
మహిత తత్ప్రసాద మండపద్వార
గహన ప్రదేశముల్ గాంచి చన్వారుఁ
దమకించి చొచ్చి తత్ప్రసాదమంట
పమునంద తిరుగుపడి తిర్గువారుఁ,
జొత్తుమ కాకంచు సాకనాసినుండి
వత్తు మే మనియురువడఁ జొచ్చువారుఁ,
నిసిన సందడిఁ దఱిసి క్రిందెఱపి
నఱిముఱి గర్భగృహమునుఁ జొచ్చువారుఁ,
ద్రోచుచు నొఱఁగుచుఁ దొట్రిలుకొనుచు

బొచుచు లింగంబుపైఁ బడువారుఁ
బిటి వీఁ కులను మందిఁ బెనఁగు లాడుచుఁ
దటిఁ దటి లింగంబుఁ దడవెడువారుఁ,
దలలు లింగముతోడఁ దాఁకించువారు,
మలయ మల్లయ యని మలసెడువారు,
సందడిఁ జొచ్చినఁ జత్తుమో యనుచు
నందంద లింగంబు హత్తుకొన్వారుఁ,
బరుసవేదిని సోఁకఁ బసిఁడియ యనుచు
హరునకు మెయిముట్ట నరిగెడువారు,
మంటిమి, మల్లయ్యఁ గంటిమి, ముట్టఁ
గంటిమి మే మంచుఁ గ్రమ్మెడువారు,
వచ్చెఁ జుమ్మయ్య మావ్రతము మల్లయ్య!
నిచ్చెఁ జూచితి మంచు నేతెంచువారుఁ,
మల్లయ్య రక్షించు మాపర్వతంబు
మల్లు మీ రంచును మగుడెడివారుఁ,
బలికిన స్వర పుష్పములు మల్లయ్య!
యెలమిఁ గై కొను మంచు నేతెంచువారుఁ,
నెల్లమొక్కులు నీకు నెక్కెఁ జుమ్మయ్య!
మల్లయ్య! యంచుఁ గ్రమ్మఱ దరిసించి
వచ్చువారును జూచు వారును, జూడ
వచ్చువారును, జొచ్చువారు, వెండియును
గర్మలఁ జూచినకర్మంబు దృష్టఁ
గర్మేతరునిజూడఁ గా దన్నయట్లు
గన్నులఁ గెలఁకి, చక్కనపుచ్చి, క్రొత్త
గన్నులు వడిసి లింగముఁ జూచువారు,
సమనేత్రుఁ డై యున్కి సాతుర్యమనుచు
సమనేత్రగౌరి దత్స్వామియు నింక

దల లేదనెడుమాడ్కిఁ దల లిచ్చువారు,
గరళాంకుకృపలేని కర్మదేహములు
ధరియించియున్కి-యుఁ దప్పన్న యట్లు
నటుల నిస్సారసంసారవిర క్తి
నటుగూడఁ దనువుల నర్పింపువారు,
వృత్రాసురులభక్తి విధి ధూపదీప
పాత్రముల్ నిజకరపల్లవంబులుగఁ
బరమేశు మెప్పించి పడసినదైత్య
వరు లంతఁ బోక పర్వతునిగుఱించి
ధృతి శిరంబులు ధూపదీపపాత్రముల
గతి నావహించినకరణియుఁ బోలె
శిరములఁ దాల్చిన చిరధూపదీప
పరిమళప్రభలు శ్రీపర్వతు మునుపఁ
జూడఁ జోద్యం బగుఁ జూపఱు వొగడ
నాడుచుఁ బాడుచు నలరెడువారు,
నాడంగ వెండియు నతిపలుఁ వారు
వీరరసోద్ధతి వేషంబు లలర
ఘనకీర్తి వలకేల గండపెండెరము
లును వీరమద్దియలును నందియలును
జాలనొప్పెడు చేతి సంకలియలును
వ్రేలఁగూడెఁడు బలువేల్పుబొమ్మలును
గడుఁగడుఁ దెలుపారుఁ గర పత్రములు
నిడుఁదపాపటలును నెఱినొల్లెములును
నింబారుగంధంబు నెరపూఁతలును న
ఖండలనేత్రవికస్వరాంశులును
నంచటిలో నారసంబులు బొట్టి
బొంధదెకాలలుఁ బసవులఁ గాటుకలును
భసితంబు దిలకముల్ బాసికంబులును
నొసఁ దోడి పచ్చకముల్ పిచ్చ పట్టములుఁ

దసరారు పువ్వుల దండ లందంద
ఘనతరంబగు మొల గచ్చుఁ దోఁకలును
గొఱిగినగడ్డముల్ గోఱమీసములు
మెఱుఁగుఁ బల్వరుసలు మిళితమై తనరఁ
దలల మూఁపులఁ గరతలముల వ్రేళ్ళ
గళముల జిహ్వలు గర్ణరంధ్రములఁ
గడుపుల మెడల వక్షములఁ బిక్కిళ్ళఁ
దొడల తెప్పలఁ దొడిఁదొడి దీపవితతు
లలరంగఁ బెనుదివియలు నారసములఁ
గలయంగ నిరుమెయి గాఁడ సంధించి
శ్రీపర్వతునకు సుస్థితి నివాళింప
దీపవృకంబు లేతెంచుభావమున
లీలఁ బర్వతు నివాళించుచు నట్లు
గ్రాలుచు సోలుచు గతి నాడువారు,
నాలయుచు వెండియు నొక్కొక్క కెలస
ములు సమర్పించుచు ముదమందువారు,
నేకాంతమున హాటకేశ్వరం బేఁగి
యాకాంక్షఁ గెలసంబు లర్పించువారు,
గలయఁ బాతాళగంగా స్నానవిధులు
సలుపంగ సర్థిమైఁ జనియెడు వారు,
ఖ్యాతమై త్రిపథగంగా స్నిత మైన
పాతాళగంగాప్రవాహ మెట్టనిన,

## పాతాళగంగా వర్ణనము

సురగాంఙ్కు శ్రీచరణోద్భూత యగుచుఁ
బరగు భోగవతినాఁ బాతాళమునను
భవసముద్ధూళితభస్మసంజనిత
యవుచు భాగీరథి యనఁగ మర్త్యమునఁ
గణికంతుపరజటోత్కరజాతయగుచు

వఱలు మందాకిని స్వర్గలోకమున,
ధర స్వర్గ మర్త్య పాతాళ గంగాప్ర
చరసంగమంబు శ్రీశైలచూడమునఁ
బ్రకటితంబగుచున్కిఁ బాతాళగంగ
సకల తీర్థఫల ప్రసాదితమహిమఁ
దావెలుంగుచు స్మృతి దర్శనస్పర్శ
నావగాహన పూరణాదులవలన
సాలోక్య సామీప్య సారూప్య ముక్తు
లొలి నీఁజాలు మహోన్నత దోర్లతిక,
యనిమిషలోచన, యావర్తనాభి,
ఘనతరపులినజఘన, కమలాస్య,
యురురథాంగ స్తనియును, ఫేనహార,
వరహంసగమన, ప్రవాహాంగ యగుచుఁ
గారండ హంస బక క్రౌంచఖసల
సారస కుక్కుట చక్రవాకాది
జలపక్షిరవ వాద్యశబ్దముల్ మ్రోయ
నలి మృదురీతి నానాగాన మెసగ
వడిఁ బరిషత్కోటి వడతేరఁ గాంచి
తడయక వీచిహస్తముల నటించు
భంగిఁ బొల్పారునుత్తుంగతరంగ
రంగిణిఁ బాతాళగంగ దర్శించి,
తగు యథాసంభవ దాన ధర్మంబు
లొగి నియోగించి పుణ్యోపేతు లగుచు

**-:కర్మారీశ్వరము:-**

నరిగి శ్రీరుద్రపాదాభివందనముఁ
గర మర్థిఁజేసి యా కర్మారి నుఱుకు
ననఘుల భవపరిత్యక్తమానసులఁ
గనుగొంచు సంభ్రమాక్రాంతాత్ము లగుచు
నటిముటి నవలి కర్మారీశ్వరమున
నుఱుకుపుణ్యులు జూచి యోగి నుతింపుచును

బాపకంటక వనోత్పాటన యశులఁ
బాపవినాశక ప్రభృతిలింగముల
నంతంత దర్శించి యంత నప్పరుస
యెంతయు నాశ్చర్యహృదయులై పొదలి
సిరిగిరి నిట్టివిచిత్రంబు గలదె ?
పరుస యింతని గుట్టు పఱుపంగరాద
యొక్కొక్కకోటికి నొక్కొక్కఁ డుఱుకు
నక్కజంబైన కర్మారీశ్వరమున
నుదృవృత్తి వింటి కాఁ డుడు వీది నేయు
నాద్యంత మధ్యబాణాసనంబట్లు
వడియెడు దేహంబుఁ బడిన దేహంబు
నడిమి దేహంబు లెన్నంగఁ బెక్కుడు
చుండె నద్దినములు నుడుగక యనిన
వెండితీర్థాదుల వివరింపఁ దరమె?

## పరుసలు

వరభక్తియుక్తి శ్రీవారణాసికిని
గరమర్థిఁ జను సాఁతుకరణిఁ జూచితిమి,
ప్రీతి ద్రాక్షారామ భీమేశుపెండ్లి
కేతెంచుపరుస నాఁ డేము సూచితిమి,
గుడిపూడి సోమేశు కూర్మి పెండ్లికిని
నడతెంచుపరుసల నాఁడు సూచితిమి,
వెనుమెట్ట పులియూరి పెండ్లిండ్ల కర్థిఁ
జనుదెంచిదర్శించు సాఁతుఁజూచితిమి,
స్థిరభక్తియుక్తిమై సిద్ధవటంబు
తిరునాళ్ల కేతెంచు పరుసఁ జూచితిము,
గుడ్డవ్వపురమునకును జాత్రవచ్చు
దొడ్డసందడి నాఁడు దొలుతఁజూచితిమి,
విజయాపురంబున వీరసోమన్న

భజియింపఁజనుదెంచు పరుసఁ జూచితిమి,
సరిఁబేర్చు క్షేత్రపూజలకు సొన్నలిక
పురమున కేతెంచు పరుసఁ జూచితిమి,
సౌరాష్ట్రనాథునిఁ జీరగట్టించు
వారంబులకు వచ్చువారిఁ జూచితిమి,
యాటటసింహ బృహస్పతి పరుస
గోదావరిని గూడు కొలఁదిఁ జూచితిమి,
మహా శివరాత్రిని రవి గ్రహణాదులందు
బహుళంగాఁ గూడు పరుసఁ జూచితిమి,
నలిఁ గార్తికంబు పున్నమనాఁటి పరుస
కలిమియుఁ ద్రిపురాంతకమునఁ జూచితిమి,
రమణ శ్రీరామేశ్వరం బేఁగు పరుసఁ
గ్రమమునఁ బలుమాఱుఁ గందుముగాని,
యటి పెన్సందళ్లనంతముగాంతు,
మిట్టిసందడిఁ గాంతుమే యెందునైన ?
మఱియొక్క చోద్యమీ మల్లికార్జునుఁడ
యెఱుఁగుఁదా, నెట్లన్న నేమనిచెప్ప ?
నెంతెంత పరుసదా నేతెంచి విడియ
నంతంత యాయతంబై యుండుఁబురము,
నెంతెంత పరుసదా నేతెంచికోరు
నంతంత జలపూర్ణమై యుండు నదులు,
నెంతెంత పరుస దా నేతెంచి చొచ్చు
నంతంత విస్తీర్ణమగు శివాలయము
నెంతెంత పరుస రా నేతెంచి కాంచు
నంతంత యున్నతం బగు లింగమూర్తి,
లక్షింపఁగ సపాదలక్ష నేపాళ,
మీక్షింపఁగ సపాదలక్ష గేదార,
మీక్షింపఁగ సపాదలక్ష సంతేరి,
లక్షింపఁగ సపాదలక్ష గాశ్మీర,

మీక్షింపఁగ సపాదలక్ష గనౌణ్ణిజ,
మీక్షింపఁగ సపాదలక్ష గొంకణము.
లక్షింపఁగ సపాద లక్షగళింగ,
మీక్షింప నాఁబోట మిలసప్తలక్ష,
గ్రమమొంద జాలంధరం బష్టలక్ష,
ప్రమిత చౌదహాలక్ష బంగాళభూమి,
గుఱి సప్త దశలక్ష గుజరాష్ట్రభూమి,
మఱియష్ట దశలక్ష మాళవభూమి,
జానొంద నవలి పంచద్రావిళములల
లో నవలక్షదెలుంగు, వీనికిని
నిమ్మడి ముమ్మడి యితర దేశంబు
లిమ్మహి దేశంబు లెన్నంగనేల ?
ధరఁ దూరుపుననుఁ గేదారంబు దనరుఁ,
బరగు ద్వారావతి పశ్చిమంబునను,
వరుస నుత్తరమున వాలుకానదియు,
దరమిడి గంధమాదనము యామ్యమున,
రతి ననంతం బుత్తరాపథంబునను,
క్షితి హిమవంతంబు సీమగా మఱియు
నెన్నంగ దేశంబు లెన్నియెన్నియును
నెన్నంగ మోక్షార్థు లెందఱెందఱును
గడునొప్పి దక్షిణకైలాస మనఁగఁ
బడుఁగాన యిట్టి శ్రీపర్వతాధీశు
వారక దర్శింప వచ్చినయపుడ
తారొక్క కోలఁదియై తనరు నిన్నియును,
మానుగాఁ బర్వతు మహిమయెట్టిదియొ
జానొంద శివుఁడైనఁ జర్చింపలేఁడు,
నాగినెట్లు పోయెదమోయంచు నుండ
నాగి వచ్చితిమి గులం బుద్ధరించితిమి,
మంటిమి, సిరిగిరిమల్లయ్యఁ జూడఁ

గంటిమి, గండముల్ గడచితి, మింకఁ
బుట్టువుల్ సఫలతఁ బొందెఁ, గర్మములఁ
జెట్టుల నటమున్న కట్టి వచ్చితిమి,
వేళ్లిడఁ గంటిమి బిడ్డలఁ, దొల్లి
యూళ్ల మ్రొక్కిన మ్రొక్కు లొగిఁ బూరగించెఁ
మదిలోన శివ యని మము మే నెఱుంగి
నదియాది గాఁగఁ బోయెదము వోయెదము
సిరిగిరి కనుమంద సిద్ధించె నిపుడు
ధర నెట్టకేలకుఁ దమభాగ్యమహిమ,
నగునగు నట్టి పుణ్యక్షేత్ర మింక
దిగవిడ్చి పోదుమే మగుడి యూళ్లకును ?
నేఁటి కిన్నియు ? లింగ మెఱుఁగుఁ బోయింక,
నేఁటికి సంసార ? మేల జీవనము ?
నియ్యసూ భక్తివిహీనుల బ్రదుకు,
గొయ్యఁ బొద్వన దానిఁ గొనిపోయి కాల్పఁ
దల్లులఁ దండ్రులఁ దరుణు లాత్మజులు
మొల్లమ్మ ధనములు మునుమిడి భూము
లూళ్లు వృత్తులును నియోగ సౌఖ్యములఁ
బేళ్లను బెంపులఁ బెద్దఱికములు
బలపరాక్రమములఁ బ్రాయముల్ రాజ్య
ములు సంపదలు వంశములు నటుగూడ
జలబుద్బుదంబులు, శారదాభ్రములు,
జలతరంగము, లింద్రచాపముల్, నిట్ట
పాటలు, బయలిదీపములు, బాలకు లఱుఁగుఁ
మాటల్, పిపీలికామార్గంబు, లెండ
మావులు, మొయిలుల మహిమలు, మెఱుఁగు
దీవెల్, గతాగతద్విరదకర్ణములు,
వానవఱ్ఱులు, నీటవ్రాఁతలు గాక,
శానిత్యములె ? మాయఁ దగులు నేఁడ్లాని ?

యనుచుఁ దత్క్షేత్ర సమగ్రమహత్త్వ
మునఁ జేసి వైరాగ్యమున వదివోదల
వచ్చువారును, జొచ్చువారును, వెనుక
వచ్చువారును, జూచువారునై యుండ,
నారూఢమతి మల్లికార్జునపండి
తారాధ్యు సుతుఁడు దోనయ్య సంప్రీతి
నాగమోక్తముగ భక్తాళియుఁ దాను
జాగరణోద్యుక్త సంగతబుద్ధి

## దోనయ్య శివరాత్రి జాగరణము

ఘనితప్రాసాపమండపగోపు
రాసిక దీప ప్రభాభ్యంతరమున
విలసిత వివిధనవీనాంబరప్ర
కలిత మండప మొప్పఁ గావించి, యందు
పరిచిత క్రముక రంభాస్తంభముకుర
భరితోత్తరంగ శుంభద్ద్వారతతులు
సంచితనీలదృషత్కుట్టిమములు
నంచితోత్పలసమాయతతోరణములుఁ
గంబకట్లను మేలుకట్లను జుంబి
తంబులై యొప్పు నూతనఫలావళులు
నుపఫలావళులుఁ బుష్పోపహారములు
నుపపద్మముకురము లుపరత్నములును
మాసితబహువర్ణ మహితోపవార్థి
ఫేనపుంజంబులుఁ బృథుతరంగములుఁ
గమనీయ నిజరత్న కందుకావళులు
నమితసువర్ణలతాంతమంజరులుఁ
బరిమితద్రాక్షాది ఫలగుచ్ఛములును
గురుతర విద్రుమాంకురలతాతతులు
శర్మాంబురంజిత పటచిత్ర వస్త్ర
నిర్మిత బహుపక్ష నివహాతిశయముఁ

బక్వాన్నవలయముల్ పక్వఫలములుఁ
బక్వాన్నపూరముల్ పటుపతాకలును
నరుణాబ్జ కర్ణికా రాశోకరక్త
కరవీరచంపక కైరవాద్యఖిల
సురుచిర ప్రసవసిష్యూతమాలాప్ర
కరబంధతత్ప్రష్ట ఘంటికావళులు
నింతయు నింపు వహింపఁ గల్గింప
నంతఁ దద్భక్తమహత్త్వంబుఁ జూచి
యిల "దివాహంతిబహిస్తమో" యనఁగ
వెలిసీఁకటియు నహోవేళనకాని
చెడదు సూర్యార్చులచేత శ్రీగిరిని
సడిసను భక్తవర్యనమాత్రమునను
వడి "బహిరంతర్దివానిశం" బనఁగఁ
ఒడియును రాత్రింటి పగలింటిలోన
వెలిదమం బంతయు వేగంబ క్రాఁగు
నిలమీఁదఁ దనబ్రదు కేఁటికి ననుచుఁ
గడుఁగడు లజ్జచేఁ గడఁగి వారాశిఁ
బడినభావంబున భానుండు గ్రుంకె,
మానుగా సూర్యాస్తమానంబుఁ జెప్పి
జానొంద నారాత్రి సన్నుతిసేఁత
దా నవశ్యము గవితాధర్మమునకు
నే నింక నీరాత్రి నెట్లు వర్ణింతుఁ?
బృథుల కాహళశంఖ భేరీరవంబుఁ
బ్రథిత మృదంగాది బహుఘోషణంబుఁ
గాంస్య తాళానేకఘంటికాతీవ్ర
శంసోక్త్రరావంబు జయజయధ్వనులు
నలరు సంధ్యావేళలం దందమేని
నిల వాద్యరవ మతానేప్రొద్దుఁగూడ
గర్జిల్లు నప్పురి ఘనఘనాటోప

గర్జనంబున గిరుల్ గర్జిల్లు చుండ
వారక చీకటి వర్ధింతమంద
మారాదు దద్దీపమాలికాతతులు
ప్రాసాద గోపుర బహుహేమకల
భాసుర ద్యుతులు శుంభద్ధ్వజదండ
ఖచిత భాస్వద్రత్న కలితదీధితులుఁ
బ్రచుర ప్రభలపేర్మి రాత్రుల్ పగళ్ల
తెఱఁగున వెలుఁగారఁ దిమిర మప్పురిని
నెఱినెన్నఁడును లేదు, నేఁ డేల చెప్ప?
సరి జారచోరులఁ జర్పింతమేనిఁ
జరితార్థవంతులు శైలాగ్రచరులు,
నుడుపంక్తిఁ గనఁబడ దా నభోవీథిఁ,
బటుతర పురసముద్భవ ధూపధూమ
పటలంబు నీలాభ్రపటలమై యునికి
జలజోత్పలావికస్వర వికస్వరత
లలపడ వర్ధింత మందమేనియును
భాసురాభ్రంకష పర్వతోన్నతిని
నాసూర్యచంద్రోదయాస్తమానములు
గొలఁకులఁ గలువలకును దామరలకు
నలి నహర్నిశము గానంగరాకునికి
నప్పాట వర్ణించు డవివేక మెట్లు
జెప్పఁ జిత్రంబగు శివరాత్రి మహిమ,

## మృగవ్యాధుని కథ

యొకర్క మృగవ్యాధుఁ డురుకాననమున
గ్రక్కున యొక్క, మృగంబు వీక్షించి
శరమరిఁబోసి భాస్వద్దృష్టిముష్టి
సరసంధానకౌశలము వర్తిల్లఁ
ధాడిఁగి యేయుడుఁ గోల దోడన మిట్టి

పడినమృగము నుచ్చిపాఱి తచ్ఛరము
సకకృన నిన్నుభూస్థలినతి నిద్ర
నెకొన్న కోల్పులి నెత్తిపైఁ బడుడు
బిట్టులిక్కిపడి పరిస్ఫుతోగ్రవృత్తిఁ
గట్టలుగట్టి వ్యాఘ్రంబు శీఘ్రంబ
పైఁబడ నతిభయ భ్రాంతినయ్యేఱుకు
వేబారి యొకబిల్వవృక్ష మెక్కుడును
దలచుట్టుఁ బెనురక్తధారలు గ్రమ్మఁ
బులి నొచ్చివచ్చి యా భూరుహాగ్రహమున
నున్న లుబ్ధకుఁ గని యురుకోపవహ్ని
గన్నులఁ గ్రమ్మ నుత్కటధూమలతలు
ముకుకృన వెడల సముద్ధతి వృక్ష
మెక్కఁజాచుచు శాఖ లిడఁగ మించుచును,
నఱిముఱి సూఁచుచు, నఱచుచుఁ, గఱచి
కఱచివైచుచు, నౌడు గఱచుచు, జుట్టి
చుట్టివచ్చును, మూల్గుచును, బోరసఱచి
బిట్టప్పళించుచు, బిల్వవృక్షంబు
తో వాల మడఁచుచుఁ, దొట్రుకొల్పుచును,
బోవక యిమ్మాడ్కిఁ బులియున్కి గలిగి
తా నెక్కవచ్చునే ధర నెట్లుఁ బులికి
నైన వృక్షాగ్రంబు ననకి వ్యాధుండు
ప్రాణభయంబున భ్రమసి యాత్మీయ
ప్రాణ పాతోపతాపమున వ్యాఘ్రంబు
నెట్టుకు బోనెర, దెగురు, మ్రానెక్కుఁ,
బట్టుఁ, జంపును, దన్ను భంగించు, నొంచు
నంచుఁ దదీయ బిల్వావనీరుహా స
మంచిత స్కంధంబ హరమూర్తి గాఁగఁ
బులికిఁ జిక్కెత్తిననని పొగులుఁ, భచ్చోక
జలబిందుతతులు మజ్జనజలంబులుగ

ముఖువైన లేతపత్త్రిరిఁ ద్రుంచివైవఁ
దఱిఁదఱి నది నిరంతరపూజ గాంగ
భువిఁ జుట్టుముట్టెడు పులి యట్లు తిరుగ
ననియు సవ్యాపసవ్యములుగా మీఁద
నాహార మాఱీతి నందు లేకునికి
నూహింప నదియ తా నుపవాసముగను
బనుగాన మృగముఁ దప్పక చూచిచూచి
కనుమూయకునికి నిక్కమ్ము జాగరముగఁ
బులి యేను జంపకపో నని యుండఁ
బులి కోటి యాతండుఁ బోవగా కునికిఁ
దవిలి యకామకృతమునఁ జెంచునకు
శివరాత్రి యది యట్లు సెల్లె జాగరము,
గందర్ప హరుఁ డిట్లు గైకొనె, నెఱుకు
బొందితోడన కొనిపోయెఁ; గావునను,
నెల్లరాత్రులయట్ల యీ శివరాత్రిఁ
జెల్లునే కవితావిశేషతఁ బొగడ
శివరాత్రిమహిమ యీ శివుఁ డెఱుఁగాక
తపలి యుట్లొప్పు సంధ్యాకాలమునను
నత్యర్థిఁ బ్రజలు తత్సంయము లడు దోనయ్యా
నిత్యలింగార్చనా నియమముల్ దీర్చి
శ్రీలింగచక్రవర్తికి భక్తసత్త్రి
యాలోలు శ్రీ మల్లికార్జున దేవు
సంధ్యాయతాంభోదసద్వర్ణ జూటు
సంధ్యోచితార్చనాసంతుష్టుఁ జేసి
యంతఁ దదీయ నితాంతోపమంద
పాంతరంబునఁ బురాభ్యంతరంబునఁ బు
రాంతర దేవాలయాంతరంబునఁ బు
రాంతికోద్యానవనాంతరంబులను,
భాస్వర సద్భక్తభవనంబులను, స

రస్వతీవాహినీ ప్రాంతదేశముల,
సుఖతర గోపుర చూడా గృహముల,
శిఖరశృంగాటక సిద్ధశృంగముల,
రమణ సారంగేశ్వరము, హాటకేశ్వ
రమును, పాపవినాశముఁ, గిన్నరేశ్వ
రమును వారాహేశ్వరమును, సిద్ధేశ్వ
రము, నాదియగు నీశ్వరస్థానములను
సల్లలితంబుగా సమయమిప్పించి,
పెల్లుగా ముగ్గులు వెట్టంగఁ బనిచి,
విదితలింగార్చనావేదికాస్థలులఁ
బదపడి బిందియల్, వడిగంబు, లర్ఘ్య
పాత్రలు, నూతనఖాండముల్, వంశ
పాత్రలు, ఘంటలు, బహుధూపదీప
పాత్రలు, బహుహోమపాత్రలు రజత
పాత్రలు, పిడెకములు, ఫలములుఁ, గజ్జ
ములు, సుగంధద్రవ్యములు, సితపుష్ప
ములు, పూలికాసీకము, లఖండ బిల్వ
పత్తిరి, హస్త్రాలుఁ, బంచామృతములు,
సుత్తమాక్షతలు, పవిత్రదనాపటలు,
నతిసు[illegible]చందనంబు, [illegible], మూసలము
వత్తి, సు[illegible]తమును, [illegible]త్రిధూపంబు,
మలయాచలంబును, మహిసాక్షి, సుద్ధి
గలహంసధూపంబుఁ, గామికామోద
మును మనోహరధూపమును, దివ్య ధూప
మును, జనవల్లభామోదధూపంబు
లాదిగా ధూపంబు లానందవర్తి
యాదివత్తులును గృహాంగవస్త్రాది
[illegible]హాసస్సుటం చేగూడ శరభ క్షత్రతటి కు
పాసనామతి సమర్పణసేసి, మఱియు

నేవస్తువులు ప్రియం బెప్పుడువలయు
నావేళ వారికి నభిమతార్థములు
సేయుచు నిబ్బంగి శివరాత్రి పర్వ
మాయతమతిఁ జెల్ల నంత భక్తులకుఁ
గలపంబుఁ బన్నీరుఁ గస్తూరి సాందు
నలిఁ గూర్చి సమ్మార్జనము సేయువారుఁ
కళికలు, వత్త్రిముల్, గమలముల్, బంధ
ములు, ముకుళంబులు, ముత్తియంబులును,
నిగ్గారుఁ బంచవన్నియలతోఁ గూర్చి
ముగ్గు లత్యాశ్చర్యముగఁ బెట్టువారుఁ,
దలకొని సంతతధారాసహస్ర
కలశాభిషేకముల్ గావించువారు,
శిష్టాగమోక్త విశిష్టప దనర
నష్ట విధార్చనం బలరించువారు,
నలి నుబ్బి భక్తగణప్రకరంబుఁ
దలఁచుచు ధూపార్పితము సేయువారు,
మంగళంబగు భక్తమండలి కనుచు
రంగత్కరముల నారతు లెత్తువారు,
నంచితభక్తహితార్థకల్పనలఁ
పంచభక్ష్యాదు లర్పణసేయువారుఁ,
గర్పూరసహితంబుగా విడియంబు
లర్పించువారు, సొంపారంగ నిట్లు
నాల్గ వసరముల నలి శివరాత్రి
నాల్గుజాములును సన్మతిఁ జేయువారుఁ,
ప్రేమతో నాపగల్ లేయును జాము
జామున కర్చనల్ సరిసేయువారు,
ఘటిక లర్ధ్వదియును గలయఁ జెన్నారయ
ఘటికావసరములు గల్పించువారు,
సముచితాష్టోత్తరశతసంఖ్య నవస

రములు సంకల్పించి రతిఁ జేయువారు,
నష్టోత్తరసహస్ర మపసరంబులు వి
శిష్టతమైనట్లు సెల్లించువారుఁ,
దళిఁ బూన్పుపూజయుఁ దసరుపూజయును
వజలఁ బూన్పంగ వలవఋచుపూజయును
గా నిరంతరపరికల్పితార్చనలు
నానందలీలఁ బాయక చేయువారు,
రతి షోడశోపచారక్రియార్చనలు
సతతంబు నతిభక్తిఁ జలిపెడువారు,
నాది ఋగ్వేదాది నలవారుసూక్తు
లాదిగా బ్రాహ్మణాద్యంతసూక్తములుఁ
దుదిగాఁగ రుద్రసంస్తోత్ర సూక్తములుఁ
జదువుచుఁ బొదలి ప్రశంసించువారు,
రుద్ర విధాననిరూపిత న్యాస
భద్రాత్మసంజ్ఞలు వదుకొకంటికిని
గ్రమ మొందఁ జమకసూత్రంబు లేకాద
శములు నొండొంటికి శాంతులుగాఁగఁ
దవిరి ఛందోఋషి దేవతా శక్తు
లవి గూర్చి బీజాక్షరాన్వితం బులుగ
నద్రతి శ్రీశతరుద్రంబుఁ గూర్చి
రుద్రంబునంద పురుషసూక్తములును
నా యజుర్వేద వేదాంత సూక్తములుఁ
బాయక చదువుచుఁ బ్రబుతించువారు,
సామంబు దా వేద సామరహస్య
సామాదులగు నవ సామాదులందు
నను నీశ్వరప్రశంసా పరసూక్తు
లనుషక్తిఁ జదువుచు నగ్గించువారుఁ,
బ్రవిమలాథర్వశిరశ్శిఖాదులను

చవిలి శ్రీపాశుపతవ్రత వరదు
శ్రీరుద్రమహిమయుఁ జెప్పుసూక్తములు
వారక చదువుచు వర్ణించువారు,
సంచితబాణ గద్యాక్షరగద్య,
వంచగద్యాదులుఁ బటుగణాడంబ
రంబు, వర్ణాడంబరంబు, వ్యాసాష్ట
కంబును, శ్రీనీలకంఠ స్తవంబు,
శ్రీరుద్రకవచంబు, శారభంబును, మ
యూర స్తవము, హాలాయుధ, మనామయము,
మలహణంబును, మహిమ్నంబను స్తవము
మలయరాజీయంబు, మౌనిదండకము,
సుత్తిమూలమగు మహాస్తోత్ర సూత్రముల
శతకంబు, శివతత్త్వసారంబు, దీప
కళిక, మహానాటకము, నుదాహరణ
ములు, రుద్రమహిమయు, ముక్తకావళులు,
గీతసూక్తములు, భృంగిస్తవంబులుఁ, బు
రాతన మునిముఖ్య రచితాష్టకములు,
హరలీల, రుద్ర సహస్రనామాదు,
లరుదొంద( జదువుచు నంకించువారు,
నరుదగు దాసయ్య నలువత్తుమూఁటు
సరితంబులును, శ్రీ బసవపురాణంబు
నేలలువెట్టంగ నింపుసొంపారు
శైలిచేఁ గ్రాలుచుఁ జదివెడువారుఁ,
జాతుర్య మెసగఁ బసవదండనాథు
గీతంబు లాదిగా గీతాదులైన
సకలపురాతనచారుగీతములుఁ
బ్రకటించి ప్రకటించి పాడెడువారుఁ,
జదువులఁ బాటల సంగతిలేమిఁ
బొదలి మాటలయంచ పొగడెడువారు,

నామాటలకు మనం బందమి మల్ల
యా! మల్లయా! మల్లయా! యనువారు,
జయ! జయ! యఘె! జయ! జయ! జయ! యనుచు,
జయవెట్టి మ్రొక్కుచు సతిఁ బేర్చువారు,
నలరుచుఁ బడిహారులట్ల యందఱును
లలి నుబ్బి "చాంగు భళా" యనువారుఁ,
దనరుశబ్దము గద్గదంబున వెడల
కునికిఁ దప్పక చూచు చుండెడువారుఁ,
జూపులు శివసుఖాశ్రుల వెల్లి ముంప
నాపోవ కెగయుచు నాడెడువారు,
నెగయంగ నెగయంగ నెంతయుఁ గాళ్లు
నెగయక యన్నెక్కి యుల వ్రాలువారు,
నాట లాత్మీయసర్వాంగవిస్ఫురణఁ
బాటి దప్పినఁ జొక్కి పడియెడువారుఁ
జప్పట్లు వెట్టంగఁ జక్కన లేచి
యప్పాట వెడయాట లాడెడువారు,
వేడుకతోఁ జిందు వాడంగ నుబ్బి
కోడంగియాటలఁ గునిసెడువారుఁ,
బ్రన్నని నిజదేశభాషల జతుల
కన్ని కోడంగాట లాడెడువారు,
భ్రమరముల్ సాళెముల్ బయకముల్ మెఱసి
రమణఁ బంచాంసి పేరణి యాడువారు,
బ్రమథ పురాతన పటుచరిత్రములుఁ
గ్రమ మొంద బహునాటకము లాడువారు,
లలితాంగ రసకళాలంకార రేఖ
లలవడ బహురూప మాడెడువారుఁ.
గరణముల్ మెరవణుల్ గతులుఁ జిత్రములు
నరుదుగ వెద్దంగ మాడెడువారు,
నమరాంగనలు దివి నాడెడు మాడ్కి

సమరంగ గడలపై నాడెడువారు,
నా వియద్గతిఁ బక్షులాడెడునట్టి
భావన ప్రోకులపై నాడువారు,
భారతాదికథలఁ జీరమఖుగుల
నారంగ బొమ్మల నాడించువారుఁ,
గడు నద్భుతంబుగఁ గంబసూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు,
నాదట గంధర్వయక్ష విద్యాధ
రాదులై పాడెడు నాడెడు వారు,
విధమునఁ బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడ నట్లాడు

* * * *

సనలుండు శాకపాకాదు లొనర్ప,
వాలారుఁ బురితలవరులలోఁ గలసి
'చాలు బళా' యంచు జముఁడును గొలువ,
బరిచర్య లొనరించు పడిహారు లట్టు
గరమర్థి బడిపనుల్ నిబ్బృతియుఁ జేయ
సమ్మార్జనము సేయు జనులలో వరుణుఁ
డిమ్ముల సమ్మార్జనమ్ము సేయంగఁ,
గసవులు దుడుచు కింకరులలోఁ గలిసి
శ్వసనుండు నటమున్న కసవులు నూఁక,
భువిని ముగ్గులు వెట్టుపుణ్యులలోన
నవరత్నముల ముగ్గు నరవాహుఁ డిడఁగఁ,
దవిలి తాండవ మాడుతపసులలోనఁ
దవిలి యీశానుండుఁ దాండవం బాడ,
బాణాసురాది కుంభధైత్య వితతి
క్షోణీశ్వరులతోనఁ గూడి భజింపఁ,
బండితసత్కవివిప్రవరులఁ గలిసి
చండకీర్త్యాదులు సంస్తుతుల్ సేయ

నరయఁ దక్కిఁన దానవామరముఖ్య
గరుడ గంధర్వ కిన్నర సాధ్య సిద్ధ
వరగణావళి కోఁటి వరుసఁజవాకి
వరుసనఁ బనిసేయ బానసంబునకు
సురగిరిముఖ్యభాసురతరగిరులు
పురవరగిరి శృంగములక్రియఁ గొలువ,
సురతరుముఖ్యభాసురతర తరులఁ
బురితరువరచయంబులలోనఁ గొలువ
సురధేనుముఖ్య భాసుర ధేనుతతులఁ
బురిధేనువులలోన బెరసి కొల్వంగ,
సురమణిముఖ్యభాసురమణితతులఁ
బురమణితోరణంబులలోన కొలువ,
ఖ్యాతి భాగీరథీ గంగాదినదులఁ
బాతాళగంగాను బంధమై కొలువ,
నేడువార్ధులలోని యేడుద్వీపములు
వేడుకఁ బురివీధివీధులఁ గొలువ,
నాకాంక్ష ముప్పదియాఱుదత్త్వములఁ
బ్రాకారహర్మ్యరూపంబులై కొలువ,
ముల్లోకముల నాథు మల్లికార్జునుని
ముల్లోకములలో సమున్నతి కెక్కఁ
సచరాచరములు శ్రీశైలఁబుమీఁది
సచరాచరాదుల చాడ్పునఁ గొలువ.
సుస్థితి మల్లికార్జునదేవదేవు
నాస్థాన మిట్లు సెన్నారంగఁ బరుస
సంతసంబున నుఘే జయజయ యనఁగ
నంత సూర్యోదయం బయ్యె నెట్లనిన,

## సూర్యోదయ వర్ణనము

మందరకందరసుందరనియ్యత
స్పందఘం ఢగు సుకేశుని నసహ్యమున

నొప్పమిసేసిన తప్పున కలిగి
మెప్పొడి. ఋది యంచు నప్పురవైరి
నిప్పులు గన్నుల నుప్పతిల్లంగఁ
దప్పక చూచిన నప్పుతు ధరణిఁ
దాళఫలములు వాతూలచేఁ బడిన
చాళి దొప్పన పడి జలజమిత్రుండు
వడిదొల్లి దొల్లి శ్రీ వారణాసికిని
గడుఁ జిత్రమని నరుల్ గమిగట్టి చూడ
నప్పుడ పోయి యుద్యద్భక్తియుక్తిఁ
దప్పక శివునాజ్ఞఁ దలమోచి యచట
నవ్యయు నభవు బాలార్కేశనామ
దివ్యలింగబుఁ బ్రతిష్ఠఁ గావించి
చిరతపోనిష్ఠ భజించి మెప్పించి
హరునిచేఁ దొంటిసూర్యత్వంబుఁ బడసి
ఖ్యాతిగాఁ దొల్లింటిపగిదిన భానుఁ
ఏతెంచి యుదయాద్రి నెక్కినమాడ్కి
నంత సూర్యోదయం బగుడును బరుస
యెంతయుఁ బ్రీతితో నిట్లహర్నిశము
నవిరళమతి మల్లికార్జునుమ్రోల
శివరాత్రిపర్వంబు సెల్లుటఁజేసి
భావింపఁ దమతమభవరాత్రు లెల్ల
వేవినక్రియఁ బ్రొద్దు వేవె లెందనుచుఁ
బాతాళగం గాడఁ బాటెడువారు
బ్రాతిగా శిఖరేశ్వరం బేఁగువారుఁ
బారణ సేయ నొప్పఁగఁ బోవువారు
నూరక తమ తమ యూ ళ్లేఁగువారుఁ
దలఁపుల శ్రీపర్వతప్రదక్షిణము
నెలమి సంకల్పించి యేఁగెడువారు
వళులు వసంతోత్సవము నొయ్యఁ జూచి

మఱికాని పో మని మసలెడువారుఁ
దప్పక పంచరాత్రం బున్కి సాలు
నొప్ప శ్రీగిరినంచు నుండెడువారు
దండివిరక్తిమైఁ దత్పరంబునను
నుండెడువారునై యుండంగ నంతఁ
బండితదోనయ్య పంచరాత్రంబు
లుండంగఁ దలఁచి సూర్యోదయవేళ
నలిఁ దీటఁకొన మల్లినాథుసహస్ర
కలశాభిషిక్తునిగాఁ జేసి మఱియుఁ
దడయక పంచామృతస్నపనంబు
నెడనెడధారగా నెత్తి మ్రొక్కుచును
గ్రమమున నుష్ణోదకముల గంధోద
కములను మఱి జలకంబు గావించి,
సంధిల్లఁ దడియొత్తు శంభున కిచ్చి
బంధురాంబరమహాభరణముల్ పూన్చి
ఖ్యాపితభక్తి నక్షత గంధ పుష్ప
ధూపదీపాదు లుత్సుకత నొనర్చి
యంచితప్రీతి మహానివేద్యముగఁ
బంచ భక్ష్యాదు లేర్పడ సమర్పించి
శిష్ట సద్భక్తరాజికి గండు మీఱ
నిష్టాన్న పానాదు లెలమి సంధించి
కర్పూరసహితంబుగా విడియంబు
లర్పించి నవ్య పుష్పాంజలు లిచ్చి
వరుస వేవేమ్రొక్కు వలగొనివచ్చి
హరుఁ బెక్కుభంగుల నభినుతింపుచును

## దోనమరాజయ్యకు మల్లికార్జునుఁడు ప్రత్యక్షమగుట

గనుమూయునంతన కలయునుబోలెఁ
ధన చేయు భక్తితత్పరతకు మెచ్చి.

మదనసంహారుండు శ్రీమల్లికార్జునుండు
వొదలుచు వృద్ధతపోధనులీల
నరుగు దేరంగ శరణార్థి సేయుచును
గురుమూర్తి దనయొద్దం గూర్చుండం జూచి,
"యెటనుండి వచ్చితి రేయూరు మీర
లిట యేంగుదెంచితి రెంతగాలంబు"
నావుడుం దపసి "దోనయగారె మీరు
శైవలోకమున కాచార్యుండు పండి
తారాధ్యవిభుండు లెస్సైయున్నవాండె
వారును మేముం బూర్వస్నేహితులము
నా పండితుండు మేలై కూర్చుమాకు
మా పేరు సర్వజ్ఞమల్లికార్జునుండు
ననయంబు సిరిగిరియం దటు గూడ
వనముల గిరుల దుర్వారకాంతార
ఘనబిలాంతరమహా గహ్వరంబులను
నునికి యీ శివరాత్రియొప్పుం జూడంగ
నరుగుదెంచినవార" మనుడు దోనయ్య
గరపద్మములు మోడ్చి "ఘనుండ! సర్వజ్ఞ!
చూచిన మునువిన్న చోద్యముల్ గలుగు
నా చెప్పంజూడ శ్రీనగమున" ననుడు
రమ్మని దోనమరాజుం దోడ్కొనుచుం
గ్రమ్మర బిల్వవనమ్ము మధ్యమున
సరసత నం దొక్క శైల శృంగమున
విరచింపం జను దీపవృక్ష మెక్కించి
శిరమునం జేయిడి శ్రీగిరిం జూడ
గరతలామలకమై కానవచ్చుటను
నద్భుతాక్రాంతాత్ముం డగుచు దోనయ్య
సద్భక్తిం దపసికి శరణార్థిసేసి
"నెడనెడ నేంగంగ నేటికిం జూడం

బడసితిఁ బర్వతం బంతయు నేఁడు"
ననుడుఁ దపోధనుం "డద్దేవపురము
ఘనతరంబగు హేమకలశముల్ గుళ్లఁ
గోటలుఁ గొమ్మలు గోపురంబులును
నాటకూటమ్ములు నామల్లికేశు
ప్రాసాదమును మంటపంబును క్షేత్ర
వాసులై చనుభక్తవర్గంబుఁ జూడు,
హాటకేశ్వర మదే యందు సద్భక్తిఁ
బాటి కెక్కినవీరభక్తవర్గంబు
వీరశంకరుఁడును వీరభద్రయ్య
వీరభోగయ్యయు వీరదేవయ్య
మలహర సద్భక్తి మతి గల్గినట్టి
పొలతి చాకలదేవి పోరిఁ బ్రభాతయ్య
మఱియు వీరాదిగా మహితసద్భక్తి
నెఱిఁ బ్రతిష్ఠించిన నిష్ఠలఁ జూడు,
శిఖరేశ్వరముఁ జూడు శ్రీనగేంద్రంబు
శిఖరంబునను ముక్తి శిఖరమై వెలుఁగు
నిష్టకామేశ్వర మిల్లిదే చూడు,
మష్టసిద్ధులకు నిజావాస మిదియు
వేడుదినంబు లయ్యాళు భజింప
వేడుకఁ గామార్థ్యవిభవంబు లొసగు

**కర్మహారి మహిమ**

నిదె చూడు కర్మహారేశ్వరం బనఁగ
మదనాంతకుండ తన్మహిమ యెఱుంగు
నచ్ఛామశృంగంబునం దొకపాము
చచ్చి తద్దేహంబు ప్రువ్చియున్నెడను
నఱిముఱి నొకగ్రద్ద యాపాముశవము
గఱచికొంచును దీవ్రగతి మీఁది కెగయ

వాతోపహతి నందు వడి రెండుప్రువ్వు
లేతెంచి కర్మహారేశ్వరంబందు
వడి జలంబులలోనఁ బ్రాణముల్ విడిచి
పుడమి బల్లహువంశమునఁ బ్రభవించి
యాపుణ్యఫలమున నతివయుఁ బతియు
నై పూర్వజన్మంబు ననిలోహతిని
గర్మహారేశ్వరోద్గతసరసీ వి
నిర్మలవారి మునింగి చచ్చుటయుఁ
బ్రవిమలతత్పుణ్యపటుఫలప్రాప్తి
భువి బల్లహునివంశమునఁ బుట్టుటయును
జాతిస్మరత్వానుసంధిగాఁ జేసి
యీ తెఱంగంతయు నిద్దఱు నెఱుఁగి
వేగంబఁ సకల నియోగంబుఁ గొలువ
శ్రీగిరి కేతెంచి చెలువయుఁ దాను
బల్లహుఁ డత్యంతభక్తిసంయుక్తి
మల్లికార్జును మహామహుని దర్శించి
భాసురదివ్యప్రభా భాసురముగఁ
బ్రాసాదమును మండపంబు బానసము
మఠముఁ దదంతికమఠముగా నొక్క
మఠము గల్పించి యీమఠము నిండంగ
మరకతమౌక్తికమణిపుష్యరాగ
వరవజ్ర విద్రుమ వైడూర్యముఖ్య
భూరిరత్నావళుల్ ప్రోఁకలు వోసి
చారుషోడశవర్ణ సంపూర్ణమైన
ప్రతిలేని తనయింట బంగరుధనము
శతసహస్రార్బుదసంఖ్యను నిలిపి

* * *

ఘనభక్తు లక్కజం బని యెన్న వేయు
నన నేల తానును నతివయుఁ దక్క

నటు గూడఁ దన దేశ మంతయు నపుడ
పటుభక్తి నీశ్వరార్పణము గావించి
తరుణి నీక్షింపఁ దత్సతియును నట్ల
యరసు మఠంబున నట్లొక్కమఠము
వెండికట్టించి యవ్విభునకుఁ దనదు
బండరు వఖిల సంపద్వస్తుసమితి
యఖిలరత్నావళు లఖిలాంబరములు
నఖిలాభరణములు నందు వెట్టించి
ముక్కంటి శరణంచు ముగుదయుఁ దాను
నొక్కచీరయుఁ గట్టి యోగి బల్లహుండు
"ఘోర దుర్వార సంసార వారాశి
పారమొందింపుమో పర్వతనాథ!
పాయనిదుష్కర్మ పాశబంధములు
గోయవే దేవ శ్రీకుధరాధివాస!
యెల్లగాలము నిట్టు లిరువురపనులు
సెల్లించుకొనవయ్య! సిరిగిరినాథ!
వఱలంగ వీరు నా వారని మమ్మ
మఱవకుమయ్య శ్రీ మల్లికార్జునాథయ్య!
యిల వేయు నెన్నంగ నేల నాయిచ్చ
సలుపు మోజియ్య! శ్రీశైలవల్లభుఁడ!"
యనుచు దేవియుఁ దాను సాష్టాంగ మెరఁగి
చనుదెంచి యెక్కినచౌదంతితోన
యెదపక కర్మహారేశ్వరంబందు
బడియు గౌరీశుగర్భము నందు సొచ్చె,
బల్లహుండు శివుని భజియించునపుడు
సల్లలితాంగియు శంభుని దలఁచు
భవుభర్గు నీశుని బార్వతీపతిని
శివు నభిషేకంబు సేసిన యన్ని
పాలిహ్రదంబులోపల నూట వెడలఁ

బాలూట్ల యన భవిఁ బరగిఁదా మఱియు
బడి కామితార్థముల్ వడసినవార
లడర ననంతంబు లట్లును గాక
యమ్మూఁడుశృంగంబులందును భూరు
హమ్ములు మూఁడున్నవని యవె చూడు,
నరుఁ డెవ్వఁడే దర్శనం బాచరింప
నరిది యాకారత్రయంబు సిద్ధించు,
నొకచెట్టు మొదల నందొక చెట్టునడును
నొకచెట్టు తుదియు నుద్యుక్తి ముట్టినను
ధర స్వర్గమర్త్య పాతాళలోకముల
చరితంబు లెల్ల నిశ్చయము గాన్పించు:
నొక చెట్టు మూలంబు నొకచెట్టు పత్ర
మొకచెట్టు పుష్పంబు నొగి ధరియింప
రూఢి బ్రహ్మోపేంద్ర రుద్రుల ప్రోల
వేడుక నేప్రొద్దు విహరింపుచుండు,
నొకచెట్టుకాయయు నొకచెట్టుపండు
నొకచెట్టుబీజంబు నొక్కట నమలఁ
దివుట నుత్పత్తి స్థితి లయముల్ దక్క
శివపురంబున నుండు శివగణలీలఁ
గామించి యెవ్వఁడేఁ గాలత్రయంబు
నామూఁడుదరువుల నాహార ముడిగి
నలి మూఁడుసేసి దినము లాగమోక్త
కలితోపచారసంగతి భజియింప
సారూప్యసామీప్య సాలోక్యమహిమ
లారంగ సిద్ధించు నదె శివమహిమ
దా నెట్లు గాన్పించెఁ దరువు లందేని
మానక పాలూట్ల మల్లికార్జునుని
నిత్యంబు బాలను నేతఁ బెర్వునను
ప్రత్యేక ఘనియు ముప్పందుము నంధు

సెలువార జలకంబు సేసి, సహస్ర
కలశాభిషేకంబుఁ గావించి, గోఁగుఁ
బూవులుఁ దామరపూవులుఁ గలువ
పూవులు వేయేసి పూవులు, గుగ్గు
లమును మూఁడేసి పలంబు లర్పించి
ప్రమితి వేయేసి హారతు లర్థినెత్తి
పాయసంబులుఁ బంచభక్ష్యముల్ షడ్ర
సాయతాన్నములు సమర్పణసేసి
యాసక్తి మూలపంచాక్షరి మూఁడు
సేసి వేలుజపంబు సేయంగమూఁడు
దినముల కీశుండు దివ్యదృష్టియును
ఘనతరజ్ఞానంబుఁ గరుణించునపుడు
గానంగవచ్చు వృక్షత్రయం బందు
దా ననేకములు సోద్యములు వెండియును
ననుపమబిల్వవనాంతరం బిదియు
విను పంచయోజన విస్తీర్ణమందు
వ్రేలెంట నొక్కొక్క వృక్షంబు గలదు
గ్రాలు దివ్యౌషధాకారంబు లవియు,
నల్లెంట నొక్కొక్క నవలత గలదు
సెల్లుసాధక జనసేవ్యంబు లవియుఁ,
జుట్టెంట నొక్కొక్క చోద్యంబు గలదు
నెట్టన్న వారికి నెఱుఁగంగరాదు,
జేనెంట కొక్కొక్క శివమూర్తిగలదు
దా నభిమతఫలదత్తంబులవియు,
మూరెంట నొక్కొక్క మునిపల్లె గలదు
భూరిశ్రుతిస్మృతి స్ఫురితంబు లవియు,
జేతెంట కొక్కొక్క సెలయేఱు గలదు
ఖ్యాతదివ్యాంగ నాకలితంబు లవియు,
బారెంట నొక్కొక్క పర్వతముండు

నారూఢి దివ్యరత్నాంగంబు లవియు,
గూగెంట నొక్కొక్క కూటంబు గలదు
యోగీంద్రసిద్ధనియుక్తంబు లవియు,
నంతంత నొక్కొక్క హర్మ్యంబు గలదు
సంతత ప్రమథ ప్రచారంబు లవియు,
బాటెంట నొక్కొక్క భవనంబు గలదు
మేటివిరక్తుల కూటంబు లవియు,
నామట నొక్కొక్క యధ్వంబు గలదు
గామితలోక సంకలితంబు లవియు,
నదియునుగాక ఛాయాచ్ఛత్రమనఁగ
మొదలు ప్రాఁకున లేదు, మొగులును లేదు
వదపడి యానీడపై బాటునరుల
కొదవంగఁ గలవు నిష్టోపభోగములుఁ,
దరు లిదే చూడు మిత్తఱి నీడలేదు
ధర నదృశ్యకరణి దానిమూలంబు
మోహినీగజ మదె ముందఱిదెస స
మాహితపృథులశిలాకారగజము,
సాధకుఁ డెవ్వఁడే సాధించియెక్కఁ
గ్రోధిల్లుఁ జను నెట్టుకొను ఝూళిసేయుఁ
గుప్పించు నుఱుకుమై నొప్పించు ననువుఁ
దప్పింపఁ దల వంచు నుప్పరం బెగయుఁ
బ్రల్లన యల్లంతఁ బడుఁ జిఱ్ఱుదిరుగు
నల్లార్చు ఘిఱ్ఱుఘిఱ్ఱను బాటుఁ దాటు,
నిట్టు విజృంభించి యిట యట వడఁగ
బిట్టోడి యలుఁగక బెగడక చనక
తలఁగక తలరక తల్లడపడక
ఝలుగక లెక్కసేయక డిల్లపడక
వ్రాలక కొంకక వడఁకక యున్నఁ
గ్రాలుచు మోహినీ గజ మంత మెచ్చి

సర్వసిద్ధులు నిచ్చు సాధకులకును,
గుర్వగా మఱియెల్ల గుధరంబు లీవు
నీవనమధ్య మహీధరాగ్రమున
భావించి చూడు బిల్వావనీరూహము
నామహీజముక్రింద నదె బిల్వవనశి
రోమణి బిల్వేశ్వరుని శివాలయము
సాధకుం డద్దేవు సప్తరాత్రముల
బాధితనిష్ఠమైఁ బాయక కొల్చి
భవుదీపతైలసం భావితాంజనముఁ
దివిరి తాల్పంగ దివ్యదృష్టి వొల్పారుఁ
గామారినగరోపకంఠ దేశమున
నామఱి యొక్క దద్దడముండు నందు
లో నొక్క క్షేత్రపాలుని స్వరూపంబు
గానంగ మఱిధానిలోన భైరవుఁడు
నెడనెడ సాధకుం డేదేరఁ దాను
గుడియుఁ బెర్గుచు నుప క్రోదోత్కటాగ్ని
ముక్కునఁ బొగలు సముద్ధతి వెడల
నెక్కొన్న మొగమున నిప్పులు రాలఁ
గరముబ్బి మంటలుఁ గన్నులగ్రమ్మఁ
దెరలుచు దేహంబుఁ దెకతెక నుడుక
మూవల గంటల మ్రోఁత నొక్కట ది
శావలి యద్రువఁ జాచాయని చప్ప
రించుచు నొరలుచు రేఁగుచుఁ దత్త
రించుచు రాకురా కంచును గహక
హాట్టహాసధ్వను లద్రులఁ జెలఁగఁ
గట్టిరువడి భీతి పుట్టింపనిలువ
కాభైరవుని భీకరాకారమునకుఁ
దా భయంపడక సాధకుఁడు నవ్వుచును
నుబ్బుచు నార్చుచు నురువడించుచును

బొబ్బలు వొడుచుచుఁ బొంగుచు మాఱు
గబ్బరించుచుఁ గలఁగకు కల్ల కనుచు
నిబ్బరం బాడుచు నిక్కుచు నంత
గ్రబ్బెల యనుమను గచ్చించుకొనుచు
నబ్బితి నా కంచు నట నిల్వు మనుచుఁ
బఱతెంచి యెగసి యా ప్రతిమశిరంబు
వెఱ పింతయును లేక విఱుఁగఁ దన్నుడును
ధర మిట్టిపడి యంత శిరము నవ్వుచును
బిరుదులబిరు దన పృథు శౌర్యమునకు
సత్వంబునకు సాహసమునకు నిర్భ
యత్వంబునకు నుదారత్వంబునకును
మెచ్చితి దలకీలు వుచ్చితి మార్గ
మిచ్చితి బిల మిష్టు సొచ్చితి గాన
యిక్కడ నన్ను జయించిన పిదప
నెక్కడి దెక్కడి యెదు రింకనీకు
వారక నాగళద్వారంబు బిలము
ద్వారంబుఁ జొఱుచొఱు దడయకయుండు
నల్లన బిలములోఁ తరసెద ననక
యెల్లన ధరఁ జేతు లూనెద ననక
మెల్లన తాపలు మెట్టెద ననక
ప్రల్లన యురుక కపాయ మౌ ననక
తనలేని భైరవు దండిరుండంబు
గనగహ్వరం బాదిగా లోఁతు నూఱు
మగనిల్వువెడలుపు మఱి తత్ప్రమాన
మగుబిలముఖమునం దఱిముఱి నుఱికి
యంత దక్షిణముఖంబై యేఁగనేఁగ
నంతకంతకుఁ జాల నన్నువయైన
బిలమున కడ్డంబు వెట్టినయట్టి
తలుపుభావమున నంతకుమున్న వచ్చి

కుపీతవేషంబునఁ గుటిల భైరవుఁడు
దపసియై యున్న సాధకుని వీక్షించి
యిటనుండి పొదపొద యిట్లు గాదేని
యిటయొండె రమ్ము దె ర్వెమ్ము లెమ్మనుచు
'నేలరా కొడుక నీ కింత దల్లడము
సోలమిఁ జూడు నీ సాధకత్వంబు
నిటుగాని నీ బిరు దెఱుఁగంగ రావె
కటకటా ! శరణార్థి గఱవె జిహ్వకును
గరములు వంగవే శిరము చక్కఁటికిఁ
బరమదారిద్ర్యమే భక్తి నీమతికి
దపసుల మేము పెద్దలము పెక్కేఁడు
లుపవాసములు వాయ కున్నార మిచట
మము లేబరము సేసి మఱిపోయి పడయు
నమరత్వమైన నీ కది మంచియదియె
యింతన పడసితే యిష్టార్థసిద్ధి
యంతరం బెఱుఁగవె యది యేల వేయుఁ
జెప్పెద నామాటఁ జెవియొగ్గి వినుము
నిప్పటియట్లకా దిటఁమీద మనసు
నదె పులిముందఱ నడ్డమున్నదియు
యిదె నూఱుమగనిల్వ లీయున్న బిలము
మున్ను వెనుకఁ గొట్టు ముందఱ నూయి
నున్న చందమునఁ గార్యంబున్న యదియు
దిగనుర్కవచ్చుఁబో డిగ్గుడు గాన
యెగయ నూర్కగసిల్వ లెల్లెక్కఁబిలము
దరులు ముందఱ లేవు దాపలు లేవు
నరయ లోఁతెంత దా నంత వెశల్పు
పోరాదు వెన్కకుఁ బోక ముందఱికిఁ
బోరాదు బిలములఁ బోయెద మనినఁ

బూని నీ పీఁ పొద్దు పూజింప లింగ
మీనివి యాబిలం బినోపునయ్య
పృథివి సద్భక్తు లేబిలములు సొచ్చి
ప్రథితదృష్టాదృష్ట ఫలసిద్ధిఁ గనిరి
పర్వతకల్పంబుఁ బట్టియే యింక
గర్వించి తలక్రిందుగాఁ బడియెదవు
గుడిచెతు కట్టెడు కొమరుఁబ్రాయమునఁ
గొడుక యిచ్చట నేమి నుడవ వచ్చితివి
సలమున వచ్చితి సావనకాక
యిల నిష్టసిద్ధుల కిదియె శ్రీగిరికి
బిలము సతుర్ద్వార బిలమును వృషభ
బిలమును ఖేచరబిలమును బాప
బిలము నాదిగ గిరిఁ బేరొక్కన్నబిలము
లెలమి నిర్వదివేలు నేణ్ణూఱుగోట్లు
భుక్తిప్రదస్థానములు నూఱుగోట్లు
ముక్తిప్రదస్థానములు వేయుగోట్లు
నలరి యేకైక కార్యప్రదస్థాన
ము లనంతకోటులు గల వందులోన
విను కొన్ని బిలములు విస్తరించెదను
జనువాఁడ వెట్లును జనియెదుగాక
యనవుడు మూర్ఖత నరుగంగ నేల
ననుచు నాకర్షింప నభిముఖుం డగుడుఁ
దపసి సెప్పఁదొడంగెఁ దా నొక్కనాఁడు
విపినాతరంబున విహరింప నంత
నొలసి తదీయవనోపకంఠమునఁ
బొలుపారుకొలనిలో బుగ్గన పొడిచి
దివ్యాంగదీధితుల్ దివ్యాంబరములు
దివ్యాభరణములు దివ్యచిహ్నములు
నుల్లసితంబుగా సురమున నొప్ప

మల్లెపూవుల పెక్కుమాలిక లమర
మసలక పసిఁడిచామర లిఱుగేల
నసలార నిడి మల్లికార్జునదేవు
పురముదిక్కేఁగ నేఁ బోయి, యాయయ్య
చరణాబ్జముల మీఁదఁ జాఁగిలి మ్రొక్కి
వరవనాంతర సరోవరమధ్యమమునఁ
గర ముద్భవించిన కారణం బేమి?
నరుఁడవో నీవు గిన్నరుఁడవో భక్తి
పరుఁడవో ప్రచ్ఛన్నహరుఁడవో ప్రమథ
వరుఁడవో పాతాళచరుఁడవో యమృత
కరుఁడవో తరుణభాస్కరుఁడవో తొంటి
మరుఁడవో దానవేశ్వరుఁడవో వజ్ర
ధరుఁడవో యొక్క నిర్జరుఁడవో చెపుమ,
యేలోకముననుండి యేఁగుదెంచితివి
యేలోకమున కింక నేఁగెద వనుఁడు
వినుము తపోమూర్తి విస్మయం బొకఁడు
వినవయ్య నాపోవువిధముఁ జెప్పెదను

## కరవీరుని కథ

గరవీరుఁ డనఁగ రాక్షసవిభుఁ డొకఁడు
డరు దరు దనఁగ నీ యచలంబునందు
రతిఁ గరవీరేశ్వరం బనఁ బ్రమథ
పతిఁ బ్రతిష్ఠించి తపం బాచరింప
హరుఁడు ప్రత్యక్షమై యడుగఁగ్గు మనిన
వరదాని వేఁడొండు వరము నేనొల్ల
భువిని నీసర్వాంగములును ధాతువులు
వివిధసూక్ష్మస్థూలవృక్షరూపములు
గావించి తత్సముద్గతపుష్పవితతి
నీ వెప్పుడును బ్రియాన్వితుఁడవై తాల్పు,

మందు గించిద్ధళంబైన నినూ్పన్న
నొంత దేవేంద్రత్వ మొసగు మర్త్యులకు.
నటుగాక యీ పుష్పమంతయునొకఁడు
పటుభక్తి మీపదాబ్జములపైఁ బూన్ప
మఱి పూర్వజన్మ సమాధులు లేని
నెఱిముక్తిఁ గలిగింపు, నిజమట్లుగాక
యొకపూవు నినుబూన్ప నొరునైనఁ బనుప
సకలతురంగకుంజరసహస్రములు
ధర వాజపేయశతంబుల క్రతుల
నరుదగుకోటికన్యామహాదాన
ములఫలంబులఁ బొంద ముక్కంటి యొసగు,
బిలిబిలివరములు ప్రియము గా వనుడు
ననమాతుఁ డొసగె నట్లది యాదిగాఁగ
వసుధ నీ కరవీరవన మొప్పె మఱియు
నావిర్భవం బయ్యె నఖిలలోకములఁ
గావింపఁ జను బహుకరవీరజాతి
యకృతాత్ములకుఁ గాన నరిది యివ్వనము
సుకృతాత్ములకుఁ గాన సులభ మివ్వనము
పూని నీప్రాప్తనపుణ్యఫలమునఁ
గానంగనయ్యె దీ కరవీరవనము,
నట్టినుగాన దివ్యాంజన లతిక
మెట్టినవాఁడ వీ మేదినిమీఁద
నెట్టి పుణ్యుఁడవొ నీ విచ్చోట నుండఁ
గట్టెదురను మున్ను గానంగఁబడియెఁ
గదలకు మీ వింకఁ గదలితివేనిఁ
గదిసి చూచిన మమ్ముఁ గానంగరాదు,
నది గరపీ మహత్త్వ మికొలని
విదితప్రభావంబు విను తపోధనుఁడ,
యరుదగు సురదీర్ఘికాంశ మీకొలను

పరగ భాగీరథిపాయ యీకొలను
నిపుడు భోగావతినిట్ట యీకొలను
ధ్రువము గోదావరిస్రోవ యీకొలను
వరకుండతీర్థాలవాల మీకొలను
సరి మల్లికాకుండసరణి యీకొలను
పెనుపారు జలదుని బీజ మీకొలను
ఘనకీర్తి శివమౌళిగంగ యీకొలను,
యిందుల పద్మంబు లీశుఁ బూజించి
సుందరి దేవకి సుతుఁ గృష్ణుఁ బడసె,
యీతామరల శౌరి యీశాసుఁ బూన్చి
ఖ్యాతిఁ జక్రంబును గన్నను బడసె,
సరసిజగర్భుఁ డీ సరసిలో నొక్క-
సరసిజంబునఁగాదె సంభవంబయ్యెఁ,
గరపద్మములతోడి కలువలు గౌరి
సరిఁ దాల్చు లీలాంబుజము లివి గావె?
తరణి యీ పద్మమిత్రతఁజేసి కాదె
స్ఫురితతేజోవృద్ధిఁ బొదలె లోకముల ?
నీపద్మములఁగాదె యింతి యాగొంతి
పాపారిఁ బూజించి పడసెఁ బాండవులఁ ?
చెంది యీ పద్మమాల్ శివుఁ బూన్చికాదె
సుందరి భృగుపత్ని శుక్రుని బడసె ?
నదిగాక యీవిరుల్ హరుఁ బూన్చికాదె
సుదతి గౌసల్య సత్పుత్రు రాముఁ బడసె ?
హరు నిందు భ్రమరాన్వితాబ్జంబుఁగాదె
ధరఁ బూన్చి శశి నత్రి దనయుగాఁ బడసె ?
భామలు శుభవేళఁ బాడెడునట్టి
తామరవిరులు సీతామరల్గావె ?
వసుధఁ బుణ్యులకు సువర్ణపద్మములు,
వసుధఁ గర్మలకు గేవల పుష్పములు,

ధృతిఁ బుణ్యులకు నివి దివ్యతీర్థములు,
క్షితిఁ 'గర్మలకు నివి గేవలోదకము,
సన్నుతి నిందుల జలచరావళులు
నెన్ని చూడఁగ వేఱె హేతువు లవియె
హరిపేరి మత్స్యకూర్మాదు లీకొలను
చరజీవులకు మన్మ సంతతి యగుట
మహి నిట్టి పసిఁడి తామరల యీకొలని
మహిమఁ జెప్పితి నింక మత్రిక్రియ వినుము
పుట్టితి శాంకరీపురవరంబునను
నట్టినామము వురి కగు' దేమి యనిన
వొలసి బాలక్రీడలోలి నాదఁగఁ
దలఁచి పార్వతి దోడి తరుణులఁ జూచి
రాజకీరాలాపరంజితవాణి
రాజకీరమ్మల రమణి తెమ్మమ్మ
కోకిలకలనాద కోమలి నీవు
కోకిలానీకంబుఁ గొంచు రమ్మమ్మ
వరహంసగామిని వనితాలలామ
వరహంసనిచయంబు వరుసఁ దెమ్మమ్మ
బర్హిణ బర్హనిర్భరకేశభార
బర్హిణానీకంబుఁ బరగఁ దెమ్మమ్మ
తరుణి పుత్రికల రత్నంబుపుత్రికలఁ
గర మొప్పుమణిపుత్రికలను ముత్తెంబు
బొమ్మల దంతంబు బొమ్మలఁ బసిఁడి
బొమ్మల గురుగులఁ బొలఁతి తెమ్మనుచు
సురకన్యకలును హిమ గిరికన్యకలును
వరరుద్రకన్యలు నురగకన్యకలును
ప్రమథకన్యలు దను బలసి కొల్వంగ
హిమగిరికన్య పూర్ణేందునిభాస్య
గిరిజ మున్ శైశవక్రీడాభిరతిని
నరుగుచు నరుగుచు నర్థి దుటాక్కడఁ

దివిరి భాగీరథీ తీరదేశమున
భువి బొమ్మరిండ్లుగా పురముఁ గల్పించి
తన్మధ్యమున గౌరి తాన చేముట్టి
సన్మతినొక్క ప్రాసాద మొప్పారఁ
గావించి యొక్క లింగముఁ బ్రతిష్ఠించి
సేవారతిని దోడి చెలువలుఁ దాను
శివుఁ గొల్చి మఱియు విశేషవినోద
వివిధోత్సవంబుల వేడ్కఁ జల్పుచును
గొండొకప్రొద్దుండి కోమలి యరిగె
నుండ సైకతపురం బుర్విఁ బైనట్ల
యంత నగ్గౌరి మహాతపోనియతిఁ
గంతుమర్దనుఁ బతిగాఁ బ్రీతిఁ బడసి
హరుఁడును దాను నన్యోన్యానురక్తి
సరి నవినాభావసంబంధ మమర
నానందలీల నోలాడుచు నంతఁ
దా నప్పురం బద్రితనయఁ దలంపఁ
దలఁచిన తలఁపుఁ దత్పతి యెర్గి నీవు
దలఁచిన యొకసికతాపురం బదియు
నిక్కంబు పుర మయ్యె నివ్వటిల్లంగ
నిక్కంబునకుఁ గరుణించితి ననుడు
శంకరవల్లభ శాంకరిఁ దలఁప
శాంకరీపుర మనఁ జనియె లోకముల
నాశాంకరీపురం బంద నాయునికి
శ్రీశైలమునకు వచ్చితి, వచ్చి యంత
నిర్జితపాపు ననిర్జితమహిము
నూర్జితయశు మల్లికార్జునదేవు
నత్యర్థిమై సమభ్యర్చితుఁ జేసి
నిత్యంబు సత్క్రియానిష్ఠ ముప్పొద్దు
సంధిల్ల నానాసుగంధప్రసూన

బంధురీపూజానుబంధప్రబంధ
పటు రభసోద్యుక్తిఁ బరమప్రసక్తి
స్ఫుటభక్తియుక్తి సంపూజ్యుఁ గావించి
తనపౌరు లిలఁ బుష్పదంతుఁ డనంగ
ననయంబు వర్తింప నట్లొక్కనాఁడు
పూవులవడుగు లీ పుష్పవాటికలఁ
ద్రోవఁ జూపుడు వచ్చి తుదిశాఖ నున్న
కరవీరపుష్పముల్ గమియంగఁ గోయ
నిరవుఁ జూపుచు శాఖలే నెక్కునెడను
గీతవాద్యము జనాకీర్ణఘోషణము
నాతతపంచమహావాద్యరవము
చప్పుడు దిక్కులఁ గప్పుడు భ్రమసి
యప్పుడు గతికీలు దప్పుడుఁ గ్రింది
కొలనిలో వడఁకుచు గుబ్బన పడుడు
నలరి నాగాంగన లర్థిఁ దన్ బట్టి
పూర్వజన్మమున నీ భోగనాథున క
పూర్వపూజాబంధములు విరచింపఁ
గానొక్క పద్మంబులో నొక్క తేఁటి
దానొక్కఁ డున్న యా తప్పునఁ జేసి
భూవలయంబునఁ బుట్టితి దొల్లి
పూవులవడుగవ కావున నట్ల
శివుడుఁ గారుణ్యంబు సేసె రమ్మనుచు
నువిదలు గొనిపోవ నురగలోకమునఁ
గలిత భోగావతీగంగాప్రవాహ
పులినతలంబునఁ బొడమఁ దత్ క్షణమ
దివ్య తేజమున జాతిస్మరత్వమున
దివ్యాంగనలపల్కు దృఢముగా నెఱిఁగి
శ్రీ భోగిరాట్సమర్చిత పాదపద్మ
నాభోగనాథు నత్యర్థి భజించి

తరుణతరారుణతరణివిస్తరణ
కిరణాపహరణవిస్ఫురణమాణిక్య
కలశ విభ్రాజితాగణితార్బుదప్ర
భలఁ జెంది లోకసప్తకమును వెలుఁగ
ద్వారాష్టకముల భవంతి పంక్తులను
జారుమండపముల నహజవేదికల
భూరి వప్రముల గోపురముల దివ్య
తోరణంబుల సర్వతోభద్ర మనఁగ
భ్రాజిల్లు దివ్య విస్ఫార తేజో వి
రాజితమగుచుఁ దత్ ప్రాసాద మమర
నష్టదిక్పతులు మూర్త్యష్టకంబును ని
జాష్టమహాహి సహస్రముల్ గొలువ
హరివిరించ్యాది సురాసురప్రముఖ
గరుడగంధర్వ సంఘంబులుఁ గొలువ
శుంభత్ ప్రమథగణ స్తోమంబు గొలువ
రంభయాదిగ నప్సరఃస్త్రీలుఁ గొలువ
శ్వేత దధీచి వసి ష్ఠోపమన్యు
గౌత మాత్రులుఁ గొల్వఁగా దదభీష్ట
పుణ్యప్రదుండగు భోగనాథుం డ
గణ్య పుణ్యుఁడు నాకుఁ గరుణింప నట్టు
లందు భజింతుఁ బాయక భోగనాథు
నిం దెప్పుడును శ్రీగిరీశు భజింతు
ననుచుఁ బురంబున కేఁగె నాయయ్య
విను మట్లు గాక యవ్విపినాంతరమున
కేఁ బత్తిరి కిఁ బ్రీతి నేఁగంగనొక్క
యాఁబోతు దివ్యసమగ్రతఁ బేర్చి
భవుఁ డెక్కఁ దనవృషభంబున కదియుఁ
గవయుఁగా సృజియించెఁ గాక యవ్వట్లు
స్ఫుటతరసౌందర్య భువనైకవినుత

పటుదేహకాంతి విభ్రాంతి దలిర్ప
నొక్కభక్తుండు సమున్నత ప్రీతి
మ్రొక్కి ప్రదక్షిణంబులు వచ్చి వచ్చి
మ్రొక్కుచు మ్రొక్కుచు నక్కడ మగుడఁ
జక్కన వృషభంబుఁ జని యాబిలంబుఁ
జొచ్చుడు నిది యేమి సోద్యమో యనుచు
నచ్చటి కేఁగి యా యయ్యకు మ్రొక్కి,
"యెక్కడ నుండుదు రెవ్వరు మీరు
నెక్కడియాఁబోతు మ్రొక్కెద రేల ?
యెక్కడ కేఁగెద రిందేమి సిద్ధి
నిక్కంబు సెప్పుమా నీయాన" యనుఁడు
"వినవయ్య యిది యాదివృషభంబు గర్మ
జనులకు వేతొండుసందమై తోచు,
జగములో రెండవు శంభుం డనంగఁ
బొగడంగ నెగడు శ్రీ భూధరాగ్రజుఁడు
ధర్మావతారుండు దాంతుఁ డుదాత్త
కర్ముండు నాల్గుయుగంబులయందు
ధర్మంబు నాల్గుపాదంబుల నడుచు
ధర్మమయ్యె యుగాంతరముల నెఱుఁగి
తద్ధర్మ మీమూర్తి ధరియించి యిజ్ఞ
గద్ధితార్థం బిజ్జగంబున నుండు
జను లెవ్వరేనియు న క్తరాత్రంబు
లనశనవిధి సదై కాగ్రచిత్తమున
నాబిలద్వారంబునం దుండగా ద
యాబుద్ధి నా వృషభాంశుఁ డేతేరఁ
దొలఁగ కా వృషభంబు తోఁకఁ బట్టుడును
బిలములోపలికి సంప్రీతిఁ గొంపోవు
నల మనోవేగంబునను గొనిపోయి
ఘోలుపారు వృషభేంద్రు పురసమీపమున

నావృషభాంశుండు నట్లదృశ్యముగ
భావించి యావృషభపురంబు నడిమి
వృషభ తీర్థంబాడి వేడ్కఁ దత్కృతులు
వృషభేశు నర్చించి వినమితులగుచు
నావృషభేశుండు నంత బ్రత్యక్ష
మై వారి కొసగు దృష్టాదృష్టసిద్ధి
వారిలో మోక్షాభివాంఛితులైన
వారల నందికేశ్వర పురంబునకు
ననుపఁ దిదీయమోక్షా వాససుఖము
ననుభవింపఁగఁ బండె నట్లును గాక
మణిగణానీకముల్ మంత్రముల్ దేవ
గణికోపభోగముల్ గామరూపములుఁ
గామదుఘంబులుఁ గల్పవృక్షములుఁ
గామితాలోకలోకప్రవర్తనలు
సంజీవ సంధాన శల్యాదికరణు
లంజన రస రసాయన ధాతు కళలు
మృగచోర రాక్షస మృత్యు విషాహి
ఖగమహోల్కాశని ఖడ్గ సేనాగ్ని
పవన జలాతప ప్రతిపక్షరోగ
పవి నృప స్తంభన పరిచితకళలు
గారుడాదులుఁ బరకాయప్రవేశ
భూరిదివ్యౌషధంబులు మొదలైన
దృష్టసిద్ధులఁ గోరుదృష్టార్థులకును
దృష్టసిద్ధుల నిచ్చు దేవుఁ డిచ్చుటను
దమనిజావాసముల్ దలఁపంగ నపుడ
విమలాత్మరుచిఁ బొల్చు వృషభేంద్రమూర్తి
వచ్చుఁ దొల్లిఁటియట్ల వాలంబుఁ బట్టఁ
దెచ్చు. బిలము వెడలఁ జొచ్చు నబ్బిలము
నట్లకా నెఱుఁగి యిష్టార్థముల్ వడసి

యిట్లు వచ్చితి నంచు నేఁగె వెండియును
జని నిర్జన ప్రదేశంబున నొక్క
మనమధ్యమున ఫలావళులు నేఁగోయ
భువినుండి యొకతాడి దివిదాఁకఁ బెఱిఁగి
దివినుండి యట్లు క్రిందికి దిగఁబడఁగఁ
గదలకేఁ దాళవృక్షము జూడఁ బ్రొద్దు
గదియఁ దత్తాళవృక్షముతుట్టతుదినే
శతరుద్రుఁ డొకఁడు శ్రీశైలేంద్రుఁ జూడ
నతులవృక్షారూఢుఁడై వచ్చె ననగఁ
బాలార్కరుచిఁ దనుప్రభలు వొల్పార
దాళాగ్రమున నొక్కతపసియుఁ దోచెఁ
దపనుండుఁ గ్రుంకఁ దత్తాళంబుఁ గ్రుంకెఁ
దపసియు ధరఁ జిక్కెఁ దానంత గదిసి
తాడెట్లు దివి కేఁగె? ధర నెట్లడంగె?
నోడ కెట్టులు మీఁద నుంటివి వీవు?
నందు నెవ్వరిఁ గంటి? వగుసిద్ధి యేమి?"
వొంధు డెట్లయ్యె నీ భూజంబు నీకు?
ననవుడు శ్రీగిరియంద యేప్రొద్దు
వనముల నడవున వర్తింతు నేఁడు
ననఘ యీ ప్రాంత మేకాంతంబు గాన
చనుదెంచి యుతయమజ్జనకాలమునను
జర్పింప లింగవశమున నిచ్చటన
కూర్చుండి యేను లింగార్చన సేయఁ
దుదల నర్కాంశులు దోప నీతాడి
తుదలయూఁకులుతుట్టతుదలను దోచె.
నుదయాద్రిరుచులు దళ్కొత్త నీవ్రాన
నుదయాద్రిరుచులును దుదలఁ దళ్కొత్తె,
మొదలియాకిరణముల్ మొలువ నక్కుజము
మొదలియాకుల మొట్టమొదళ్లు మొలచెఁ,

గదిసి యాద్యుతులు సాఁగంగ నీద్రుమము
గదసిన మీఁదటికొమ్మల సాఁగెఁ,
బొదలుచు రవియును బొదమ నిత్తరువుఁ
బొదలుచు నినుఁ జూడఁ బొడమెను మునుగఁ
జక్కొన్న లింగావసరవేళ గాన
యక్కడిక్కడ సూడ కట్ల యుండితినిఁ
గ్రాలు నంబుజమధ్యకర్ణికఖాతిఁ
దాళాగ్రవక్రతమధ్యమున నే నుంద
రవిరథం బేఁగు తీవ్రమున నీతరువు
దివిదాఁకఁ బెరుగుధు రవియు మధ్యాహ్న
వేళ నీచనుతాళవృక్షంబుఁ గదిసి
నాలాంఛనంబును నన్నును జూచి
సముచితసత్కారసంతుష్టుఁ జేసి
యమలాత్మ యీప్సితం బడుగు నావుడును
ఫలితపర్వత సార్వభౌమాతిశయత
నొలయుశ్రీగిరియు నా కున్కపట్టేని,
నజ హరి యుఖ్యమదా ద్యమరార్చితుండు
త్రిజగన్నుతుండు ముక్తిప్రదాయకుఁడు
సుమహదపారభాసురదయాంభోధి
ప్రమథనాయకుఁడు శ్రీపర్వత ప్రాణ
వల్లభుఁడైన శ్రీ మల్లికార్జునుఁడ
తెల్లంబు నా ప్రాణవల్లభుఁడేనిఁ,
బన్న గాంకుని వలకన్నైన నిన్న
గన్నులారఁగఁ జూడఁగాఁ గంటినేని,
వేఁడ నింతటిమీఁద వేఱొకడు వరముఁ
బోఁడిగా నున్నదే భువనలోచనుఁడ
యేమిథు నేనొల్ల నీతాళవృక్ష
మీమహి సుధఋుంప శేషమారణము
సనఁజన గొనసాఁగుశక్తి యీవృక్ష

మున కెట్టు లెసగెను మోచు దేమిటికి?
యెప్పటిభువిఁ గ్రుంకు దేమి విధంబు?
సెప్పుమింతియ చాలు శివనేత్ర" యనఁడు
"శ్రీగిరి దనమౌళి సృజియించెఁ బుణ్య
భాగుండ మర్త్యుల బ్రదికింపఁ దలఁచి
సూర్యవనంబును సూర్యనగంబు
సూర్యకుండంబును సూర్యేశ్వరంబుఁ
దా వెండియును సూర్యతాళము ననఁగఁ
గావించె నిహపరకాంక్షాపరులకు
సూర్యకుండం బాడి సూర్యేశుఁ గొలువ
సూర్యపదంబగు సూర్యాత్మకరుణ
ద్వాదశాదిత్యులుఁ దమతమపదవు
లాదిని సూర్యేశు నర్చించి కనిరి,
దా నుదయింప నీ తాడియు౽ బొడుచుఁ,
దా నస్తమింప నీతాడియుఁ గ్రుంకుఁ,
బురహరుకృపఁ దాళభూరుహం బెక్కి-
యరుగుదెంచిన వారి కభిమతం బిత్తుఁ,
దనర నీగిరిఁ జంద్రతాళంబుఁ గలదు,
జనులట్లు సమదేరఁ జంద్రుండు నిచ్చ
లీల నక్షత్ర తాళీసమూహములు
శైలంబునందిట్లు సరియింపుచుండుఁ
గావున చోద్యముల్ గలవిట్టు లొండు
నీవు గామింపవేనియును దప్పేమి ?
మానితాంబుజ రాగమణు లివే కొనుము,
పూని శ్రీగిరినాథుఁ బూజింపఁబొమ్మ"
ననుచు నంతట సూర్యుఁ డరుగ నీతరువు
సనుదెంచి యట్లు యీ జగతిలో నడఁగె
నని చంద్రసూర్యతాళాది వృక్షముల
ఘనమహత్త్వముఁ జెప్పగా వింటి మఱియు

వెండియు నొకనాఁడు విపినాంతరమున
నుండుంగఁ దనఁబ్రోల నొండొండ భీతు
గొని యురంబున నంటుకొని యొక్క యర్భ
కునిశవం బుండంగ గబ్బున పడుడుఁ
జక్కననేఁ జేరఁ జని "విభీతాత్మ!
యెక్కడనుండి నీ వేతెంచి పడితి?
వడఁగ గర్భంబులోపలి పాపపీనుఁ
గుడుగక యురమున నునికి యెట్లనుడుఁ
"బురమున నుండియేఁ బుష్పంబులకును
గర ముఱువడిఁ బాఱఁ గడుపు గలంగ
జలతీరమునఁ జేతిసజ్జయుఁ బెట్టి
యిల నొక్క కొంతద వ్వేఁగి కూర్చుండి
మా వర వాటిక మఱిశంక లేక
నోవెత్తి కూర్చుండు దుచితమే యనుడు
దిగ్గనలేచి నల్దెసలును జూచి
బగ్గించి పలుకు శబ్దం బెట్టుదోచె
నిక్కడ నూరులే దిల్లులే దనుచు
నక్కడనొక రాతి నిక్కగాఁ బెట్టి
చక్కన యొక్కింత సని కూరుచుండ
నక్కడ నిట్టుల యట్లిక్క వెట్టి
యక్కడ కక్కడ కరిగి కూర్చుండ
నక్కడ కక్కడ కట్లవారింప
నిక్కలు వెట్టుచు నిల దూర మేఁగి
చక్కన మఱి బహిశ్చరణంబు సేసి
శౌచాచమన బహిస్స్నాన క్రియాదు
లాచరించి మదీశ్వరారార్చన సలిపి
ఘనతరంబుగ దొవ్పకరమునఁ బట్టి
యనుషక్తి నేఁగి యయ్యెయిక్క లున్న
కందువలందు "భిక్షాందేహి" యనఁగ

సుందరుల్ దమయొడల్ సూపక వచ్చి
యందఱు నతులదివ్యాన్నాదు లన్ని
గందువలందు భిక్షములు పెట్టుచును
బరమున కారగింపఁగఁ బెట్టికుడువ
సరసదివ్యాన్న భోజనమహాత్త్వమున
నప్పుడు గర్మక్షయంబు నా కగుడు
నప్పరవరము సయ్యన కానవచ్చె
నందు దద్దివ్యకన్యారత్న మొక్క
సుందరి సర్వాంగసుందరి వచ్చి
తనగృహంబునకు నుదాత్తసంప్రీతి
నను గొనిపోయి యున్నతహర్మ్యమునను
నునిచి యభ్యంగక్రియోపేతుఁ జేసి
యనుపమదివ్యాంబరావలు లిచ్చి
బంధురషోడశాభరణసంధాన
గంధమాల్యాదిశృంగారంబు జేసి
యలరు దివ్యాన్నపానాదులఁ దనిపి
యలరు తాంబూలాదు లర్పించి యంత
వరియించి నన్ననవరతసంభోగ
సురతసుఖాంబుధిఁ జొక్కించుచుండ
ననుపమ దివ్యవర్షానేక కోట్లు
సనఁగఁ దద్గర్భంబు సతి కైనఁ జూచి
చిక్కినాకీ సతి దక్కెఁబొమ్మనుచు
నొక్కింత దలఁప నయ్యుగ్మలి యెఱుఁగ
చెచ్చెర గర్భంబు వచ్చి యర్భకుని
బుచ్చినాపై నటు పొమ్మంచు వైవ
నెప్పుడో వచ్చి తా దొప్పన పడితి
నిప్పాట" నని చెప్ప నిది వింటి మఱియు
నరిగితి ! నటవినోదార్థమై దూర
మరుగ నరుగ నొక్క గిరికందరమున

నొక్కయ్యా బిలములోనుండి యేతేర
నెక్కడనుండి మీ రేఁగెద రనుడు
నిది పాపబిల మందు రీద్వారమునను
గదలక దినసప్తకం బుండ నొక్క
యువిద యబ్బిలయుల్ నుండి యేతెంచి
సవినయంబుగఁ దన చాఁకిటిపాప
నిటు వట్టు మన చేతికిచ్చుచుఁ బోవఁ
గటకట నేడ్చుచుఁ గఱచుచు వ్రచ్చి
కొనుచు గోళుల డుస్సికొనుచుఁ దోళ్లొలిచి
కొనుచుఁ గండలుఁ గొర్కికొనుచు సాధకుని
తనువుమాంసం బెల్ల దరిమిడి కూడఁ
దినఁగ నెమ్ములు దక్క ధృతిపేర్మి నతఁడు
గలఁగక పండ్లిలగఱవక చనక
యలుగక యులుపక హాయన కచటు
గదలక మెదలక కర మడ్డ మిడక
యదరక బెదరక యఱఁగలి గొనక
వెక్కక నుసలక వీఁగక మసల
కొక్కింతయును గొంకకున్నను మెచ్చి
జనని యప్పుడ వచ్చి తనకూఁతుఁ బుచ్చి
కొని దివ్య దేహ మెక్కుడుకూర్మి నిచ్చి
యావామ వెండియు నభిమతసిద్ధి
గావించు నని బిలకల్పోక్తి నట్ల
తలరక తను వొగ్గితన మనోరథముఁ
మెలఁతిచేఁ బడసి యేఁ బోయెద ననుచు
యోగవాగలు మెట్టి నుద్యుక్తుఁ డగుచు
వాగలు గిరులపైఁ బదిలమే యనుడు
వాగ లూరకరావు వడసితి యోగ
వాగలెట్లన్న నీపర్వతాగ్రమునఁ

గరమర్థి శ్రీపాదుకాసిద్ధనాథుఁ
బరగుశూలంబుల వాగలు వెట్టి
యెలమితో వేయును నెనిమిదిమార్లు
వలగొని మ్రొక్కుచు వచ్చి కల్పోక్తిఁ
బథమిడిపోవుచోఁ బర్వతాకృతిని
బ్రథితమై యొక్క సర్పంబున్న దాని
వదనంబు బిలమని వడివడిఁజొచ్చి
యది వాముకడుపులో నౌటయెఱింగి
సర్వజ్ఞభోజునిఁ జంపంగ వచ్చు
గర్వనాగంబు నుక్కుడఁచిన సూక్తి
నిల "నన్యథా శరణం నాస్తి" యనఁగ
నిల "రక్ష రక్ష మాహేశ్వరా" యనఁగ
మహితమంత్రంబు సన్మతి ననుష్ఠింప
నహిపతి వ్రక్కలై యఱచుచుఁ ద్రెళ్లె,
వినియొక్క సర్ప ముద్వృత్తిఁ దత్క్షణమ
చనుదెంచి తొలఁగి యేఁ జనఁగఁ దచ్ఛవముఁ
జక్కొల్పి యా రెండుప్రక్కలుఁ గూర్చి
గ్రక్కున సంధానకరణి ముట్టించి
యురగంబుఁ గొనిపోయె నుమిసె సంధాన
గరణియు నంత నేఁ గని పుచ్చుకొనుచు
నరుగుచు మఱియొక్క సరసిజాకరము
దరిఁద్రొక్కి జలములుద్రావ నపేక్ష
ముట్టుడు నుదకముల్ ముట్టినచేయి
ముట్టినంతన త్రెగి ముందఱఁ బడుడుఁ
జట్టనతునుకలు సంధానకరణి
ముట్టింపఁ గరమొప్పె ముట్ట కే నట్టె
యుదకముల్ గుళిగలో నొకకొన్ని గొనుచు
గదల కర్తరిఫాణిగా నంత యెఱుఁగి
యరుగంగ నెదుర మదాంధగజములు

వరిగొని తనమీఁదఁ బఱితేరఁ గాంచి
కర్తరిపాణి యా కరులపైఁ జల్లి
మత్తేభములు దున్సి మఁగుడిపాఱంగ
నంటుజా లంటీ    టు గొన్ని సిక్క
నంటుజాలకుఁ జని కం చొక్కగజము
దనతుండమున శిలోదక మప్పు దెచ్చి
చననీని యంత్రాల సందులఁ జల్లఁ
బాసి యేఁనుఁగు లేఁ గెఁ బట్టితి మెల్ల
నాశిలోదకము లేనంత ముందటికి
నరుగంగ నరుగంగ నంటుజాలంటఁ
దరమిడి తచ్చిలోదకములు సల్లి
విడుచుడు నంటుల వేసవేల్ దాఁటి
పుడమియు దిశలు నభోవీథిఁ గప్పి
యోజనోత్సేదంబు యోజనాయతము
యోజనవిస్తీర్ణ మొక వృక్ష మున్నఁ
గనుఁగొని యిది యు మార్గంబని యెక్కఁ
దన కాఁడ నొకకోఁతితనువు వాటిల్ల
నమ్మెయి విడువక యాత్రమానికొమ్మ
కొమ్మ దప్పక యుఱుకుచుఁ బోవఁబోవ
నాఁకలి పుట్టుడు నం దొక్క ఫలము
పీఁకతో నమలంగ వేగంబ తనకుఁ
జిలుకశరీరంబు సిద్ధింప నంతఁ
జిలుకనై యాత్రమానఁ జిక్కక యరుగ
శ్రమము దోచుడుఁ బుష్పశాఖపైఁ బుష్ప
సమితియ శయ్యగా శయనించియుండఁ
దన కంతఁ దుమ్మెదతనువు సిద్ధింప
ఘనపుష్పపరిమళకాంక్షఁ జిక్కకయుఁ
గడఁకఁ. దద్వృక్షశాఖాతతిఁ గడచి
యుడువీథిఁ జన నొక్క యుర్వీధరంబు

పడఁకువ నొక్క తాపసి యున్న వారి
యడుగులఁ బడుచు భృంగాకారమెడలి
తనకు దివ్యాంగ మా తాపసి యొసగఁ
బెనుపారి ఖేచరీబల మిదే యిందు
మండెడుమంటలమూడ్కి నెల్లెడల
నుండు మండుచు నవి యోడక త్రొక్క
వనుపడు నని యోగవాగలై నీకు
ననుడు నే న ల్లేఁగి యచ్చోట రెండు
మంటలు దత్కృపామహిమ మెట్టుడును
బట్టింప కవి యోగవాగలై తనరెఁ
బడసితి నీయోగవాగ లీక్రియను
బడసి సహస్రాబ్దపరిమితం బయ్యెఁ
బర్వతాధీశుశుంభత్కృపఁ జేసి
సర్వసిద్ధులును సుసాధ్యంబు లయ్యెఁ
గడఁక నీయోగవాగలు మెట్టఁదలఁపఁ
దడయక ఖేచరత్వంబు సందిల్ల
నేలోకములకు నా కేఁగంగవలయు
నాలోకములకుఁ జయ్యన కొనిపోవ
భోగవతికి నేఁగి పుణ్యోదకములు
నాగలోకస్వర నళినముల్ దెత్తు
భాగీరథికి నేఁగి భవ్యోదకములు
బాగౌందు తత్తటప్రసవముల్ దెత్తు
మందాకినికి నేఁగి మహితోదకములు
గెందామరలుఁ దెత్తుఁ గ్రియ దులుకాడ
మానితభక్తి శ్రీమల్లికార్జును స
దానందుఁ బూజించు ననుచు నాయయ్య
ననియె నెచ్చటికేనిఁ జనుడు సాధకుఁడు
విని యత్తపోధనుఁ గనుఁగొని నగుచు
శ్రీగిరిమీఁద విశేషంబు లెన్న

వాగీశ్వరునకైన వశమట్లుగాదు
నెన్ని యగ్గిరిదరు లన్నిసోద్యమ్ము
లెన్ని యగ్గిరిగిరు లన్ని సోద్యములు
సనఁ జూడ వినఁ జెప్ప సాధింపఁ బదయ
ననఁ గీర్తిసేయ శక్యమె? యింత సాలుఁ
జాలుఁ, బోయెద, నీవుఁ జాలుదే రమ్ము,
చాలవేఁ జిక్కుము, దనఁ ద్రోవనిమ్ము
జడుఁడనై యెజ్జ శిష్యన్యాయమునకు
నొడఁబడ నింక నీ యుక్తులు మాని
మెట్టుదుఁ బులినైనఁ బట్టుదు భీతి
ముట్టుదుఁ దుడిఁ జలపట్టుదుఁగాని
తక్క నాగమనంబుఁ జిక్క నేమిటను
స్రుక్క నొంటికి, వెన్కద్రొక్క, నెట్లైనఁ
జొత్తు బిలముఁ, ద్రోచి పుత్తు విఘ్నంబు,
లుత్తు నెందైనను, వత్తు జయించి,
పొదలు నీలాంఛనంబులు నిన్నుఁ జూచి
ముదలించినను బోక మున్నింటిఁ గాక
న న్నాఁగ శ్రీగిరినాథుఁడుఁ జాలఁ
డన్న శక్యమె నీకు? నిన్నియు నేల?
పొమ్ము, బిలము సూఱఁ గొమ్ము, జయించి
రమ్ము, మేమును నీవశ మ్మని నమ్ము,
దీవించి పంపు, మింతియ తక్కుఁగాని
పోవక నిలువఁ దపోధన పోవ
నానతి యీమల్లికార్జునదేవు
నాన సీకింక నొం డాడిన నసుడు
మలకలఁ బడఁడ, నా మాయలఁ బడఁడ
మలఁకువఁ బడఁడ, నా మాటలఁ బడఁడ,
తక్కులఁ బడఁడ, నా దబ్బులఁ బడఁడ,
ఛొక్కులఁ బడఁడ, నా చూపులఁ, బడఁడ,

మఱుఁగులఁ బడఁడ, నా మతములఁ బడఁడ,
వఱుతలన్ బడఁడ, నా వార్తలఁ బడఁడ,
జంకెలఁ బడఁడ, నా సటములఁ బడఁడ,
యింకఁ జిక్కింప రా దిక్కడ ననుచుఁ
దపసి యున్ననికిన తా నదృశ్యముగఁ
దపసిని గుటిలంబతపసిగా నెఱుఁగి
తెరు విడి యాతఁడ దవ్వాత్తి వర్టిల్ల
నరుగంగ నరుగంగ నంతంత మున్న
సరకు సేయక మీఱి సాధకోత్తముండు
నరుదుగా కంచును నద్వైతపుంపు
బిలమువాఁకిటియందు పృథుతలార్గళము
పొలుపుననొక్క బెబ్బులిరూపుఁ దాల్చి
తగ్గుచుఁ బొదలుచు బుగ్గలించుచును
మ్రొగ్గుచు మూల్గుచు ముఱకటించుచును
ముక్కువిర్చుచు బొమల్ ముడివెట్టుకొనుచు
మ్రక్కుచు, ముందఱ నిక్కుచు, నావు
లించుచు, జిహ్వా సారించుచు, మ్రోల
గించుచు, నొసలు ముక్కించుచు, నెదురు
దారుచు, మూరుచు, ధరమునిగాళ్ల
నూరుచు, నీఁగల నొడియుచు, నడంగి
నడచుచు, మూఁతులు నాకుచు, వాల
మడఁచుచు, నేలతో నప్పళింపుచు,
నొడలు గిర్పుచు, మీస లోరగింపుచును,
గడవలించుచుఁ, జెవుల్ గర్తించుచును,*
గనలుచుఁ, బొనలుచుఁ, గఱవ నుంకించు
చును, గ్రుడ్లు మిడికించుచును, జూచుచుండఁ
గ్రమ మొందఁ గృష్ణ రక్త శ్వేత వర్ణ
సముదితశిఖిశిఖాశకలసంఘములు
ఘోఁడిగాఁ బెనుబ్రోవు ఘోసినయట్లు

మూఁడువన్నెలు మేన ముడివడి కూడఁ
గరులమదంబుఁ గేసరుల కోపంబు
ధర నాగవృశ్చికోత్కరములవిషయ
ననలంబువేడిమి యసురులక్రౌర్య
మనిలునితీవ్రత యటు గూడ బెరసి
యాపోవ కొకరూపమై యున్నయట్టి
యాపులి సాధకుం డత్తఱి డాసి
పులిరక్కసునిచావు బొంకు గానోవు
జ్వాలనాక్షుచే నాఁడు సచ్చె నేసియును
నిట బిలాంతరమున నెట్లున్నవాఁడు?
నిటలాక్షునకుఁ గాక యెట్లోడివచ్చె?
నొండేల యిల డాగి యుండునో కాక
వెండి యావ్యాఘ్రాసురుండు దాననఁగఁ
దపసి సెప్పినపులి దాన కానోపుఁ
దపసిచందము గాక దండియైనిలువఁ
గలదె నా యెదుర వ్యాఘ్రంబు శీఘ్రంబ
తొలఁగకయున్నను ద్రోవ యీకున్నఁ
జిక్కెఁగా కింక నా చేతని ట్లున్న
నెక్కడ సొచ్చిన నేల పోనిత్తు,
దండింతుఁ దలఁకింతు ధట్టింతు నలఁతు
ఖండింతు మలయింతు గతముసేయుదును
గాక సైరింతునే గర్వించి తనదు
భీకరాకారంబు నాకుఁ జూపెడినె?
యనుచు డగ్గఱుచుఁ దా నంతలోపలను
దసరారఁగాఁ బర్వతము వడ్డయట్లు
మండుచు నుల్కంబు మహిఁ బడ్డయట్లు
దండిమృత్యువు మహోద్ధతిఁ బడ్డయట్లు
ఘనఘనార్జనల్ గకుబంతములుగఁ
జనుదెంచి యమ్మహాశని వడ్డయట్లు

సంగతిఁ బ్రళయాగ్ని శకలముల్ వడ్డ
భంగి నప్పులి బిట్టు వడుచు సాధకుఁడు
బెదరక బెగడక పిమ్మిడిగొనక
యదరక నలఁగక యట ఋట సనక
యులుకక యోడక యుత్తలపడక
యలుగక యలయక యఱఁగలిగొనక
తలఁగక తరలక ధైర్యంబు సెడక
తొలఁగక కలఁగక తొట్రువుగొనక
యొకచేతఁ బులిమీస లొడిసి ము స్పిట్టి
యొకచేతఁ బులిదౌడ లొడక చొనిపి
చరణముల్ సరణముల్ వురిగొనఁ బెనచి
ధర వెల్లకిల నూఁకి తాటించి యార్వఁ
బులియు నదృశ్యమైపోవ సాధకుఁడు
గలఁ గని మేల్కన్నగతిఁ జోద్య మంది
యంత దెర్వైన దొంటియట్టుల యరుగ
నంతకంటెను మున్న యాభైరవుండు
మూర్తి గైగొని తాన ముందఱ నెన్ని
వర్తనలను గెలువంగరా దనుచు
నంతకంతకు బిలం బన్నువసేసి
యంతంబునను వహ్నియై మండుచుండఁ
దఱిఁదఱిఁ జొచ్చు సాధకునకుఁ జొరఁగ
నిఱుకటమై యున్న నిల వంగివంగి
పోవంగఁబోవంగఁ బోవరాకున్న
దా వెండి కూర్చుండి ధరఁ బోవఁబోవ
నెలమిఁ గూర్చుండియు నేఁగరాకున్న
నిల డొంగిడొంగి యొక్కింత సనంగఁ
బొరిబొరి డొంగియుఁ బోవరాకున్న
సరసర ధరఁ బక్క సాఁగిలి తాఱి
ఘంత గిట్టెదుర ధాఘానలార్చులును

నంతరింపని ప్రళయానిలశిఖలుఁ
గఱకంఠు చిచ్చఱకంటిమంటలును
యొఱపగు జాతిత్తి వట్టినయట్లు
దనరుచుఁ దద్బిలాంతర్వీథినుండి
కనలుచుఁ బొనలుచుఁ గళ్ల గట్టుచును
బొగులుచు భుగభుగభుగభుగభుగలు
భుగ లంచుఁ బెనుమంట లెగయుచుఁ జిట్లు
చును నాలుకలు గ్రోయుచును బ్రస్ఫురించు
చును సెగలెను రెక్కుచును సుళ్లు గొనుచు
నెడపక వారాసు లెల్ల ఘూర్ణిల్లు
వడువున మ్రోయుచు వరలు ఘోరాగ్నిఁ
బొడగని పిఱిఁదికిఁ బోక సాధకుడు
వడిఁబడి దాన యా వహ్నిలోఁ బడుడు
నయ్యగ్ని మును దాన యైన భైరవుఁడు
నయ్యన నంతఁ బ్రసన్నుఁ డై, "మెచ్చు
వచ్చె, నీకిప్పుడ వాంఛితార్థంబు
లిచ్చెద" ననుడు "నీ విచ్చెడి దేమి?
యేఁ గానియెడి దేమి? యెలమి నీతోడి
పొఁగెము నాపాలఁ బరమేశుఁ డుండ
నదరు నీసారూప్య మడుగుదునేనిఁ
గడు వికృతంబు భీకరము నీ రూపు
సామీప్యమేనియుఁ జనుఁ రక్త శవ సు
రా మాంసముల కనారతము నాలయము,
సాలోక్యమేనిఁ బిశాచభేతాళ
కాలభూతాది సంకరము లోకంబు
నది గారణమున నీ యం దేమిగుడువఁ
గదిసి నీయందేమి గంటిదృష్టముగఁ,
దప్పని యభిమతధాత వంటేనిఁ
జెప్పనఁ జెఱపనఁ జేటవుగాక

సటముల సాలు నన్ సాఁగిపోనిమ్ము,
గుటిలమ్ము దక్కుతక్కుము సిక్కు" మనుచు
భైరవుమాయలఁ బడక సాధకుఁడు
వారక తొంటితీవ్రమునన యరుగ
నర్ణవసప్తకం బది యొక్కవేళ
ఘూర్ణిల్లు క్రియ మహాఘోషణ దనర
రంగత్తరంగ లుప్పొంగఁ బాతాళ
గంగ మున్వచ్చిన కనుమయో యనఁగ
బిలమున కెదురెక్కు పృథుల ప్రవాహ
జలము ముందఱఁ గాంచి సాధకోత్తముఁడు
నుబ్బుచుఁ దత్ప్రవాహోర్మిస్థలమున
గుబ్బున పడి సాధకుఁడు మున్గి లేచు
నంతన దివ్యాంగ మగుడు తద్దేహ
కాంతి దిగంతవిశ్రాంతమై వెలుఁగఁ
దను దాన చూచి సాధకుఁడు హర్షించి
చనఁజన నెదుర భాస్వద్రత్నఖచిత
మైన సువర్ణదేవాలయోపాంత
మానిత రమ్యహర్మ్యస్థలంబునను
గాంచనాంచిత కాంతిఁ గడు నొప్పుభేరిఁ
గాంచి తద్దివ్యలింగము భజియించి
తవిలి యా భేరి సాధకుఁడు వాయింప
దివిజాంగనలు సముద్వృత్తి నేతెంచి
యతని నైరావతేంద్రారూఢుఁ జేసి
సతులు దోఁకొనిపోవు స్వర్గలోకమున
నదె కల్పభూరుహం బదె కామధేను
వదె యూర్వశీప్రముఖాంగనానీక
మదె యమృతం బదె యజరామరత్వ
మదె యణిమా మహిమా ద్యష్టసిద్ధి
సదమల దేవేంద్ర సామ్రాజ్యలక్ష్మి

యదె యిందులోన నీ కభిమతం బెద్ది
యది వరియింపు మీ" వనుచుఁ బ్రార్థింప
ముదము మనంబున ముప్పిరిగొనఁగ
సాధకుం డభిమతైశ్వర్యభోగముల
బాధిత సౌఖ్యసంపదఁ దొప్పఁదేలి
యవికల దివ్యవర్షానేకకోట్లు
వివిధ దేవేంద్రాది విపులభోగములుఁ
జెంది యంతట మీఁది శివలోకసుఖము
లందు నిట్టివి దా మనంత బిలంబు
లెందు శ్రీనగముపెం పేమని చెప్ప ?
నిందుమౌళియ యెర్గు నిట సూడు మింక

(శ్రీ) పర్వత ఉత్తరద్వార మహాత్త్వంబు

సురుతర శ్రీపర్వతోత్తర ద్వార
వరమహాత్త్వంబుఁ దద్ద్వారవాస్తవ్యుఁ
డైన మహేశ్వరోద్యల్లింగమూర్తి
మానితం బగుగుప్త మాహేశ్వరంబుఁ
జరుకేశ్వరంబును సంధ్యాసమాధి
గరుడేశ్వరంబును గాలహ్రదేశ్వ
రంబుఁ బాపవినాశనంబు గణేశ్వ
రంబు దేవహ్రదేశ్వరంబు సిద్ధేశ్వ
రంబును నీలహ్రదంబును నాఁగఁ
బంచి యేకాదశభవ్యతీర్థములు
మొదలను శ్రీచతుర్ముఖ బసవేశ
పదపద్మములు భజింప భజించినను
గరము నిష్ఫలము లేకాదశ తీర్థ
వరలింగ దర్శన వందనార్చనము
లెట్టన్న శ్రీనందికేశుండు లేని
యట్టి లింగోపాస్తి యట్టిదకాన
యాసక్తి నట్లు కన్యాసిద్ధనాథు
ప్రాసాద పూర్వదిగ్భరితమై యొప్పు

భూవరేణ్యుఁడు స్వయంభూలింగదేవ
దేవు నయ్యమరావతీపురిఁ జూడు
తివిరి మందాకినీ తీరోత్తరమున
దివిజవంద్యుని జూడు దేవు నింద్రేశు
దర్పితపాపారిఁ దల్లింగమూర్తి
దూర్పునఁ జూడు సంస్తుత్యమై గుప్త
మహేశ్వరం బొప్పు, మహితతల్లింగ
మాహాత్మ్యమది యవాఙ్మనసాత్మకమ్ము,
నవుల నేలేశ్వరం బనఁగఁ దూర్పునను
భువి లింగములుఁ గుండము నగంబులును
వివిహితరత్నచ్ఛాయ వెలుఁగులింగములు
మహి నొప్పుతీర్థముల్ మఱియును గలవు,
గామిత స్వర్గమోక్ష ప్రదోత్తములు
రామేశ్వరంబు నుమామహేశ్వరము
సంగమేశ్వరమును జరమేశ్వరంబు
సాంగమూలస్థాన మచలేశ్వరము ది
లేశ్వరసిద్ధముక్తీశ్వర గౌత
మేశ్వరాదులఁ జూడు మిల శిలాచయము
వేపపర్వతమును శ్వేతాద్రి నీల
మేదినీధర మశ్వమేధశిలోచ్ఛ
యంబును లింగశృంగంబుఁ గన్యాన
గంబు నుమాగిరి గనకగంబు
గుండశిఖరి రామకుండంబు భీమ
కుండంబును బ్రయాగకుండంబు వేద
కుండంబునుం దిలకుండంబు నీల
కుండంబును బిశాచకుండంబు గౌరి
కుండంబు మఱి రసకుండంబులును న
ఖండిత లీల నొక్కొటఁ జూడుమింక
నొలయ గంగాప్రవాహాభయపార్శ్వ

ములును దొమ్మిదిసేసి పుణ్యతీర్థములు
దాని తూర్పునను మాతంగేశ్వరంబు
నా నొప్పు సకల జనస్తుత్య మగుచు
శతకోటి యను మహాస్థానంబుఁ జూడు
శతమఖు దెసఁ బుణ్యజనితమై యొప్పఁ
ద త్తీర్థరాజికి దక్షిణంబున ను
దా త్త మహిమఁ ద్రిపురాంతక మొప్పు,
నా క్షేత్రమహిమ దా నది యెట్టి దనిన,
నీక్షితి నంత్యజు లిర్వురు గూడి
యతిముతిఁ బశుకర్మ మాచరింపంగ
నెఱఁగి కుమారగిరీంద్రంబుచుట్టు
దొడుగులఁ బఱవఁ దోడ్తోన ప్రాణంబు
విడిచి యాబల్లహుకడుపునఁ బుట్టి
జాతిస్మరత్వంబు సంధిల్ల నప్పు
డేతెంచి వృత్తాంత మెఱుఁగించి తమ్ముఁ
బట్టవచ్చినఁ బాటిపాటి మున్ దాచి
నట్టికత్తుల నూఁసి యచ్చెరువుగను
నాసకలముఁ జూడ నంతంత క్షేత్ర
వాసులై రాజ్యసన్న్యాసంబుఁ జేసి
జగనభినుత జజ్జు జగదేవు లనఁగ
నెగడి యకల్పితనిజపూర్వకర్మ
లలితకుమారశైలప్రదక్షిణ వి
పులఫలమహిమ శంభునిఁ గూడి రట్టి
పృథులకుమార భూభృత్సార్వభౌము
ప్రథితమాహాత్మ్యమెట్లంగి వర్ణింప్తు?
ధరఁ "బురారిధ్వజదర్శనం" బనఁగఁ
దవ్విరితాగత ధ్వజదర్శనఫలము
నంకింప నరు దన్న నా కుమారాచ
లాంకిత శ్రీత్రిపురాంతక దర్శ

న స్పర్శనాభ్యర్చనంబులమహిమ
విస్పష్టముగఁ దెల్ప విధికైనఁదరమై
యందుల భజనమహత్త్వంబునకును
గుందెలు నెలుకయు గుడి సాక్షి గాంగ
గంధవతిని దీర్ఘికా తీరవాస
బంధురాభీష్టద ప్రఖ్యాతమహిమ
భువినొప్పు శ్రీస్వయంభూలింగమూర్తు
లవియు మూలస్థాన మగుత్రిపురాంత
కంబును గౌరేశ్వరంబు సోమేశ్వ
రంబుఁ గేదారేశ్వరంబు ఖడ్గేశ్వ
రంబుఁ బాపవినాశనంబు గౌరీశ్వ
రంబును గపిలేశ్వరం బుత్తరేశ్వ
రమునా విముక్తేశ్వరము మల్లికార్జు
నమును గన్యాసిద్ధనాథలింగంబు
ననఁగ ద్వాదశసముద్యన్మహాస్థాన
ఘనలింగమహిమ యక్కజ మదె చూడు,
తత్త్రిపురాంతక స్థానంబునకు వి
చిత్రమై యొప్పు దక్షిణమున మఱియు
సిద్ధవటాధ్వ ప్రసిద్ధ పార్శ్వముల
వృద్ధగిరియు రససిద్ధేశ్వరంబు
గోశృంగమును రుద్రకోటియుఁ బశ్చి
మాశాముఖంబును నమృతేశ్వరముఁ బ్ర
థమమల్లికార్జునోదాత్త లింగంబు
భ్రమరేశ్వరంబును బాపవినాశ
నంబును సురభీశ్వరంబు ముక్తీశ్వ
రంబును ధర్మేశ్వరంబు నింద్రేశ్వ
రంబును బ్రహ్మేశ్వరంబుఁ గాశేశ్వ
రంబును భీమేశ్వరంబును బటహ
కర్ణేశ్వరంబు నేకశిలయుఁ గుంభ

కర్ణేశ్వరము గనకగిరియు జాను
సర్వలింగము భూతిపర్వత లింగ
పర్వత రుద్రాక్ష పర్వతావలులు
ఘనతరంబగు కర్ణి కారవనంబు
నను ఘటికాసిద్ధనాథలింగంబుఁ
గమలేశ్వరంబు శ్రీ స్కాందసోమేశ్వ
రమును సాలంకేశ్వరమ్మను మత్స్య
కుండ విభీషణకుండ కుమార
కుండ రావణకుండ గుప్తకుండములు
భీమేశ్వరమును విభీషణేశ్వరము
రామేశ్వరమ్మను రావణేశ్వరము
సాలంకమత్స్యకేశ్వరమును జూడు
మోలి న య్యాద్యమోద్యదయోర్వీధరము న
సురుచిర సముదిత జ్యోతిర్మయాంగ
ధరునిఁ దర్చించునగ దక్షిణద్వార
వరుని జ్యోతిస్సిద్ధవటనాథు భక్త
వరదుఁ బెన్నా నదీవరతటావాసు
శాశ్వతపుణ్య దర్శనముక్తి నలరు
విశ్వైకనుతు దైవవేశ్యాభుజంగు
దేవశిఖామణి దేవదేవేశు
భావించి చూడు మేర్పడ వటేశ్వరుని
నంచిత వలుమూలమందిరుఁ జూడు
మంద మూలస్థాన మైనసిద్ధేశ్వ
రంబును వరుణేశ్వరంబు యమేశ్వ
రంబు నాయుదయేశ్వరంబు సిద్ధేశ్వ
రం బిష్టసిద్ధేశ్వరంబు బ్రహ్మేశ్వ
రం బిష్టకామేశ్వరంబును జూడు,
చంద్రప్రభావుఁ బుష్పగిరివాస్తవ్యు
నింద్రేశ్వరునిఁ జూడు మింద్రపూజితుని

వందిత సురనరవ్రాతు రామేశు
నంద చూడుము త్రిపురాంతక దేవుఁ
బరశురామేశ్వరు బాలకర్ణేశు
హరుని శంకరు మల్లికార్జునుఁ జూడు,
కుండిప్రభునిఁ జూడు కుక్కుటేశ్వరుని
వెండి బ్రహ్మేశ్వర విమలేశ్వరముల
సగము నరుండును సగము మృగంబు
నగు నృసింహుఁడు హిరణ్యాక్షు వధింపఁ
గా వెండి శ్రీనీలగళుఁ బ్రతిష్ఠించి
యావాహనము సేయు నది యాదిగాగఁ
బూని సంతతమును బూజించునట్టి
యానరసింహేశ్వరాదిసిద్ధేశ
దానవేశాదులఁ దఱిఁదఱిఁ జూడు,
దానిపశ్చిమమునఁ దానొప్పుఁ బ్రమథ
నందియు నాకాశనందియుఁ గృష్ణ
నందియు నాబ్రహ్మనందియు సోమ
నందియు శ్రీమహానందియు గరుడ
నందియు భగవతీనందియు భీమ
నందియునుఁ బినాక నందియు నాగ
నందియు నా శివనందియు శ్వేత
నందియు భైరవనందియు గ్రామ
నందియు మఱి యేకనందియు గౌరి
నందియు మఱి ముక్తినందియు నింద్ర
నందియు నా భువనత్రయంబునను
సన్నుతాభీష్టార్థసౌఖ్యకారణము
లన్నందిమండలంబదె దానిఁ జూడు,
మున్వి కొప్పగుదాని యుత్తరంబునను
దూర్వాసతీర్థ ముత్సుకతమైఁ జూడు,
తరమిడిదానియుత్తరమునఁ జూడు,

మరుదగు నింద్రేశ్వరాదితీర్థములు
పంబియంతట బలభద్ర రామేశ్వ
రంబు లాంగూలతీర్థంబును జూడు.
తెల్లంబు గూర్మప్రతిష్ఠితుఁ గూర్మ
మల్లికార్జును పశ్చిమంబునఁ జూడు,
మాశ్చర్యకర మఘహర మీనగంబు
పశ్చిమద్వార ప్రభావంబుఁ జూడు,
తుంగభద్రాంకితో త్తుంగ భద్రాత
రంగణిచారుతీరమున మోక్షప్ర
దంబు దేవద్రోణి తత్పశ్చిమమునఁ
బంబి శ్రీవారాహ బ్రహ్మేశ్వరములు
వేదనాదావతీ వృత్తమధ్య ప్ర
వాదితస్థానవిభ్రమపంక్తిలోన
నమరుతీర్థాదిఛాయామల్లి కార్జు
నము గణికాసిద్ధ నాథమోక్షేశ్వ
రమును భుజంగేశ్వరము నారదేశ్వ
రమును బ్రహ్మేశ్వర రాజరాజేశ్వ
రంబు నగ్నీశ్వర రమ్యభోగీశ్వ
రంబును సోమేశ్వరంబును గలక
లేశ్వరంబును నాఁగ నే నెన్నంగఁ జను న
నశ్వ రైకాదశనవ్యతీర్థంబు
లాది శ్రీరుద్ర పాదాదితీర్థముల
కాదిమూలస్థాన మైన బ్రహ్మేశ్వ
రము బలభద్రేశ్వరముఁ గమలేశ్వ
రమును బాపవినాశనమును యాగేశ్వ
రమును నగస్త్యేశ్వరమును నాగేశ్వ
రము సప్తకోటీశ్వరముఁ గుక్కు టేశ్వ
రము నశ్వమేధేశ్వరము అమృతేశ్వ
రమును శ్రీరామేశ్వరము లక్ష్మణేశ్వ

రంబును ధవళేశ్వరంబు ధర్మేశ్వ
రంబును విమలేశ్వరంబు నింద్రేశ్వ
రంబును గర్గేశ్వరంబు వ్యాసేశ్వ
రంబును వరుణేశ్వరంబు మలక్ష
యేశ్వరంబును నుత్తరేశ్వరము నన-
లేశ్వర మేలేశ్వ రేశ్వరపంచ
లింగావలులు సప్తలింగము లుభయ
సంగమేశ్వరములు సకలేశ్వరంబుఁ
గనకేశ్వరంబు స్వర్గద్వారసీమఁ
దవరుబ్రహ్మేశ సీతాత్రిపురాంత
కాదులు నిజమల్లికార్జునంబును ని
పాదితభస్మేశ పరశురామేశ్వ
రంబులు హోమకుండంబు సిద్ధేశ్వ
రంబు మలక యరసకుండయుగము
ఖ్యాపితలీల నొక్కటఁజూడు, మిట్లు
సూపంగవలె నని చూపితిఁ గాని
యాపురిలింగసహస్రార్బుదములఁ
జూపఁ జెప్పంగ శేషునకు నక్కజము
లిన్నిగోట్లిన్నిగో ట్లిన్ని లింగంబు
లన్నను బ్రత్యవాయంబు సిద్ధించు
నెన్ని యుగంబుల నెందఱు విష్ణు
లెన్ని యుగంబుల నెందఱు బ్రహ్మ
లెన్ని యుగంబుల నెందఱు జిష్ణు
లెన్ని యుగంబుల నెందఱు మౌను
లెన్ని యుగంబుల నెందఱు దివిజు
లన్ని యుగంబుల నంద అందఱును
నిలఁ దమతమపేళ్ళ నీద్వారములను
గలయ నొక్కొక్కలింగంబును నిల్పి
పరిచితాభీష్టముల్ వడయంగ భువిని

బరగు లింగంబుల పాటిబందరువు
లది లింగపర్వతం బది లింగనగర
మది లింగమందిరం బది లింగవార్ధి
యది లింగమంజరి యది లింగరాశి
యదిలింగసురభూజ మదిలింగసురభి
గూడ నొప్పు శ్రీకుధరపశ్చిమము
సీడిత ద్వారమహిష్ఠతీర్థ ప్ర
కరము దూర్పున జగత్ ఖ్యాపితలీల
సరి నొప్పుఁ గూడలి సంగమేశ్వరము
దనరారు తుంగభద్రయుఁ గృష్ణవేణి
యును గూడఁ గూడలి యన నొప్పుఁ జూడ
దాని దూర్పున సముద్యన్మహామహిమఁ
దానొప్పు దివ్యతీర్థంబు నివృత్తి
మంగళతరతీర్థమహితవాస్తవ్యు
సంగమేశ్వరుఁ జూడు జనపాపహరణు
నిట దూర్పువలన యజ్ఞేశ్వరుఁ జూడు,
పటుదక్షయజ్ఞ ప్రభంజనస్థలిని
నమరేశు నప్పర్వతాగ్రదేశమున
నమితేశు శ్రీసిద్ధనాథునిఁ జూడు,
మురుతరతత్ప్రవాహోత్తరాశావి
హారణు నక్కడఁ జూడు మయ్యగస్త్యేశు
నయ్యగస్త్యేశున కమరేంద్రు దెస మ
హీయ్యసంప్రీతి సోమేశ్వరుఁ జూడు,
తలపోయ నయ్యుమాధరణీధరంబు
సెలువారు నదె సోమశిలఁ జూడు" మనుచు
నంత నాసోమశిలాదిమహేశ్వ
రాంతతీర్థావలు లట్ల చూపుడుఁ బ్ర
శస్తమై యొప్పు త్రింశద్యోజనముల
విస్తీర్ణమై భువి వెలయు లోకముల

సకలతీర్థములును సకలలింగములు
నొకమాత్రలోఁ జూపియును జూపిచూపి
"శ్రీపర్వతప్రదక్షిణమార్గగిరిని
రూపితలింగమూర్తులను దీర్థముల
శ్రీపర్వతంబుఁ జూచితిగదే కలయ
మీపండితయ్యకర్మిలి నట్ల చెప్ప,
కన్నారఁ జూడంగఁ గంటి గావునను
జెన్నార గిరి ప్రదక్షిణము సిద్ధించె
శ్రీపర్వతప్రదక్షిణము కోట్లఫలము
శ్రీ పార్వతీశుఁ డర్మిలి దయసేసె
నని చెప్ప మీమల్లికార్జునపండి
తున" కంచునప్పు డద్భుతము వహింప
మానుగా సర్వజ్ఞ మల్లికార్జునుఁడు
దా నదృశ్యం బయ్యెఁ దదనంతరంబ
చక్కన హర్షాశ్రుజలకణజాల
మక్కునఁ దొరుఁగ దోనయ్య సర్వజ్ఞ
మల్లికార్జునుఁడ శ్రీ మల్లికార్జునుఁడ
తెల్లంబుగా నుపదేశించె నసుచు
మల్లికార్జును మహామహిము శ్రీశైల
వల్లభు వాయార వర్ణన సేసి
మద్గురుదేవు సమ్యక్కరుణాస
ముద్గతమహిమాహోద్ధతిఁ జేసి
కంటిమీ శ్రీపాదకమలయుగంబు
మంటి ధన్యుఁడ నైతి మఱి యట్లుఁగాక
దిగ్ద్వారనికర విదిగ్ద్వారచయ వి
దిగ్ద్వారమధ్యప్రదిగ్ద్వారమార్గ
మార్గతత్త్వద్వార మధ్యాంతర రాళ
దుర్గాతి దుర్గంబు దుర్గ దేశముల
నటుగూడ శ్రీపర్వతాగ్రాధివాస

పటులింగ కోట్ల నేర్పడఁజూడఁ గంటిఁ
గలయు నిక్కాలయగాఁ గంటి శ్రీనగము
వలగొను శ్రీఫలావాప్తులుఁ గంటి
నిలఁ జరితార్థుండ నేనకా యనుచు
నలరుచు వెండియు సాష్టాంగ మెఱఁగి
పలుమాఱు గలగన్న భావంబు నాత్మఁ
దలపోసి తలపోసి తద్గిరి డిగ్గి
వెలటూరి కేతెంచి వింతసంతసము
దళుకొత్త గురుదేవు దర్శించి యతని
చరణాబ్జముల కిలఁ జాఁగిలి మ్రొక్కి
సరసాంతరంగుఁడై సంస్తుతి సేసి
వలగొని తన పోయివచ్చినవిధము
నలువలరార విన్నప మాచరించి
యలరి పండిత మల్లికార్జునారాధ్యుఁ
డిలఁ జరితార్థుండ నేన పోయనుచుఁ
దలఁచెఁగదా పర్వతస్వామి నన్నుఁ
జెలువొంద నీయట్టిశిష్యునికలిమి
నంచుఁ బ్రసాదకటాక్షనిరీక్ష
ణాంచితామృతవార్ధి నతని నోలార్చె

—:o:—